

THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

సపరివార పత్రిక

# స్వాతి

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM




పాఠక దేవుళ్ళకు నమస్కారం

ఎడిటర్

వేమూరి బలరామ్


ESTABLISHED 1984 | సంపుటి 35 | 17.8.2018 | సంచిక 7

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002


Life responds to you differently;
To carry you like no one else has been carried!





ముఖచిత్రం : రన్యారావు

## ఆనందం అంటే...

ఒకసారి ఒక వ్యాపారి సముద్రతీరంలో నడిచి పోతున్నాడు. అక్కడ ఒక జాలరి తన వలని పక్కనపెట్టి, పడుకుని సంతోషంగా కూనిరాగాలు తీస్తున్నాడు. అతను అంత ఆనందంగా ఉండడం చూసి ఆ వ్యాపారికి ఆశ్చర్యం కలిగింది.

అతని దగ్గరికి పోయి పలకరించాడు. వారి సంభాషణ ఇలా కొనసాగింది :

వ్యాపారి : ఈరోజు చేపలు పట్టడానికెళ్ళలేదా?

జాలరి : చేపలు పట్టి అమ్మేశానండి. వచ్చి విశ్రాంతి తీసుకుంటున్నాను.

వ్యాపారి : ఇంకా చేపలుపట్టవచ్చు కదా!

జాలరి : ఇంకానా! ఎందుకు?

వ్యాపారి : ఇంకా ఎక్కువ సంపాదించవచ్చుగా

జాలరి : సంపాదించి ఏమి చెయ్యాలి?

వ్యాపారి : నీ సొంతానికే ఒక పడవ కొనుక్కుని, మరిన్ని చేపలు పట్టవచ్చు కదా?

జాలరి : పట్టి ఏమి చెయ్యాలి?

వ్యాపారి : ఇంకా డబ్బు సంపాదించి, టీవీ, ఫ్రిజ్, కారు కొనుక్కోవచ్చు!

జాలరి : అప్పుడేమవుతుంది

వ్యాపారి: నువ్వు ఆనందంగా జీవించవచ్చు!

జాలరి : అయితే ఇప్పుడు నేను సంతోషంగా లేనా? అవన్నీ చేసినప్పుడు నేను సంతోషంగా ఉండగలనని మీ ఉద్దేశ్యమా?

ఆ వ్యాపారి ఆశ్చర్యపోయాడు. పై కథను చదివినప్పుడు మనం అభివృద్ధిని వెక్కిరించి, సోమరితనాన్ని ప్రోత్సహిస్తున్నామని అనుకోకండి! అభివృద్ధి అవసరమే! పురోగతి కావలసినదే! కాని అవి ఆనందాన్ని పంచగలుగుతున్నాయా? ఈ విషయాల్ని మనం మనస్సులో ఉంచుకోవాలి.

స్వామి అక్షరాత్మానంద


చందాను www.swatipublications.com వెబ్‌సైట్ ద్వారా చెల్లించవచ్చు
E-mail: advtswati@gmail.com swativja@eth.net

విడిప్రతి ₹20 12 నెలలకు ₹1076
విదేశాలకు సంవత్సర చందా (ఎయిర్ మెయిల్) ₹6666 (100 డాలర్లు)

Editor : VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM
Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad
Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433



సాక్షి

3.8.2018

## ఆత్మీయ పరామర్శనం

శ్రీయుతులు వేమూరి బలరామ్ గారికి, మంత్రాలలో గాయత్రీమంత్రాన్నీ, పరదేవతల్లో తల్లినీ సమానంగా పోల్చి చెప్తూ తల్లి స్థానాన్ని ఎంతగొప్పదో చెప్పారు ఋషులు.

(న గాయత్ర్యాః పరం మంత్రం నమాతుః పరదైవతమ్).

## అత్యధిక సర్క్యులేషన్‌గల ఏకైక తెలుగు వారపత్రిక



వేమూరి సీతారావమ్మ

అలాటి తల్లిలౌకిక దృష్టిప్రకారం మీకు లేనట్లుగా అనిపించినా నిరంతరం మీ శ్రేయస్సునే ఆకాంక్షిస్తూ ఉంటారనేది పరమసత్యం.

ఇక్కడ ఉన్నప్పుడు ఆమె అలా ఆకాంక్షించారు. కాబట్టే కదా మీరు ఇంతగా ప్రపంచ ప్రఖ్యాతిని పొందగలిగారు!

మీ అభివృద్ధిని చూసి ఆమె సంతృప్తితో పైలోకాలకి వెళ్ళినట్లే, అక్కడ కూడా ఆమె లోకాలన్నిటికంటె ఉన్నతమైన పరమపదాన్ని పొందుతారు అనేది నిశ్చయం.

ఆ జగదంబ మీకు మనఃప్రశాంతత ని ఇయ్యాలని ప్రార్థిస్తూ...

మైలవరపు శ్రీనివాసరావు సికింద్రాబాద్

## శ్రద్ధాంజలి

ఆత్మీయులు శ్రీ వేమూరి బలరామ్ గారికి, మీ మాతృమూర్తిగారు పూజ్య శ్రీమతి వేమూరి సీతారావమ్మగారు స్వర్గస్తులైనారు అన్న వార్త నన్ను తీవ్రంగా కలచివేసింది.

మీకు, మీ కుటుంబానికి తగిలిన ఈ విషాదానికి నేనెంతో బాధ పడుతున్నాను. స్వర్గస్తులైన మీ మాతృమూర్తిగారి ఆత్మకు శాంతి చేకూరాలని, బాధాతప్తులైన మీ యావన్మంది కుటుంబసభ్యులకు త్వరగా ఉపశమనం కలగాలని ఆ పరమేశ్వరుని మనః పూర్వకంగా కోరుకుంటూ నా హృదయ పూర్వక శ్రద్ధాంజలి ఘటిస్తున్నాను.

ఎస్.బి.శంకర్‌కుమార్ హైదరాబాద్

వచ్చేవారం స్పెషల్

డబ్బుతో బంధాలు

## అమ్మకు నివాళి

శ్రీయుత వేమూరి బలరామ్ గారి మాతృమూర్తి వేమూరి సీతారావమ్మ గారు లేని లోటు తీర్చలేనిది. ఆ భగవంతుడు ఆమె ఆత్మకు శాంతి చేకూర్చాలని, ఆమె దీవెనలు మన 'స్వాతి'కి ఉండాలని మనసారా కోరుకుంటూ...

లక్ష్మీ గిరిజకుమార్ రాజమహేంద్రవరం

స్వాతి ఎడిటర్‌గారి మాతృమూర్తి సీతారావమ్మగారి మరణం దురదృష్టకరం. శ్రీ బలరామ్‌గారికి మా ప్రగాఢ సానుభూతిని తెలియజేస్తున్నాం.

బి.వి.ఎస్.ప్రసాద్ చాగల్లు

# ఇది మంచి సమయం



**9.8.2018 నుండి 15.8.2018 వరకు శ్రీ విలంబి నామ సంవత్సరం, ఆషాఢ బహుళ త్రయోదశి నుండి శ్రావణ శుద్ధ పంచమి వరకు. దక్షిణాయనం, వర్షఋతువు.**

**9.8.2018 గురువారం**
తిథి: త్రయోదశి రా.10.45 వరకు
నక్షత్రం: ఆర్ద్ర ప. 8.25 వరకు. పునర్వసు తె. 5.44 వరకు
వర్జ్యం: సా. 7.05-8.30 వరకు
దుర్ముహూర్తం: ప.10.00-10.51 వరకు. మ. 3.08-3.59 వరకు
రాహుకాలం: మ. 1.45-3.20 వరకు
మంచిసమయం: ప.11.05-12.08 వరకు
సూర్యోదయం: 5.46కి
సూర్యాస్తమయం: 6.30కి

**10.8.2018 శుక్రవారం**
తిథి: చతుర్దశి సా. 7.08 వరకు
నక్షత్రం: పుష్యమి రా. 2.54 వరకు
వర్జ్యం: మ. 12.48-2.13 వరకు
దుర్ముహూర్తం: ప.8.19 నుండి 9.10 వరకు. మ. 12.35-1.36 వరకు
రాహుకాలం: ప.10.33-12.09 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 5.46కి
సూర్యాస్తమయం: 6.30కి

**11.8.2018 శనివారం**
తిథి: బహుళ అమావాస్య మ.3.28 వరకు
నక్షత్రం: ఆశ్లేష రా. 12.05 వరకు
వర్జ్యం: మ.2.12 నుండి 3.37 వరకు
దుర్ముహూర్తం: ఉ.5.45 నుండి 7.27 వరకు
రాహుకాలం: ప. 8.58-10.33 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 5.47కి
సూర్యాస్తమయం: 6.30కి

**12.8.2018 ఆదివారం**
తిథి: శ్రావణ శుద్ధ పాడ్యమి ప.11.54 వరకు
నక్షత్రం: మఘ రా. 9.27 వరకు
వర్జ్యం: ప. 10.46 నుండి 12.12 వరకు. తె. 4.41 లగా...
దుర్ముహూర్తం: సా.4.50 నుండి 5.41 వరకు
రాహుకాలం: సా. 4.55-6.32 వరకు
మంచి సమయం: మ. 1.11-2.15 వరకు
సూర్యోదయం: 5.47కి
సూర్యాస్తమయం: 6.29కి

**13.8.2018 సోమవారం**
తిథి: విదియ ప. 8.37 వరకు. తదియ తె. 5.45 వరకు
నక్షత్రం: పూర్వఫల్గుని సా. 7.09 వరకు
వర్జ్యం: శే.వ. ఉ. 6.08 వరకు. రా.వ. 1.49 నుండి 3.18 వరకు
దుర్ముహూర్తం : మ. 12.34 నుండి 1.25 వరకు. మ. 3.07-3.58 వరకు
రాహుకాలం: ఉ. 7.23-8.58 వరకు
మంచి సమయం: ప. 11.05 నుండి 12.25 వరకు
సూర్యోదయం: 5.47కి
సూర్యాస్తమయం: 6.28కి

**14.8.2018 మంగళవారం**
తిథి: చవితి రా. 3.28 వరకు
నక్షత్రం: ఉత్తరఫల్గుని సా.5.22 వరకు
వర్జ్యం : రా. 1.22-2.53 వరకు
దుర్ముహూర్తం: ప. 8.18-9.09 వరకు రా. 11.00-11.51 వరకు
రాహుకాలం: మ.3.19-4.54 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 5.47కి
సూర్యాస్తమయం: 6.27కి
మంగళగౌరీ వ్రతారంభం

**15.8.2018 బుధవారం**
తిథి : పంచమి రా. 1.52 వరకు
నక్షత్రం: హస్త సా. 4.13 వరకు
వర్జ్యం: రా. 12.05-1.39 వరకు
దుర్ముహూర్తం: ప.11.43-12.34 వరకు
రాహుకాలం: మ.12.09-1.45 వరకు
మంచిసమయం: ఉ.6.00-8.00 వరకు
సూర్యోదయం: 5.47కి
సూర్యాస్తమయం: 6.27కి
భారత స్వాతంత్ర్య దినోత్సవం



# మనము... మన స్వాతంత్ర్యం

స్వాతంత్ర్యం అంటే ఏమిటి! భారతదేశపు 72వ స్వాతంత్ర్యదినోత్సవ సమయాన దేశప్రజలు వేసుకుంటున్న ప్రశ్న ఇది.

స్వాతంత్ర్యం అంటే పరిపాలనాపరమైనదేనా! వలస పాలన నుండి స్వదేశీపాలనలోకి వచ్చినతర్వాత దేశప్రజలకు వచ్చింది ఓటువేసే హక్కు మాత్రమేనా! తొలి స్వాతంత్ర్య దినోత్సవం నాడు అప్పటినాయకులు తాము సాధించి తీరతామని చెప్పిన స్వతంత్రభారత దేశాన్నే నేడు మనం చూస్తున్నామా!

నేటి స్వాతంత్ర్య భారతం 1947, ఆగష్టు 15న కలలుగన్న స్వతంత్రం అనుభవిస్తున్నదా!

ఇది చాలామందికి ఎదురవుతున్న ప్రశ్న.

ప్రశ్న వెయ్యటం తప్పు కాదు కాని ప్రశ్నించటమే గొప్ప అనుకోవటం మాత్రం తప్పే. నిలదీయటం అనేది చాలా గొప్ప విషయం అనుకునేవారు తమను నిలదీస్తే ఎదురుదాడి చేయటమే వింత.

ఎవరు ఎవరిని నిలదీయాలి! ఎందుకు నిలదీయాలి! నిలదీయటానికి వారు ఎంచుకుంటున్న అంశం సరైనదేనా! ఈ ప్రశ్నలకు సరైన సమాధానాలు లేవు. తలచుకున్నకొద్దీ మనదేశపు స్వాతంత్ర్యం విషయంలో సందేహాలు పెంచుతున్నారు.

స్వాతంత్ర్యం వచ్చినవేళ తొలి ప్రధాని జవహర్ లాల్ నెహ్రూ చేసిన ప్రసంగం విన్నారా!

"మిగిలిన ప్రపంచమంతా నిద్రపోతున్నవేళ భారత దేశం మేలుకుంటున్నది" అంటూ సాగిన ఆయన 'ట్రస్ట్ విత్ డెస్టినీ' అనే ఆ ప్రసంగంలో కుల, మత రహిత సమాజ నిర్మాణం, సైంటిఫిక్ టెంపర్ పెంపొందింపచేసే లక్ష్యం మనముందుంచారు.అయితే నాటి ప్రధాని నెహ్రూ తన ప్రసంగంలోనే పప్పులో కాలేశాడు. ప్రపంచమంతా ఒక్కసారి నిద్రపోదు.

ఒక్కొక్కచోట ఒక్కోసమయంలో పగలుంటుంది. మరోచోట రాత్రి వుంటుంది. ఆ విషయం జవహర్‌లాల్ నెహ్రూకి తెలియదా! తెలిసేవుంటుంది.

అయినా తానొక మహోద్భుత భారతజాతి గొప్పతనం గురించి చెపుతున్న ఆనందంలో పొరపాటు దొర్లివుంటుంది. అయినా ఆ రోజు ఆయన తప్పును ఎవరూ ప్రశ్నించలేరు.

నేటికీ నెహ్రూని అభిమానించేవారు కోకొల్లలు. అయినావారెవరూ ఆ తప్పునే కాదు ఆ తర్వాత ఆయన పాలనాపరంగా చేసిన తప్పుల్లో ఏ ఒక్క దానినీ సరిగా ప్రశ్నించలేదు.

సరిగా స్వతంత్ర భారతదేశమంతా అలాగే సాగుతోంది.తమకు నచ్చినవ్యక్తి లేదా నాయకుడిని ప్రశ్నించరు. తాము వ్యతిరేకించేవారిని అతిగా ప్రశ్నిస్తారు. ఏమిటా అడ్డగోలు ప్రశ్నలు అని అడిగితే 'అసహనం' ప్రదర్శిస్తున్నారంటారు.

ఏడు దశాబ్దాల స్వతంత్ర భారతచరిత్ర ఇదే. మమ్మల్ని, మా భావజాల వర్గీయులనెవ్వరూ ఎటువంటి ప్రశ్నలు వెయ్యటానికీ వీలులేదు.

మేము చెప్పిందే వేదం. అది చరిత్ర అయినా, చట్టం అయినా రాజకీయ విధానం అయినా.

మేము అంతా చెప్పేశాం. ఇక దానిని ఒక్క అడుగు కూడా అటూ ఇటూ కదిలించటానికి వీలు లేదు అంటాయి ఆ వర్గాలు.

వారు ప్రశ్నించటానికి తప్పించి,సమాధానం చెప్పటానికి కాదు అనే వర్గాలవారివల్లనే వస్తోంది ఈ దేశ స్వాతంత్ర్యానికి ముప్పు. వీరంతా హక్కుల గురించి అడిగేవారే తప్పించి బాధ్యతలను గుర్తు చేసేవారు కాదు. కాబట్టే గత 70 ఏళ్ళలో మనదేశంలో స్వాతంత్ర్యం అనేది వెర్రితలలు వేసింది.

స్వతంత్రం అనేదానికి పరిమితులు వుంటాయని అర్థంచేసుకోని వర్గాలు రెచ్చిపోయి,నోరు పారేసుకుని ప్రవర్తిస్తున్న తీరు చూస్తుంటే అసలు మనం స్వాతంత్ర్యానికి అర్హులమా! అన్న సందేహం వస్తుంది.

స్వాతంత్ర్యం అంటే హద్దులులేని ప్రవర్తనఇవ్వటం కాదు. అర్ధరాత్రి ఒంటరిగా తిరిగే స్వాతంత్ర్యం ఉంటుంది. కాని ఆ తిరగటం అనేది అసభ్యంగా చేస్తే స్వాతంత్ర్యానికి ఆంక్షలు తప్పవు.

మీ వాక్స్వాతంత్ర్యం ఇతరులను నిందించటానికి ఇవ్వదు రాజ్యాంగం. ఎదుటివారి మనోభావాలను దెబ్బతీయనివిధంగా వాక్స్వాతంత్ర్యం ఉపయోగించుకోవాలి. ఇతరుల అభిప్రాయాలను, ఆలోచనలను గౌరవిస్తూ, తమ అభిప్రాయాన్ని స్పష్టంగా తెలియచెప్పటం నేర్చుకున్నవారే నిజమయిన స్వతంత్ర పౌరులు.భావస్వాతంత్ర్యం పేరుతో కారుకూతలు కూడదు.

ఎదుటివారిమీద ఏదోక అర్థం లేని ఆరోపణలుచేసే స్వాతంత్ర్యం ఏ దేశ రాజ్యాంగం ఇవ్వదు. కాలంతో వచ్చే మార్పులను అంగీకరించలేని ఏ భావజాలం సమర్థనీయం కాదు. ఎన్నడో ఎవరో ఏదో చెప్పారు, అది మార్చటానికి వీలులేదనే పిడివాదులు స్వతంత్రం తాము అనుభవించలేరు, తమ వర్గానికి ఆ స్వాతంత్ర్యం ఇవ్వరు.

ఇక తమ అభిప్రాయాలను గౌరవించనివారి మీద దాడులకు దిగుతారు. నలుగురిని కలుపుకుపోయి, తాము విభేదించినా గౌరవించి, కలిసిమెలిసి జీవించగలిగిన వాతావరణం కలిగినది లేదా నిర్మించబడినదే నిజమైన ప్రజాస్వామ్య భారతం.

అటువంటి ప్రగతిశీల జాతిని నిర్మించే ఆలోచనతో కలిసిరావటం మానేసి, రాజకీయ ఆధిపత్యం కోసం, పదవులకోసం మాత్రమే స్వతంత్ర నినాదాలను వాడుకునే రాజకీయపార్టీల వల్లనే.

మన స్వాతంత్ర భారతం జెండా వందనం, సైనిక కవాతు, ఎర్రకోట బురుజు ప్రసంగాలు అన్నీ కూడా లాంఛనాలకు పరిమితమయ్యాయి.

చేసే ప్రసంగాలకు, అనుసరించే విధానాలకు పొంతన కుదరనంతకాలం సమాజంలో ఘర్షణ వాతావరణం ఉంటుంది. ఆ సామాజిక ఘర్షణను తమకు అనుకూలంగా మలచుకునే నాయకులు, పార్టీలు ఉంటాయి.

దీనిని మార్చగలిగేది భారతీయ యువతే.

అలాంటి యువజనాభా అత్యధికంగా కలిగిన సమయం ఇది. ఈ సమయంలో యువత సంకుచిత అంశాలవైపు, భావోద్వేగాలు రెచ్చగొట్టే నాయకుల వైపు మళ్ళితే తమ స్వాతంత్ర్యాన్ని కోల్పోతారు.

ఆ విషయం ఈ తరం తెలుసుకోవటానికి స్వాతంత్ర్య దినోత్సవం ఉపయోగపడాలి.

భారత స్వాతంత్ర్య దినోత్సవం
15.8.2018

# EPSON
EXCEED YOUR VISION

7 PAISE BLACK

18 PAISE COLOUR*
Composite Colour*
*The total Colour CPP including black ink is 25 paise.

ఇల్లైనా లేదా
ఆఫీస్ అయినా
ఇండియా
## అతి తక్కువ ధరకే
ప్రింట్ చేస్తుంది




70 మిలీ రీఫిల్ ఇంకు బాటిళ్ళు
₹299 నుండి ప్రారంభం




## ఎప్సన్ ఇంక్‌ట్యాంక్ ప్రింటర్స్
## ప్రింట్ చేయడానికి ఏకైక మార్గం

**2.5 MILLION** HAPPY USERS IN INDIA

| | | | |
|---|---|---|---|
| భారతదేశపు నం.1* | 330 సర్వీసు సెంటర్లు | శ్రేణి | 1 సంవత్సరం |
| ఇంకు జెట్ ప్రింటర్ | 252 నగరాలు | ఎ4, ఎ3, కలర్/మోనో, వైఫై, ఎథెర్నెట్, డ్యూప్లెక్స్ | ఆన్-సైట్ వారంటీ+ ఉచిత ఇన్‌స్టాలేషన్ |

Visit jointherevolution.co.in or call

**ANDHRA PRADESH** Vijayawada **98852 22296**, Vizag **95028 85566**, Tirupati **75696 95781** **TELANGANA 99896 33221**






**Epson Helpline:** For product info or service - 1800 425 0011
For service - 1860 3000 1600 (9AM - 6PM) (Mon - Sat)

**Email:** think@eid.epson.co.in

SMS EPSON TO 58558

*Total Colour Cost Per Print - 18 Paise (CMY) + 7 Paise (K) = 25 Paise. Cost Per Print (CPP) is calculated based on quoted Page Yield for Black (4,500 pages) and Composite (Cyan/Magenta/Yellow - 7,500 Pages) ink bottles, and MRP of Epson genuine ink bottles. Quoted yields are based on the ISO 24711/24712 patterns of mixed text and colour graphics with Epson methodology. Quoted yields are based on the replacement ink bottles purchased. Part of the ink from the included bottles is used for printer startup so yields could be lower than those of replacement ink bottles. Actual yields vary due to reasons including images printed, print settings, temperature and humidity. Yields may be lower when printing infrequently or predominantly with one ink colour. Ink is used for both printing and printhead maintenance. All inks are used for both black and colour printing. Quoted CPP applicable for L130, L310, L360, L405 and L565. *Source: IDC Asia Pacific Quarterly Hardcopy Peripherals Tracker 2018 Q1. Volume and Value Market share of A4 Inkjet Printers and MFPs. Conditions apply.

# ఎన్నికలవేళ సంకుచిత ఉద్యమాలు

**ఎన్నికల్లో గెలిచి అధికారం చేపట్టటం రాజకీయ పార్టీల లక్ష్యం. ఇది ప్రజాస్వామ్యంలో అందరూ అంగీకరించే సూత్రం. ఐతే లక్ష్యం అందుకునేందుకు పార్టీలు ఎంచుకునే మార్గాలతోనే అసలు చిక్కు. "లక్ష్యం ఉన్నతమైనదంతమాత్రాన సరిపోదు. దానిని అందుకునేందుకు ఎంచుకునే మార్గాలు ఉత్తమంగా వుండితీరాలి" అన్నది మహాత్మాగాంధీ మాట. కాని మహాత్మాగాంధీ వారసులం అని చెప్పుకునే కాంగ్రెస్‌వారిలోనే కాదు, కాంగ్రెస్ పార్టీ విధానాలను విభేదించి వారికి పోటీగా పుట్టుకువచ్చిన పార్టీలలో కూడా లక్ష్యం అందుకోవటమే ముఖ్యమవుతున్నది.**

అందుకోసం అనుసరించే ఎత్తుగడలు అభ్యంతరకరంగా వుంటున్నాయి. ప్రజల మనోభావాలను ఎంతగా రెచ్చగొట్టగలిగే అంశం కనిపిస్తే దానిని భుజాన వేసుకుని ఉద్యమాలు లేపుతున్నారు.

ఆ అంశం ధర్మబద్ధమైనదా! సమాజానికి మేలు చేస్తుందా! అనే ఆలోచన వుండటంలేదు రాజకీయ పార్టీలకు.'విభజించి పాలించాడు' అని బ్రిటీష్‌పాలకులను తరచుగా నిందించే మన రాజకీయపార్టీలన్నీ వాస్తవంలో అనుసరిస్తున్నది ఆ బ్రిటీష్‌వాడు అనుసరించిన పద్ధతినే అన్నది వాస్తవం.

ప్రజలందరినీ ఒక్కజాతిగా చెయ్యటంకోసం స్వాతంత్ర్యసమరంలో నాయకులు ఎంతగానో పాటుపడ్డారు. అందరినీ ఏకంచేసి, స్వాతంత్ర్యమనే లక్ష్యంకోసంమిగిలిన విభేదాలనన్నింటినీ పక్కనపెట్టారు.

సామాజికంగా వున్న విభేదాలను చక్కదిద్దేప్రయత్నం చేసి,స్వాతంత్ర్యసమరంలో అన్ని వర్గాలను ఏకంచేసే యత్నం జరిగింది నాడు.

నూటికి నూరు శాతం వారు విజయం సాధించారని చెప్పలేకపోయినా చాలావరకు వారు అనుకున్నది సాధ్యమైందని అంగీకరించాల్సిందే.

భారతదేశం స్వతంత్రదేశంగా, గణతంత్ర రాజ్యంగా రూపుదిద్దుకుంది. కాని 72వ స్వాతంత్ర్య దినోత్సవవేళ! భారతదేశ పరిస్థితిని సమీక్షించుకుంటే మనమంతా భారతీయులుగా బ్రతుకుతున్నామా! అనే సందేహం కలుగుతుంది.

జాతిప్రయోజనాలకన్నా వర్గప్రయోజనాలకు పెద్దపీట వేస్తున్న ప్రజానీకం కనిపిస్తుంది. భారతీయుడినని గర్వంగా ప్రకటించుకోవటంలేదు.

కాని నేను ఫలానా మతస్తుడిని, ఫలానా సామాజిక వర్గానికి చెందినవాడినని గర్వంగా చెప్పుకోవటానికి ఉత్సాహం చూపిస్తున్నారు. తమ వర్గానికి లబ్ధి చేకూరితే చాలు, మిగిలిన సమాజం ఎటు కొట్టుకుపోయినా పరవాలేదన్న స్వార్థం నేటి జనాభాలో నెలకొంది.

ఇందుకు కొంతమేర భారత రాజ్యాంగమే కారణం. దేశప్రజలందరూ భారతీయులుగా, అందరూ చట్టం ముందు ఒక్కటిగా చూడబడేలా చేయాల్సిన రాజ్యాంగంలోనే తొలివాక్యమైన 'భారతీయులమైన మేము' అనేది తప్పించి మిగిలిన ఆర్టికల్స్ అన్నీ కూడా భారతీయులను విడదీసేవే.

మతప్రస్తావనలేని 'లౌకికరాజ్యం' అని మొదటచెప్పి ఆ తర్వాత చెప్పినదంతా మీరు భారతీయులు కాదు హిందువులు, ముస్లిమ్‌లు, క్రైస్తవులు అని చెప్పినదే. భారతీయ చట్టాలకు బదులు మతచట్టాలను అనుమతించటం రాజ్యాంగరచనలో చేసిన పెద్ద తప్పు.

అన్ని ప్రాంతాలనూ ఒక్కటిగా చూడవలసిన రాజ్యాంగం కొన్ని ప్రాంతాలను ప్రత్యేక ప్రాంతాలుగా ప్రకటించి, వాటికి ప్రత్యేకతలను కల్పించటం అనేది రెండవ తప్పు.

అన్ని సామాజికవర్గాలనూ ఒక్కటిగా చూడక కొన్ని వర్గాలను ప్రత్యేకంగా నెత్తినపెట్టుకోవటం కూడా తప్పే. అయితే



**నెహ్రూ, ఇందిర పేర్లు చెపితే ఓట్లు రాలే కాలం పోయింది.**
-పి.చిదంబరం, కాంగ్రెస్ నేత

ఇవన్నీ కూడా నాడు తాత్కాలికంగా, కొన్ని సంవత్సరాలకు పరిమితమైన ప్రత్యేకతలుగా చెప్పి, ఆ మేరకు ప్రజలను ఒప్పించి క్రమంగా వాటిని భారతజాతికి శాశ్వత గుదిబండగా బిగించిన నేర్పు రాజకీయ నాయకులది. రాజ్యాంగరచన చేసిన పార్టీగా కాంగ్రెస్ ఆ నిందను భరించాల్సిందే.

తమ నేతలు నాడు ప్రకటించిన తాత్కాలిక అంశాలు శాశ్వతంచేసిన ఘనత ఆ పార్టీ వారిదే. ఆ తాత్కాలిక ప్రయోజనాలపరంగా ఓటు బ్యాంక్‌లను నిర్మించుకున్న నేరం కాంగ్రెస్ పార్టీదే.

సమాజాన్ని విభజించి ఒక వర్గంవారిని రెండవ వారికి శత్రువుగా చూపించి, ఆ రెండవ వర్గానికి తాము రక్షకులుగా ప్రకటించుకుని తమకు అనుకూల ఓటరులుగా మలచుకోగలిగిన చతురత కాంగ్రెస్ పార్టీ ప్రదర్శించింది.

కాంగ్రెస్‌పార్టీ ఎత్తుగడలను దగ్గరనుండి గమనించిన ఇతర నేతలు తమ తమ సామాజికవర్గాలలో కొత్త ఆశలు లేపితే తాము అధికారంలోకి రాగలమని అర్థంచేసుకున్నారు. నాటినుండి కొత్త ఓటు బ్యాంక్ నిర్మాణం చేపట్టారు.

సమాజాన్ని చీలుస్తూ మన వర్గాలకు రాజ్యాధికారం అక్కరలేదా! అని ప్రశ్నిస్తూ ఆ యా వర్గాలలో భావోద్వేగాలను రెచ్చగొట్టి ఎన్నికల్లో గెలుపు సాధించారు. సామాజికంగా కొత్త నేతలు తెచ్చిన ఈ నినాదంతో కాంగ్రెస్ ఓటుబ్యాంక్‌కి బీటలు ఏర్పడ్డాయి.

ఇప్పుడు కాంగ్రెస్ పార్టీ వున్న హీనస్థితికి కారణం దేశంలో రాజకీయ,సామాజిక వాతావరణంలో వచ్చిన మార్పే. అటువంటి విభజన రాజకీయాలతో సమాజంలో చిచ్చు పెరుగుతుందని, దీర్ఘకాలంలో దేశానికి నష్టం జరుగుతుందని తెలిసినా అవే విధానాలను నేటికీ అన్ని పార్టీలూ అనుసరిస్తున్నాయి.

ఎన్నికలవేళ సంకుచిత అంశంపై భావోద్వేగాలు రెచ్చగొట్టి సొమ్ముచేసుకునే యత్నం అన్ని పార్టీలలో కనిపిస్తోంది.

ఇందుకోసం తమ పరిధిలో లేని కొత్త మతంగా గుర్తింపు, కొత్తగా రిజర్వేషన్లు వంటి వాగ్దానాలను నిర్లజ్జగా చేస్తున్నాయి పార్టీలు.రాజకీయనేతలు, పార్టీలు చేస్తున్న ఆ వాగ్దానాల సాధ్యాసాధ్యాలగురించి ఆలోచించని అమాయకపు జనం, రెచ్చగొట్టబడిన భావోద్వేగాలతో హింసాత్మక

# నా గిల్టీ ఫీలింగ్ పోయి నేనిప్పుడు చాల ప్రౌడ్‌గా ఫీలవుతున్నాను


www.anoos.com

నా పేరు శ్రీలక్ష్మి నాయుడు. నాకు ఫేస్ మొత్తం అన్‌వాంటెడ్ హెయిర్ ఎక్కువగా ఉండి, చాల ఇబ్బందిగా ఉండేది. పార్టీలకు, ఫంక్షన్‌లకు వెళ్ళాలంటే చాల గిల్టీగా ఫీలయ్యేదాన్ని. అందరూ నా వంకే చూస్తున్నట్లు, నా హెయిర్ గురించే మాట్లాడుకుంటున్నట్లు అనిపించేది. ఆ సమయంలో అనూస్ గురించి తెలిసి అనూస్‌కు వెళ్ళి వారిని సంప్రదించాను. వారు పర్మనెంట్ హెయిర్ రిమూవల్ ట్రీట్‌మెంట్ గురించి వివరించారు. వెంటనే ట్రీట్‌మెంట్ మొదలుపెట్టాను. రెగ్యులర్‌గా ట్రీట్‌మెంట్‌కి వెళ్ళినప్పుడు నాకొకటి అర్థం అయింది, హెయిర్ రిమూవల్ ట్రీట్‌మెంట్‌లో తొందరగా సమస్య తగ్గే విధంగా ఎప్పటికప్పుడు లేటెస్ట్ పద్ధతులను ఉపయోగిస్తారని. నా అన్‌వాంటెడ్ హెయిర్ తగ్గి చాల హ్యాపీగా ఫీలయ్యాను. ట్రీట్‌మెంట్ తీసుకున్న తరువాత ఇప్పటి వరకు నాకు అవాంఛిత రోమాల సమస్య రాలేదు. ఇపుడు ధైర్యంగా నలుగురిలోకి వెళ్ళగలుగుతున్నాను. అవాంఛిత రోమాలకు సరైన పరిష్కారం – అనూస్ పర్మనెంట్ హెయిర్ రిమూవల్ ట్రీట్‌మెంట్. అనూస్ సిస్టర్స్ చేసిన హెల్ప్ నేనెప్పటికీ మరచిపోలేను. ఐ యామ్ సో హ్యాపీ. నాలాంటి చాల మందికి మంచి ఫలితాలతో పరిష్కారాన్ని చూపుతున్న అనూస్ సిస్టర్స్‌కి, స్టాఫ్‌కి మనస్ఫూర్తిగా ధన్యవాదాలు, కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. అయితే నేను ఇక్కడ మరొకటి చెప్పాలి. నేను గుంటూరులో ఉంటాను. అనూస్ విజయవాడ బ్రాంచికి వెళ్ళి అప్పర్ లిప్ ట్రీట్‌మెంట్ మొదలు పెట్టాను. అనూస్ ట్రీట్‌మెంట్‌తో నా అన్‌వాంటెడ్ హెయిర్ చక్కగా తగ్గిపోయి, నాలో ఆత్మవిశ్వాసం, గుండె ధైర్యం, సంతోషం మొదలయింది. సంతోషం నగం బలం అంటారు కదా, నాకు ఆ సంతోషంలో ప్రెగ్నెన్సీ కన్ఫర్మ్ అయ్యి బాబు పుట్టాడు. అనూస్ ఇచ్చిన సంతోషంతోనే నాకు బాబు పుట్టాడని బలంగా నమ్ముతున్నాను. వాడికిప్పుడు 13 సం॥లు. ఆ తరువాత గుంటూరులో అనూస్ బ్రాంచి ఓపెన్ అయింది. అప్పటికే తగ్గిపోయిన నా అప్పర్ లిప్, చిన్ చూసుకొని మిగిలిన ఏరియాలలో కూడ ధైర్యంగా ట్రీట్‌మెంట్ మొదలుపెట్టాను. నాకు అనూస్‌కి వెళ్ళిన ప్రతిసారీ ఇష్టమైన వాతావరణం, అక్కడి టెక్నీషియన్ల ప్రవర్తన ఇష్టమైన ప్రపంచంగా అనిపించింది. సొంత ఇంట్లో బంధువులతో ఉన్నట్లు, నేను అక్కడ హక్కుగా గారాబం చేయించుకొనే ప్లేస్ అనిపించింది. ఇతర క్లినిక్స్‌లో ట్రీట్‌మెంట్ తీసుకునేవారిని పలకరించినప్పుడు, వారి సమస్య తగ్గలేదని విన్నప్పుడల్లా నేను వారికి నా ముఖం చూపించి, చూడండి ఇప్పటికి 13 సం॥లు అయింది, అసలు నేనే ఆ సమస్యను మరచిపోయాను. మీరు అనూస్‌కి తప్ప అసలు ఎక్కడికీ వెళ్ళొద్దు అని చెబుతుంటాను. అనూస్ ఇచ్చిన ధైర్యం, నా విషయంలో జరిగిన సంఘటనలు నేను ఎప్పటికీ మరచిపోలేను. సాటి మహిళల విషయంలో వారొక చైతన్యం. అక్కడికి వెళ్ళిన ప్రతి స్త్రీకి వారికున్న ధైర్యం నూరి పోస్తారు. అక్కడి వాతావరణం చూస్తే ఇది మన అనూస్, మన ఇల్లు అని అనిపిస్తుంది. నాకు ఎదురైన ఈ చక్కటి అనుభవం ప్రతి స్త్రీ కూడ అనుభవించాలన్న ఉద్దేశ్యంతో..... మీ శ్రీలక్ష్మి నాయుడు 🙏🙏






## మీకు జుట్టుకు సంబంధించిన ప్రతి సమస్యకు సరైన పరిష్కారం కావాలంటే ?

- మీకు జుట్టు నల్లగా ఉంటే అనూస్ హెయిర్ కేర్ ప్యాక్‌ను ప్రతి వారం వాడండి.
- మీకు తెలువు జుట్టు ఇవుడిప్పుడే వస్తూ ఉంటే అనూస్ హెన్నా ప్రతి వారం వాడండి
- మీకు తెలువు జుట్టు ఎక్కువగా ఉంటే, మూడు వారాలు హెన్నా మరియు ఒక వారం అనూస్ బ్లాక్ ఎక్స్‌పర్ట్ వాడండి.
- మీకు చాల ఎక్కువ తెలువు జుట్టు వచ్చినట్లైతే ప్రతి వారం అనూస్ బ్లాక్ ఎక్స్‌పర్ట్ అప్లై చేయండి. జుట్టుకు వచ్చే ప్రతి సమస్యకు ఇక చెక్ పెట్టండి.

ఎందుకంటే అనూస్ సిస్టర్స్ తమ జుట్టు కోసం పైన చెప్పిన విధంగా కేర్ తీసుకొంటారు కాబట్టి.

**Black Xpert URL :** https://www.youtube.com/watch?v=JIuUHIbfGxk&t=16s

**Henna URL :** https://www.youtube.com/watch?v=A0uyzQHlukg&t=3s

మా సేవలకై మీ ప్రశ్నలను ఈ నంబరుపై 99596 16106 సంప్రదించండి - అనూస్ సిస్టర్స్

అనూస్ వీడియోస్‌కై మీ వాట్సప్ నంబరును ఈ 91000 34054 కు షేర్ చేయండి, ఆన్‌లైన్‌లో కొనాలంటే www.anoos.com

అనూస్ హెర్బల్ ప్రోడక్ట్స్ మీ దగ్గరలోని సూపర్ మార్కెట్స్‌లోగాని, షాపులోగాని పొందాలంటే, పదే పదే అడిగి ఒత్తిడి పెంచండి.

**ANOO'S**
SALON & CLINIC
TELANGANA | ANDHRAPRADESH
KARNATAKA | USA

Watch Anoo's Programme
Every Saturday in STAR MAA at 7.30 AM
Every Saturday in HMTV at 1.30 PM.
Every Saturday in CVR Health at 2.30 PM.
Every Saturday in V6 at 3.30 PM

*Services & International Beauty School Courses:* 99596 16106
*Product Enquiries:* 9100034054

ఉద్యమాలలో చేరుతున్నారు. ఈ ఉద్యమాలు ఎన్నికలవరకే నడుస్తాయని, ఆ తర్వాత ఆ అంశం రాజకీయనాయకులు, పార్టీలు మరిచిపోతారన్న విషయం ప్రజలు నిశితంగా గమనించటంలేదు.

గతంలో ఎన్నో పర్యాయాలు అటువంటి ఎత్తుగడలే పార్టీలు వేసిన విషయం తెలిసి కూడా కొన్ని సామాజికవర్గాలు తిరిగి రాజకీయ ఉచ్చులో చిక్కుకోవటం చూస్తే బాధ వేస్తుంది.

రాజకీయాలు ప్రజలను ఎంతగా మభ్యపెడతాయనేందుకు తాజా ఉదాహరణ కర్ణాటక రాష్ట్ర ఎన్నికలముందు అక్కడి కాంగ్రెస్ ప్రభుత్వం తెరమీదికి తెచ్చిన లింగాయత్‌లను కొత్తమతంగా గుర్తిస్తామన్న హామీ. అసలు ఒక కొత్త మతాన్ని ప్రభుత్వాలు సృష్టించగలవా! మతాలు ఎలా ఏర్పడతాయి?

మతానికి అర్థం ఏమిటి! అనే ప్రశ్నలు నాటి సిద్ధరామయ్య ప్రభుత్వం వేసుకోలేదు. సెక్యులర్ రాజ్యాంగంలో కొత్త మతం గోల ఏమిటని ఆ పార్టీని మేధావులు ప్రశ్నించలేదు. మేధోవర్గం కూడా పార్టీలపరంగా చీలిపోయింది.

లింగాయత్‌ల కొత్త మతం అనే కాంగ్రెస్ ప్రతిపాదన ఒక రాజకీయ 'మాస్టర్ స్ట్రోక్' అని సమర్థించిన మేధో వర్గాలు లేకపోలేదు.

ఎన్నికలు ముగిశాయి. ఫలితాలు కాంగ్రెస్ పార్టీ ఆశించినరీతిలోరాలేదు. ఆ పార్టీ 'మాస్టర్‌స్ట్రోక్' తుస్సుమంది. లింగాయత్‌ల పట్ల నిజంగా అంతగా ప్రేమ వుంటే వారికి చేసిన ప్రత్యేక మత అంశాన్ని ఎన్నికల తర్వాత కూడా ముందుకు తీసుకువెళ్ళాలి.

కాని ఆ పార్టీ సీనియర్‌నేత వీరప్పమొయిలీ చేసిన ప్రకటన కాంగ్రెస్ కుట్రపూరిత విధానాన్ని తెలుపుతుంది."లింగాయత్‌లకు ప్రత్యేకమతం అనే వాగ్దానం వల్లనే మన పార్టీ ఎన్నికల్లో ఓడిపోయింది.

ఆ వాగ్దానం అలాగే పట్టుకుని కూర్చుంటే 2019 లోక్‌సభ ఎన్నికల్లో మన పార్టీకి తీవ్రనష్టం కలుగుతుంది కాబట్టి ఆ అంశాన్ని వెంటనే వదిలేయాలి. మారిన మనవిధానం ప్రజలలోకి తీసుకువెళ్ళాలి" అన్నది వీరప్పమొయిలీ ప్రకటన సారాంశం.

దీనినిబట్టి సామాజిక భావోద్వేగాలు ఎలా సృష్టించబడతాయి, ఎలా సమాజాన్ని చీలుస్తాయి ఆ తర్వాత ఆయా వర్గాలు గాలికి ఎలా వదిలేయబడతాయి అనేది అర్థంచేసుకోవచ్చు. కర్ణాటక ఎన్నికలకు ముందు గుజరాత్‌లో ఎన్నికలు జరిగాయి.

ఆ ఎన్నికలకు ముందు ఆ రాష్ట్రంలో రేపిన పెద్ద ఉద్యమం 'పటేళ్ళ రిజర్వేషన్' డిమాండ్‌కి సంబంధించినది. ఆ ఉద్యమానికి కాంగ్రెస్ పార్టీ పూర్తి మద్దతునిచ్చింది. ఎన్నికలు అయిపోయాయి. కాంగ్రెస్ ప్రతిపక్ష స్థానంలో నిలిచింది.అసెంబ్లీలో సీట్లు పెరిగాయి.

గుజరాత్‌లో ఎన్నికల ఫలితాలు వచ్చి పది నెలలు అవుతోంది. తిరిగి ఒక్కసారంటే ఒక్కసారి పటేల్ రిజర్వేషన్లగురించి కాంగ్రెస్‌గాని, ఆ ఉద్యమాన్ని నడిపిన యువనేత హార్దిక్ పటేల్‌గాని మాట్లాడటంలేదు. ఇప్పుడు మహారాష్ట్రలో మొదలైంది కొత్త చిచ్చు.

ఎన్నికలు వస్తున్నాయి. కాబట్టి ప్రజల మనోభావాలతో ఆటలు మొదలయ్యాయి. మరాఠాల రిజర్వేషన్ల ఉద్యమం హింసాత్మకం. ఆ రిజర్వేషన్ల కోసం అమాయకులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఉద్యమంలో హింసకి బలవుతున్నారు. ఉద్యమకారులపై పోలీసుకేసులు అవీ షరామామూలే.

2019 ఎన్నికలు దగ్గరవుతున్నకొద్దీ ఇంకా కొత్త కొత్త ఉద్యమాలు, ఇతర సామాజికవర్గాలకు సంబంధించినవి వస్తాయి.అటువంటి సంకేతాలు యు.పి.లో రాజస్థాన్‌లో ఇప్పటికే వెలువడుతున్నాయి.

రాబోయే నాలుగైదు నెలలలో రాజస్థాన్‌లో గుజ్జర్లను,యు.పి.లో జాట్‌వర్గాలను రెచ్చగొట్టి ఉద్యమం మొదలుపెడతారు. ఆంధ్రప్రదేశ్‌లో కాపురిజర్వేషన్ ఉద్యమం పెంచేందుకు ప్రయత్నాలు సాగుతున్నాయి. తెలంగాణలో బి.సి.ల రిజర్వేషన్లశాతం పెంపుదల,

☞ స్వాతంత్ర్య దినోత్సవవేళ ఓటరు మారాలి
☞ సంకుచిత ఉద్యమాలకు బలికాకూడదు
☞ సమాజాన్ని చీలుస్తున్న పార్టీలకు పాఠం చెప్పాలి
☞ ఓటరు అప్రమత్తతే ప్రజాస్వామ్యానికి శ్రీరామరక్ష

ముస్లిమ్‌ల 12శాతం రిజర్వేషన్ల డిమాండ్ అధికారంలో వున్న టి.ఆర్.ఎస్. తమ ఎన్నికల ఆయుధంగా వాడుకోబోతున్నది. ఈ ఉద్యమాల వెనకున్నది రాజకీయంగా కొన్ని పార్టీల లబ్ది ఆలోచన. అధికారంలోకి రావటానికి పనికివచ్చే ప్రత్యేక అంశమే.

కేటాయింపుల వాగ్దానాలు రాజకీయపార్టీలు తమంతటతాము తెరమీదికి తెస్తాయి.

2014 ఎన్నికల్లో గెలుపుకోసం తెలుగుదేశం పార్టీ కాపులను బి.సిల్లో చేర్చే వాగ్దానం చేసింది.అది అంత సులభం కాదని ఆ పార్టీ అగ్రనేతకు తెలుసు. ఐనా వారి అప్పటి అవసరం అది. ఆ తర్వాత నిర్ణయం అమలు కుదరక పలురకాల 'టర్న్' తీసుకోవాల్సి వస్తోంది. ఇదే పరిస్థితి తెలంగాణ సి.ఎమ్.ది.

అడ్డగోలుగా రిజర్వేషన్ల వాగ్దానాలు చేసి వాటి అమలు తమ పరిధిలోనిదికాదని తెలుసుకుని బాధ్యతను కేంద్రం 'కోర్టు'లోకి విసిరి తాము తప్పించుకోవాలనుకుంటున్నారు. చంద్రబాబునాయుడు ఐనా, కె.సి.ఆర్. ఐనా తాము 'ముందుకుపోవాలనుకుంటే' అన్ని వర్గాలను కలుపుకునిపోవాలేగాని,

సమాజాన్ని కులం, మతం పేరుతో చీల్చుకుంటూ వెళ్ళి అధికార గమ్యం చేరుకోగలమనుకుంటే దీర్ఘకాలంలో నేడు కాంగ్రెస్‌పార్టీకి పడిన శిక్షే ప్రాంతీయ పార్టీలకు ప్రజలు వేస్తారు. నేరం ఎవరు చేసినా శిక్ష ఒకేలా వెయ్యగలిగిన విజ్ఞత ఓటర్లలో వుంది.అది ఎన్నో సార్లు మనదేశ ఎన్నికల్లో రుజువైంది కూడా.

అయినా భావోద్వేగాలతో ఆటలు ఆగటం లేదు. తాజాగా ఆ జాబితాలోకి అసోంలోని పౌరసత్వం అంశం కూడా చేరుతున్నది. సమస్య వున్న అసోంతో పాటుగా బెంగాల్‌లోనూ హింసాత్మక ఉద్యమం వైపుకు వెళుతుంది ఈ పౌరసత్వ సమస్య.

ఇది మతంపరంగా చీల్చేందుకు పన్నినకుట్రగా ఆరోపణ వస్తోంది. అసోంలోని మతపరమైన అంశం తీసుకుని దేశవ్యాప్తంగా సమాజాన్ని రెండుగా చీల్చి మెజారిటీ వర్గం ఓట్లు తమ ఖాతాలో వేసుకుంటుంది బిజెపి అనేది భావన. ఈ అంశంమీద తాము ఉద్యమం చేపడతామని బెంగాల్‌ముఖ్యమంత్రి మమతాబెనర్జీ ఇప్పటికే ప్రకటించింది.

బిజెపియేతర పార్టీలన్నీ అదే ఆలోచనతో ఉద్యమిస్తాయి. ఎన్నికల వేళ రెచ్చగొట్టబడే ఉద్యమాల గత చరిత్రలు తిరగేస్తే అమాయకప్రజలు బలి పశువులు, రాజకీయనేతలు లబ్దిదారులనేది స్పష్టం.

ఒక్కరంటే ఒక్కనాయకుడు గాని, వారి కుటుంబ సభ్యులుగాని ప్రాణ త్యాగం చెయ్యటంచూశామా! ఉద్యమం సఫలమైన తర్వాత ఉద్యమ నాయకుల కుటుంబసభ్యులు భారీగా లబ్ది పొందారు. అమరులు అనామకులుగా మిగిలిపోయారు. ఏ ఉద్యమం చూసినా ఇదే తంతు.

ప్రజలను రెచ్చగొట్టి ముందుకునెట్టి తాము తెలివిగా తప్పుకునే రాజకీయ నేతల కాలం ఇది.అది బషీర్‌బాగ్‌సంఘటన ఐనా, తునిలో రైలు తగలపెట్టిన ఘటన ఐనా అమాయకులకే శిక్షలు, మరణాలు.

నాయకులకు మాత్రం అద్భుతమైన ప్రచారం, కొందరికి అధికారం. ఈవిషయం ప్రజలు ఎప్పటికి అర్థంచేసుకుంటారో! తమ డిమాండ్‌ని తెలియచెప్పేందుకు ఇతర ప్రజాస్వామ్య విధానాలున్నాయన్న విషయం మరచిపోతున్నారు.మూకుమ్మడిగా ఒకచోటచేరి, నేతల భావోద్వేగప్రసంగాలకు ప్రభావితమైనయువత తమ జీవితాలను నాశనం చేసుకుంటున్నారు.

అసాధ్యమైన వాగ్దానాలతో ప్రజలను మోసం చేస్తున్న నేతలను నిలదీయాలి. ఎన్నికలవేళ ప్రచారానికి వచ్చే నేతల ప్రచారశైలిని, వారి గత వాగ్దానాలు, ప్రస్తుత వాగ్దానాలు నిశితంగా పరిశీలించటం ఓటరు బాధ్యత. సంకుచిత ఆలోచనలతో,

సమాజాన్ని చీల్చే ఎజెండాతో ప్రజలవద్దకు వచ్చి, వారి భావోద్వేగాలతో ఆటలాడుకునే ప్రచారం చేపట్టే ప్రతి పార్టీకీ బుద్ధిచెప్పాలి. ఇది సరైన ఎజెండా కాదని, అభివృద్ధి అంశాల ఆధారంగా తయారై రమ్మని జాతీయ, ప్రాంతీయ పార్టీలనే తేడా లేకుండా అన్నింటికీ బుద్ధిచెప్పాల్సిన సమయం ఆసన్నమైంది.

72వ స్వాతంత్ర్య దినోత్సవం వేళ అటువంటి జ్ఞానోదయం పార్టీలకు కలిగిస్తామనే ప్రతిజ్ఞ ప్రతి ఓటరు తమకు తాముగా చేసుకోవాలి.

డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు

# ఎముకలలో నొప్పి, తిమ్మిర్లు బోన్ క్యాన్సర్ లక్షణాలు

## CT, MRI స్కాన్ ద్వారా గుర్తించవచ్చు

మన శరీరానికి ఒక ఆకారాన్ని, ఎత్తుని, బరువుని నిర్ణయించేది మన ఎముకలే. అంతేగాకుండా మన శరీరంలోని ముఖ్యమైన అవయవాలన్నింటిని మెదడు, గుండె, ఊపిరితిత్తులు, మూత్ర పిండాలను వివిధ ఆకారాలలో ఉండే ఎముకలు రక్షిస్తూ ఉంటాయి. పుట్టినప్పుడు మన శరీరంలో ఎముకలు 300 వరకు ఉంటాయి కాని పెరిగేకొద్ది వీటిలో చాలా వరకు ఒకదానికొకటి కలిసిపోయి 206 గా మారుతాయి. మన శరీరంలో అతి పెద్ద ఎముక తొడ ఎముక అయితే అతి చిన్న ఎముక మన చెవిలో ఉండే స్టేపిస్ (Stapes), మన శరీరపు ఎత్తుని దాదాపుగా నిర్ణయించేది మన తోడ ఎముక (ఫీమర్), ఎందుకంటే మన శరీరపు ఎత్తు 1/4 వంతు వరకు ఈ ఎముక మీద ఆధారపడి ఉంటుంది కాబట్టి. ఆస్టన్ (Osteun) అనే గ్రీకు పదం నుండి ఆస్టియాలజి పుట్టింది. అస్టన్ అంటే ఎముకలు అని అర్థం.

ఎముకల ఉపరితలం గట్టిగా ఉండి లోపల స్పాంజిలాగా ఉంటుంది దానినే బోన్‌మ్యారో అంటారు. ఎర్ర రక్తకణాల ఉత్పత్తి బోన్‌మ్యారో నుండి జరుగుతుంది. మన ఎముకల గట్టిదనం స్త్రీ పురుషుడు అనే తేడా మీద చిన్నప్పట్టి నుండి మన అలవాట్ల మీద, జాతి, వాతావరణం ఇలాంటి అనేక విషయాలమీద ఆధార పడి ఉంటుంది. చిన్నప్పటి నుండి అవుట్ డోర్ గేమ్స్ ఆడుతూ, వ్యాయామం చేస్తూ ఉండేవారికి ఎముకలగట్టిదనం ఎక్కువగా ఉంటుంది. వయస్సుపైబడే కొద్ది మరీ ముఖ్యంగా స్త్రీలలో ఎముకలు మరింత పల్చగా, పెళుసుగా మారి తెలికగా ఫ్రాక్చర్స్ గురవటాన్నే "ఆస్టియో పొరోసిస్" అంటారు. మెనోపోజ్ దశకు చేరుకున్న స్త్రీలలో ఈ సమస్య మరీ ఎక్కువ. చిన్నప్పటినుండీ శరీరానికి కొంచెం ఎండ తగలనిస్తూ కాల్షియం లోపాలు తలెత్తకుండా జాగ్రత్తపడితే మంచిది, ఆస్టియోపోరోసిస్‌తో పాటు ఎముకలకు సంబంధించి బోన్ టి.బి., బోన్ క్యాన్సర్స్ వంటి సమస్యలు చూస్తూ ఉంటాము.

చాలామందిలో బోన్ టి.బి., బోన్ క్యాన్సర్స్ లక్షణాలు దాదాపు ఒకెలా ఉండటం వలన పొరబడటం కూడా జరుగుతు ఉంటుంది. ఎముకల మీద గడ్డ వచ్చే ప్రదేశాన్ని బట్టీ లక్షణాలు ఆధారపడి ఉంటాయి. క్యాన్సర్‌కు సంబంధించిన గడ్డ అయినా, కాకపోయినా ఎముక మీద గడ్డ ఏర్పడితే ఫ్రాక్చర్స్ గురయ్యే అవకాశం ఎక్కువ. క్యాన్సర్ గడ్డ వలన ఎముక నొప్పిగా ఉండటం, జ్వరం, రాత్రి చెమటలు, బరువు తగ్గటం, గడ్డ వచ్చిన ప్రదేశంలో ఎముకలు విరగటం వంటి లక్షణాలు కన్పిస్తూ ఉంటాయి. గడ్డ తొలిదశలో చాలా చిన్నగా కన్పించటం వలన ఎక్స్‌రే పరిక్షతో నిర్ధారించలేకపోవచ్చు. అందుకనే లక్షణాలు కన్పించినప్పుడు నిర్ధారణ చేయటానికి CT, MRI స్కాన్ వంటి పరీక్షలను చేస్తారు. క్యాన్సర్ కాని గడ్డ అయితే గుండ్రంగా, మెల్లగా పెరుగుతుంది. క్యాన్సర్ కణితి అయితే ఖచ్చితమైన ఆకారం లేకుండా వేగంగా పెరుగుతుంది. కణితి కొంచెం పెద్దగా ఉంటే ఎక్స్‌రేలలో, చిన్న గా ఉంటే MRI, CT స్కాన్‌లలో బయటపడ్తుంది. గడ్డ ఏరకమయినదో నార్దారించటానికి బయాప్సి పరీక్ష చేస్తారు.

బోన్ క్యాన్సర్ గడ్డలలో ఆస్టియో సార్‌కోమా, ఈవింగ్స్ సార్‌కోమా (Ewings Sarcoma) కాండ్రో సార్‌కొమా, ఫైబ్రోసార్‌కోమా, కార్టోమా అనే రకాలుంటాయి. వయస్సు మీద ఆధారపడి ఈ గడ్డలు వచ్చే ప్రమాదం ఉంటుంది. ఆస్టియో, సార్‌కోమా, ఈ విగ్స్ సార్‌కొమా చిన్న వయస్సు వారిలో ఎక్కువగా కన్పిస్తే కాన్‌డ్రో సార్‌కొమా మధ్య వయస్సులో కన్పించే అవకాశం ఉంటుంది.

చాలావరకు బోన్ క్యాన్సర్స్ సెకండరిగానే ఉంటాయి, శరీరంలో మిగతా భాగాలలో వచ్చిన క్యాన్సర్ ఎముకలకు వ్యాప్తి చెందటం (మెటాస్టాసిస్) ఎక్కువగా చూస్తూ ఉంటాము, ఎముకలోనే క్యాన్సర్ ముందుగా రావటం కొంత వరకు అరుదుగా జరుగుతుందనే చెప్పుకోవచ్చు, ఒక్కొక్కసారి లంగ్, ప్రోస్టేట్ ఇలా మిగతా భాగాలలో వచ్చిన క్యాన్సర్ ఎముక మీద గడ్డలాగా ముందుగా బయట పడవచ్చు.

అన్ని క్యాన్సర్స్ లాగానే సర్జరి, రేడియో, కీమో థెరఫిలప్రాధాన్యత ఈ క్యాన్సర్‌కుకూడా ఉంటుంది. క్యాన్సర్ గడ్డ వచ్చిన ప్రదేశాన్ని తీసివేసినప్పుడు, చిన్నగా ఉంటే సిమెంటింగ్, గ్రాఫ్టింగ్ వంటి పద్ధతులలో సరిచేస్తారు. ఎముక తీయవలసిన ప్రదేశం ఎక్కువగా ఉంటే బోన్ బ్యాంక్ నుండి ఎముకలను తీసికొని వేయటం లేక మెటల్ ఇంప్లాంట్స్ వాడటం జరుగుతూ ఉంటుంది. క్యాన్సర్ కణిత పెద్దగా ఉంటే సర్జరి కంటే ముందు కీమో, రేడియో థెరఫిలతో కణితిని చిన్నగా చేసి తర్వాత సర్జరి చేయటం కూడా జరుగుతూ ఉంటుంది. ఈ క్యాన్సర్ సర్జరి తర్వాత కొత్తగా పెట్టిన ఇంప్లాంట్స్‌కు అలవాటుపడటానికి ఫిజియోథెరఫి, రీహాబి లిటీషన్, ప్రాముఖ్యత ఎక్కువగా ఉంటుంది.

ఎముకలక్యాన్సర్ రావటానికి సంబంధించి




**Dr. Ch. Mohana Vamsy**
Chief Surgical Oncologist
Omega Hospitals, Hyderabad.
Ph : 98480 11421
**Kurnool : 08518 273001**
**Guntur : 0863 2223300**


ఖచ్చితమైన కారణం తెలియదు కాబట్టి నివారణ మన చేతుల్లో లేనట్లే. అయితే సెకండరి బోన్‌క్యాన్సర్స్ ఎక్కువ కాబట్టి మిగతా క్యాన్సర్స్‌ను ముందుగా గుర్తించి ట్రీట్‌మెంట్స్ తీసుకోగలిగితే ఈ క్యాన్సర్‌ను కూడా నివారించగలుగుతాము క్యాన్సర్ వచ్చిన ఎముకలను గట్టి పరచటానికి బిస్ పాస్ఫోనేట్స్ ఇంజక్షన్స్ ఇవ్వటం జరుగుతుంది.

ప్రోస్టేట్ క్యాన్సర్, బ్రెస్ట్ క్యాన్సర్, లంగ్ క్యాన్సర్స్‌కు మిగతా క్యాన్సర్స్ కంటే ఎక్కువగా ఎముకలకు పాకే గుణం ఉంటుంది. బోన్ క్యాన్సర్‌కు గురయినప్పుడు శరీరంలో కాల్షియం లెవల్స్‌కూడా పెరగవచ్చు. క్యాన్సర్ కణితి వలన నరాలమీద ఒత్తిడి ఏర్పడటం వలన కాళ్లలో లేదా, చేతులలో బలహీనత, తిమ్మిర్లు, తీవ్రమైన నొప్పి వంటి లక్షణాలు కూడా కన్పిస్తాయి.

శరీరంలో ఎక్కడయినా మార్పు కన్పించినా, లక్షణాలలో మార్పులు కన్పించినా జాగ్రత్త తీసికొని క్యాన్సర్ కణాన్ని తొలిదశలో గుర్తించటం, ట్రీట్‌మెంట్స్, డాక్టర్ నిర్ధారించిన కాలవ్యవధి ప్రకారం సర్జరి తర్వాత లేదా ముందు లేక సర్జరి లేకుండా అవసరమైన కీమోథెరఫి, రేడియోథెరఫి తీసుకోవటమే కాకుండా శరీరంలో ఏ అవయవంలో అయినా క్యాన్సర్ బయటపడి ట్రీట్‌మెంట్స్ తీసుకొన్నా తర్వాత మళ్లీ వచ్చే అవకాశం ఆ అవయంలో కాని, మిగతా అవయువాలలో కాని, ఎముకలలోని ఎక్కువ కాబట్టి వైద్యులు నిర్ధారించినట్లు కనిసం 5 ఏళ్ల వరకు (ఐదు సంవత్సరములపాటు) చెకప్స్ చేయించుకుంటూ ఉండటం తప్పనిసరి.

(సశేషం)

# సరిగమనం

రా మ్మూర్తి, లత ప్రేమించుకున్నారు. ఇద్దరూ కేంద్రప్రభుత్వ ఉద్యోగస్తులు. ప్రేమ విషయం వారిద్దరికీ తప్ప మరొకరికి తెలియకుండా ఆ రోజుల్లో జాగ్రత్తపడ్డారు.

కానీ శారీరకంగా చాలాసార్లు చేరువయ్యారు. వారిది కులాంతర సమస్య అయింది. పెళ్ళికి ఆటంక మేర్పడింది. రామ్మూర్తి మేనమామలకు లత విషయం తెలిస్తే ఆమె ప్రాణానికే హాని అని భయపడ్డాడు.

> పక్కమీద చేరాడు.
> ఆమె అతని పక్కన
> చేరింది. లైటు తీసేసింది.
> అతడి కౌగిలిలో ఒదిగిపోయింది.
> అతడు ఆమెను అడిగాడు-
> "ఎవరినో ఒకర్ని పెళ్ళి
> చేసుకోలేకపోయావా?"
> అని. అంతే....

ఆమెను పెళ్ళిచేసుకోలేనని, క్షమించమని వేడుకున్నాడు. ఆమె క్షమించింది. లత వెనుక ఎవరూ పెద్దవాళ్ళు లేరు ఒక్క అమ్మమ్మతప్ప.

పరిస్థితిని గమనించి, తాను ఒక దురదృష్టవంతురాలిగా భావించి, మౌనంగా ఉండిపోయింది.ఊరు మారిపోయింది.

రామ్మూర్తికి తల్లిదండ్రులు, మేనమామలు చూసిన సంబంధంతో పెళ్ళి అయింది. లతను ఎప్పుడో ఓసారి గుర్తుచేసుకోవటం తప్ప ఏమీ చెయ్యలేకపోయేవాడు.

రామ్మూర్తి దంపతులకు పాప పుట్టింది. పదిహేనేళ్ళు కాపురం సజావుగా సాగింది.

తర్వాత అతని భార్య క్యాన్సర్‌తో చనిపోయింది. చనిపోతూ తమ కూతుర్ని డాక్టర్‌ని చెయ్యమని కోరింది. రామ్మూర్తి అలాగే అన్నాడు.

అతని తల్లీతండ్రి మేనమామలు అందరూ గతించారు. పాపని మాత్రం ఆమె అమ్మమ్మ, తాతయ్య దగ్గర ఉంచి చదివించసాగాడు. భార్య కోరిన కోరిక అతన్ని వెంటాడసాగింది.

ఈ గుమస్తా ఉద్యోగంతో ఆమెను పెద్ద చదువులు చదివించడం అసాధ్యం అని గ్రహించాడు. అలాంటి సమయంలో పాతమిత్రుడు సూరి కనిపించాడు. అతను ఎమ్మెల్యే. అతని తండ్రి పెద్ద రాజకీయనాయకుడు.

మంత్రిగా చాలాకాలం పనిచేశాడు. ఆయన మరణంతో సూరికి ఎమ్మెల్యే సీటు ఇప్పించి బై ఎలక్షన్లో గెలిపించింది అతని పార్టీ. అప్పటికి అతని వయసు నాలుగు పదులు దాటాయి.

"సార్! మా అమ్మాయిని మెడిసిన్ చదివించాలనుకుంటున్నాను. అందుకు మీ సాయం కావాలి. నేను వాలంటరీ రిటైర్‌మెంట్ తీసుకుంటాను.

కొంత పెన్షన్ వస్తుంది. మిగతాది మీరు చూసుకుంటే చాలు.నేను మీకన్నివిధాలా ప్రచార సాధనంగా ఉంటాను. ఉపన్యాసాలు రాసి పెడతాను. సమస్యలకు పరిష్కారం ఆలోచించిపెడతాను..." అన్నాడు రామ్మూర్తి ఎమ్మెల్యే సూరిని కలిసి.

సూరికి రామ్మూర్తి బాగా నచ్చాడు. పాతమిత్రుడైనా హద్దులు మీరకుండా మర్యాదగా ఉండటం అతనిని ఆకర్షించింది.

"సార్ అని పిలవకయ్యా రామ్మూర్తి...!" అన్నాడు ఎమ్మెల్యే సూరి.

"సార్ మంచిపదం. మీ హోదాకు భంగం రాకూడదు. మీరు నా ఇంట్లో మనిషి కాదు. పబ్లిక్ ఫిగర్. ఆ హోదా అన్నిచోట్లా చూపించాలి మీరు. అది తప్పనిసరి!" అన్నాడు రామ్మూర్తి.

రాజకీయాల్లోకి రాకమునుపు సూరి కొన్ని వ్యాపారాలు చేశాడు. సంపాదన బాగా ఉండేది. తండ్రి ద్వారా కూడా కోట్ల ఆస్తి వచ్చింది. గతంలో సూరి కులాసాగా, విలాసంగా బతికేవాడు. ఆడపిల్ల కౌగిలికి దూరంగా ఉండలేని పరిస్థితి అతనిది.

ఎ ప్పుడైతే రామ్మూర్తిని పి.ఏ.గా పెట్టుకున్నాడో, సూరి ఆ విలాస జీవితానికి దూరమయ్యాడు. చాలాసార్లు రామ్మూర్తిమీద కోపం వచ్చేది అతను నూరిపోసే నీతులమీద.

"సార్! ఓటరు తను హరిశ్చంద్రుడు కాకపోయినా, తను ఓటు వేసి గెలిపించిన నాయకుడు మాట తప్పితే మండిపడతాడు.

తాను తాగుబోతు, తిరుగుబోతూ అయినా, తను ఓటు వేసి గెలిపించిన నాయకుడు, చెడుగా తిరుగుతూ, తాగుతూ, వాగుతూ బయటపడితే మాత్రం అసహ్యించుకుంటాడు.

మంచి క్యారెక్టరు ఉండటం నాయకుని లక్షణం. మనం మంచిగా ఉంటే సరిపోదు. మంచిగా కనిపించడం కూడా ముఖ్యం!" అన్నాడు రామ్మూర్తి.

సూరికి భార్యాపిల్లలు ఉన్నారు. ఓ అమ్మాయి,



అబ్బాయి. వారు చదువుని సరదాగా తీసుకుని గడిపేస్తున్నారు. సూరికి రామ్మూర్తి చేసే నీతిబోధలు అప్పుడప్పుడు సూరి భార్య చెవినపడుతూ ఉండేవి. రామ్మూర్తి అంటే ఆమెకు గౌరవం ఏర్పడింది.

సూరి రెండవసారి ఎమ్మెల్యేగా గెలవటానికి రామ్మూర్తి చాలా కృషిచేశాడు. ఉపన్యాసాలు రాసి ఇచ్చాడు. నియోజకవర్గంలో అన్ని సమస్యలనూ సేకరించాడు. వాటిని క్రోడీకరించాడు.

సూరికి నియోజకవర్గం గురించి మంచి అవగాహనఉందని ప్రజలకు బాగా తెలిసివచ్చేలా చేశాడు. ఆ సమస్యలకు పరిష్కారమార్గాలను కూడా సూచిం

కొలను వేంకట దుర్గాప్రసాద్



చాడు. దాంతో గతంలోకన్నా సూరికి బాగా ఓట్లు పడ్డాయి. పార్టీ దృష్టిని బాగా ఆకర్షించాడు. గొప్పగా గెలిచాడు. అతనిమాటకి పార్టీలో గౌరవంపెరిగింది.

ప్రతిఫలంగా సూరి రామ్మూర్తి కూతుర్ని బాగా చదివించాడు. ఆమె ఎమ్మెస్ చేసింది. రామ్మూర్తి అతని భార్య కోరికను నెరవేర్చాడు.

ఎమ్మెల్యే సూరి అమ్మాయికి గొప్ప సంబంధం కూడా చూసిపెట్టాడు.

పెళ్ళి ఘనంగా జరగటానికి సూరి రామ్మూర్తికి బాగా సాయంచేశాడు.

పెళ్ళికొడుకు కూడా పెద్ద డాక్టరు.

రామ్మూర్తి ఊపిరిపీల్చుకున్నాడు. తన బాధ్యత తీరినందుకు చాలా సంతోషంగా ఉంది అతనికి. కృతజ్ఞతగా ఎవరూ లేని సమయంలో సూరి కాళ్ళకు దండంపెట్టాడు రామ్మూర్తి.

సూరి కంగారుపడ్డాడు.

"రామ్మూర్తీ! ఇట్లా చేసి నా కళ్ళ వెంబడి నీళ్ళు తెప్పించకు. నన్ను గొప్ప నాయకుడిగా నిలబెట్టింది నువ్వు" అన్నాడు సూరి రామ్మూర్తిని కౌగిలించుకుని.

రామ్మూర్తి కూతురు తనతోపాటు అమ్మమ్మ, తాతయ్యను దగ్గర పెట్టుకుని చూసుకుంటానంది.

రామ్మూర్తిని కూడా రాజకీయాలు మానేసి తనతో పాటు వుండమంది. నాకు సాయంచేసిన మిత్రుడ్ని వదిలిరాలేను తల్లీ. సమయం వచ్చినప్పుడు వస్తాను!" అన్నాడు రామ్మూర్తి.

లత సిస్టంముందు కూర్చుంది. కీబోర్డు మీద వేళ్ళు కదులుతున్నాయి.

రామ్మూర్తి ఆమె వెనుకగా నిలబడి ఆమె మెడ చుట్టూ చేతులు వేసి కౌగిలించుకున్నాడు. వారిద్దరి మధ్య కుర్చీ వీపు భాగం అడ్డంగా ఉండిపోయింది. రామ్మూర్తి ఆ కుర్చీని వెనక్కి లాగాడు.

తాను ముందుకెళ్ళి క్రింద కూర్చుని ఆమె ఒళ్ళో తలపెట్టుకున్నాడు రామ్మూర్తి.



## న్యూ గాళ్

తెలుగు చిత్రసీమలోకి మరో కొత్త అమ్మాయి దూసుకువస్తున్నది. మోడలింగ్ అనుభవంతో తమిళంలో 'కాంచన 3' సినిమా చేసిన నిక్కీ టంబోలీ శ్రీవిష్ణుతో కలిసి తెలుగులోకి కాలు పెట్టింది. ఈ చిత్రంలో కొత్త అమ్మాయిలకోసం వెతుకుతున్న దర్శకుడికి నిక్కీ మోడలింగ్‌లో చూపిన ప్రతిభ బాగా నచ్చిందట.

సినిమాలోగల ఎమోషనల్ సన్నివేశాల్ని తన హావభావాలతో అద్భుతంగా పండించగలదన్నది సినీనిర్మాతల నమ్మకం.

"పదినిమిషాల్లో అయిపోతుంది మూర్తీ. రేపు ఉదయం వెళ్ళిపోతున్నావు కదా!

సమాచారం తయారుచేసి నీకు ఇప్పుడే ఇచ్చేస్తాను. పొద్దుటే నేను లేవలేను. నువ్వు లేవనివ్వవు" అంది నవ్వుతూ.

రామ్మూర్తి లేచాడు. ఆమెను గాఢంగా ముద్దు పెట్టుకున్నాడు. తర్వాత పక్కమీద చేరాడు. పది నిమిషాలతర్వాత సిస్టమ్‌ని ఆపేసి లత రామ్మూర్తి పక్కన చేరింది. వారిద్దరూ గంటక్రితమే భోజనం చేసేశారు. లైటు తీసేసింది.

రామ్మూర్తి కౌగిలిలో ఒదిగిపోయింది. రామ్మూర్తి గతంలో ఆమెను ఒకసారి అడిగాడు.

"ఇన్నేళ్ళు పెళ్ళిచేసుకోకుండా ఎలా వున్నావు? ఎవరినో ఒకర్ని పెళ్ళి చేసుకోలేకపోయావా?"

"ఏమో! నీ స్పర్శ, నీ కౌగిలి తర్వాత మరో మగాడిలో వాటిని ఊహించుకోలేకపోయాను. ఆ ఆలోచనే కంపరంగా ఉండేది.

ఎలాంటి పరిస్థితుల్లో మొదట్లో నన్ను వదిలేసి వేరే పెళ్ళిచేసుకున్నావో నాకు అర్థమయింది. నా ప్రాణానికి ప్రమాదం ఏర్పడగలదని భయపడ్డావు. అందుకే నీవంటే గౌరవం.

అప్పుడు అతన్ని మరింత గట్టిగా హత్తుకుని ముద్దులు పెట్టింది. ఇప్పుడు రామ్మూర్తి చాలా సంతోషంగా ఉన్నాడు. ఆమెనూ సంతోషపెట్టాడు.

సూరి ఆలోచిస్తున్నాడు. రామ్మూర్తిని తన ఎదురుగా కూర్చోమని అన్నాడు.

"రామ్మూర్తీ! ఎన్నికలు దగ్గరకొస్తున్నాయి. నేను మూడోసారి నిలబడతాను.

టికెట్ ఇస్తారని అనుకుంటున్నాను. టికెట్ రాకుండా కొన్ని ఆటంకాలు కూడా రావచ్చుననిపిస్తోంది" అన్నాడు సూరి.

"అదేంటి సార్! అలాంటి అనుమానం ఎందుకొస్తుంది మీకు? ఈ నియోజకవర్గపు సీటు మీకు గాక మరెవరికిస్తారు?" అడిగాడు రామ్మూర్తి.

"రామ్మూర్తీ! నువ్వు గతంలోలా నాకు పనిచెయ్యగలవా? అలాంటి ఆలోచన నీకువుందా? నాతో పని ఐపోయిందిగాబట్టి వేరే వెళ్ళిపోతావా?" అడిగాడు.

"సార్!" బిత్తరపోయాడు రామ్మూర్తి.

"మీరు గెంటేస్తే తప్ప మిమ్మల్ని వదిలివెళ్ళను. అసలీ అనుమానం ఎందుకు కలిగింది. ఎవరో గిట్టని వాళ్ళు మనమధ్య దూరాన్ని పెంచటానికి ప్రయత్నిస్తున్నారు" అన్నాడు రామ్మూర్తి.

"రామ్మూర్తీ! నీ వల్ల తాగుడు, తిరుగుడూ అన్నీ మానేసి ఈ ప్రజాసేవ ఊబిలో ఇరుక్కుపోయాను. ఈనాటి రాజకీయాల్లో క్యారెక్టర్ ముఖ్యం అంటావు. నాకు మడికట్టి ఇంట్లో కూర్చోబెట్టావు. కానీ నువ్వుమాత్రం కామక్రీడల్లో మునిగితేలుతున్నావు" అన్నాడు సూరి రామ్మూర్తి కళ్ళల్లో సూటిగా చూస్తూ.

రామ్మూర్తి తలవంచుకున్నాడు.

"అంతా వాకబు చేశానయ్యా. నా దగ్గరకొచ్చిన దగ్గర్నుంచి గమనిస్తున్నా. నీకు ఎవరితోనో సంబంధం ఉంది. అది కాస్తా నిజమని తేలిపోయింది.

హైదరాబాద్‌లో నువ్వు ఎవరితోనో తిరగటం కొందరు చూశారు. నిజం చెప్పు! నీలో ఇంకా ఎన్ని రహస్యాలున్నాయో ఎట్లానమ్మటం? సూరి అడిగాడు.

"సార్! ఇప్పుడు నా కూతురి పెళ్ళి అయిపోయింది. సమస్యలు ఏవీలేవు కనుక జరిగింది చెప్తున్నాను. నేను ఎవరితోనో వుంటున్నానన్నది ఎవరో కాదు. ఆమె నా భార్య లత.

నిజానికి నా మొదటి భార్య. మొదట్లో ఆమెను పెళ్ళిచేసుకుందామనుకున్నాను.

కులాలు వేరవటంతో ధైర్యం చెయ్యలేకపోయాను. మావాళ్ళు చాలా మొండిమనుషులు. మా తల్లిదండ్రులు కుదిర్చిన పెళ్ళిచేసుకున్నాను. పాప పుట్టింది.

పదేళ్ళక్రితం మా ఆవిడ క్యాన్సర్‌తో చనిపోయింది. నాకు పిచ్చెక్కిపోయింది.

ఆ సమయంలో లత వచ్చి నన్ను ఓదార్చింది. ఒళ్ళోకి తీసుకుని సేదతీర్చింది.

మిగిలిన అన్ని జీవులు ప్రకృతి ధర్మంగానే నివసిస్తున్నాయి. ఒక్క మనుషులు మాత్రమే ప్రకృతివిరుద్ధంగా జీవిస్తున్నాం.
-సద్గురు జగ్గీవాసుదేవ్, ఆధ్యాత్మిక గురు



ధైర్యం చెప్పింది. తను పెళ్ళిచేసుకోకుండా అన్నాళ్ళు అలా ఉండిపోయిన ఆమెను వెంటనే పెళ్ళిచేసుకోవాలనుకున్నాను.

ఇంట్లో చదువుతున్న కూతుర్ని పెట్టుకుని ఇప్పుడు పెళ్ళిచేసుకుంటే, ఆమె పెళ్ళి ప్రశ్నార్థకం కావచ్చు అంది.

అయినా నేను వినలేదు.

ఆమెను ఒప్పించి రిజిస్టర్ మ్యారేజి చేసుకున్నాం. ఈ విషయం మా అమ్మాయికిగానీ, అత్తమామలకు గానీ, తర్వాత మీకుగానీ ఇన్నాళ్ళూ తెలియకుండా జాగ్రత్తపడ్డాను. ఇప్పుడు తెలిసినా ఫర్వాలేదు" అన్నాడు రామ్మూర్తి.

"మీకు పిఏగా ఉన్నా, నా సగం పని ఈ ఐదారేళ్ళ నుంచి తనే చేసిపెట్టింది" అన్నాడు.

"అదేంటయ్యోయ్?" సూరి అడిగాడు.

"అవును సార్! ఈ నియోజకవర్గం ఓటర్ల జాబితా, మ్యాపు ఆమె అడిగిన వివరాలు అన్నీ ఇచ్చేవాడ్ని. మీ ఉపన్యాసాలకి కావలసిన డేటా అంతా ఆమే తయారుచేసిపెట్టేది. అందుకే నేను తరచుగా హైదరాబాద్ వెళుతుండేవాడ్ని.

స్వామికార్యంతోపాటు స్వకార్యం పూర్తిచేసుకుని వచ్చేవాణ్ణి" అన్నాడు రామ్మూర్తి.

సూరి దిగ్గున లేచాడు-

"నువ్వే గ్రేట్ అనుకుంటే నీ భార్య మరీ గ్రేట్. మీ ఇద్దరి సాయం వుంటే నేను ఎమ్మెల్యేగా గెలవటమేకాదు, ఈసారి మంత్రిని కూడా అవుతాను" అంటూ రామ్మూర్తిని కౌగిలించుకున్నాడు. S







# సూర్యదేవర రామ్‌మోహనరావు

రొమాంటిక్ థ్రిల్లర్ సీరియల్

ఆరడుగుల పొడవుతో కండలు తిరిగిన శరీరంతో వున్న
ఆ యువకుడి మీదకు రెండు నోట్లకట్టలను విసిరిందా యువతి
"నాకు భయంగా వుంది" అన్నాడతను
"రిస్క్ చేయకుండా జీవితంలో ఎవరూ పైకి రాలేరు మిస్టర్
డబ్బులెవరికీ ఊరికే రావు" అంది నవ్వుతూ
ఆ యంగ్ అండ్ డైనమిక్ పర్సనాల్టీకి ధైర్యాన్ని, ఆశను కల్పిస్తున్న
ఆ యువతెవరు? మగాళ్ళకంటే ఆడాళ్ళకే గట్స్ ఎక్కువా?!

చదవండి

# డబ్బులెవరికీ ఊరికే రావు

త్వరలో ప్రారంభం!

# ఒక చిన్న మాట

తాజ్‌మహల్ పేరు వింటేనే కలల లోకానికి, కల్పనల లోకానికి వెళ్ళిపోతాం. భారతీయులందరికీ గర్వకారణం ఈ అద్భుతం. ఒకప్పుడు దేశభక్తి గీతాల్లో కూడా తాజ్‌మహల్ చోటుచేసుకునేది.

'నమో హిందుమాతా' అనే గేయంలో "తాజ్‌మహల్ నీ జడలో పువ్వు"గా భాసిల్లింది.

రిపబ్లిక్ ఆఫ్ ఇండియా "ఉయ్ ది పీపుల్ ఆఫ్ ఇండియా దటీజ్ భారత్" అనేవరకు ఈ దేశం హిందూ దేశంగానే ప్రసిద్ధి.

అందుకే హిందుమాతను ప్రశంసించేవారు. గౌరవించేవారు. నమస్సులు తెలిపేవారు.




డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in


తాజ్‌మహల్ స్ఫూర్తితో వెలువడిన సాహిత్యం అన్ని భాషలలోనూ కోకొల్లలుగా ఉంది. రవీంద్రనాథ్ టాగూర్ 'షాజహాన్' అనే శీర్షికతో రాసిన కవిత చిరస్థాయిగా తాజ్‌మహల్ వర్ణనలో నిలిచిపోయింది. ఆ కవితలో ఒక భాగం :

షాజహాన్,మీకు తెలుసు
జీవితము, యౌవనము
సంపద, కీర్తిప్రతిష్ఠలు

కాలంతోపాటు కొట్టుకుపోతాయి కాబట్టి మీ హృదయంలోని

దుఃఖాన్ని శాశ్వతం చేయటానికి

..................................................

వజ్రాల, ముత్యాల, కెంపుల ప్రకాశాలు
ఇంద్రధనుస్సు కాంతిలా మాయంచేసి
ఈ ఒక్క కన్నీటిచుక్క, తాజ్‌మహల్,
కళంకరహితంగా కాలం బుగ్గపై
చిరకాలం మెరిసేటట్లు చేశావు.

తాజ్‌మహల్‌ను దర్శించే దంపతులు, ప్రేమికులు కూడా అవతలివ్యక్తికి తమమీద అంత ప్రేమ ఉందా! అని అడగటం కద్దు. తమాషాకైనా "'నాకోసం తాజ్‌మహల్ కట్టిస్తారా?" అని అడిగే ఉంటారు.

ఈ విషయమై ఉర్దూ కవి సాహిర్ లూధియాన్వి మాటలు తరచూ వినవస్తుంటాయి.

ఒక చక్రవర్తి తన సంపదను ఆసరాచేసుకుని మా పేదల ప్రేమను పరిహసించాడు (హమ్ గరీబోంకీ మొహబ్బత్ కా ఉడాయా హై మజాక్). ఇక తెలుగువారి విషయానికొస్తే మొదట జ్ఞాపకమొచ్చేది శ్రీశ్రీ మాటలే. తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు? ఇది శ్రామికుల దృక్కోణం. వారిని విస్మరించరాదు. ప్రపంచంలోని అన్ని అద్భుత నిర్మాణాల వెనుకా లెక్కలేనన్ని అదృశ్య హస్తాలు. ముందువారికే నమస్సులు, ఈ ప్రశంసలు చెందవలసి ఉంది.



ప్రపంచంలోని ఏడు అద్భుతాలలో తాజ్‌మహల్ కూడా చేరింది. ఆధునిక అద్భుతాలుగా పరిగణింపబడే ఈ ఏడూ ప్రపంచంలో భిన్న దేశాలలో ఉన్నాయి. చైనా నిర్మించిన గొప్ప గోడ 'గ్రేట్ వాల్ ఆఫ్ చైనా'గా ప్రసిద్ధి చెందింది.

రియోడిజనైరోలో ఏసుక్రీస్తు ప్రతిమ, క్రైస్ట్‌ది రిడీమర్, పెరూలో మాచూ పీక్చూ కోటలోని నగరం. మెక్సికోలో చిచెన్ ఇట్సా మయానగరం మయాన్ సామ్రాజ్యానికి కేంద్రం. నేటి జోర్డాన్‌లో ఉన్న పెట్రానగరం శిథిలాలలో ఎన్నో మందిరాలు, పిరమిడ్లు కనిపిస్తాయి.

ఇండియాలో ఆగ్రాలోని పాలరాతి తాజ్‌మహల్. ఇదివరకు పురాతన అద్భుతాలు ఏడు ఉండేవి. ఏడు గ్రీకులకు అదృష్టసంఖ్య. వీటిని అద్భుతాలుగా ఒక గ్రీకు రచయిత ఉల్లేఖించాడు.

యాత్రికుల అభిప్రాయం ప్రకారం వీటిని అద్భుతాలుగా భావించటమయింది. ప్రపంచంలో లెక్కలేనన్ని అద్భుతాలు, చారిత్రక కట్టడాలు ఉంటాయి. కొత్త అద్భుతాల ఎన్నికలో 'ది న్యూ 7 వండర్స్ ఆఫ్ ది వరల్డ్ ఫౌండేషన్' పాత్ర ఉంది.

ప్రపంచవ్యాప్తంగా ప్రజల ఓట్లనుబట్టి అద్భుతాలను ప్రతిపాదించటమవుతుంది.

నూరు మిలియన్లకు మించి వచ్చిన ఓట్లద్వారా ఈ అద్భుతాల పేర్లు ప్రకటించారు. ప్రపంచంలో ఏడు అద్భుతాలలో ఒకటిగా ఎన్నిక కావటం ఎంతో గర్వించవలసిన విషయమే. కాని ఈ అద్భుతాన్ని మరింత అపురూపంగా చూసుకుంటూ పరిరక్షించవలసిన బాధ్యతనుకూడా విస్మరించరాదు.

తాజ్‌మహల్‌కు సంబంధించి ఎన్నో కథలు, కథనాలు, అసమంజస విషయాలు, అసంగత వివాదాలు చర్చల్లోకి వచ్చాయి. అవి తాజ్‌మహల్‌ను కలుషితం చేసిన మాట నిజమేగాని ఈ కాలుష్యం ప్రతీకాత్మకమే. అసలు సమస్య నిజమైన కాలుష్యం.

దీనికై ఎన్నేళ్ళగానో ప్రయత్నాలు జరుగుతున్నాయి. పరిసరాల్లో వాహనాలు నిషేధించారు. పరిశ్రమల కాలుష్యాల మీద ఆంక్షలున్నాయి. అయినా పరిస్థితి ఏమీ బాగుపడలేదు.

తాజ్‌మహల్ కాంతివిహీనం అవుతోంది. ఇప్పుడు తాజ్‌మహల్ చుట్టూ పరిరక్షిత ప్రాంతం పదివేల నాలుగువందల చదరపు కిలోమీటర్లు.

కొత్త పరిశ్రమలు రావటానికి వీలులేదు. పరోక్షంగా వచ్చే కాలుష్యాన్ని అరికట్టటం కష్టమవుతోంది. ఈ పరిస్థితులలో సుప్రీమ్‌కోర్టు కలుగజేసుకోవలసి వచ్చింది. పరిరక్షణ ప్రాంతంలో పరిశ్రమలు ఎందుకున్నాయి అని ప్రశ్నిస్తోంది.

భారతదేశంలో విజ్ఞానశాస్త్రవేత్తలు, సంరక్షకులు తాజ్‌మహల్‌ను కాలుష్యంనుండి రక్షించలేకపోతే విదేశ అనుభవజ్ఞులను పిలిపించరాదా! అని సూచించింది. తాజ్‌మహల్ పరిరక్షణకు తాము చేబట్టబోయే కార్యక్రమాల ముసాయిదా ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం సుప్రీమ్‌కోర్టుకు సమర్పిస్తే కోర్టు చిరాకుపడింది.

"ముసాయిదా మాకెందుకు? తగిన సంస్థలకు చూపించి సంప్రదించండి" అని సలహా ఇచ్చింది.

"ప్రపంచ వారసత్వ నిర్మాణంగా దీనిని యునెస్కో ప్రకటించినందున వారికి మేనేజ్‌మెంట్ ప్లాను పంపటంలేదా? ఒకవేళ యునెస్కో ప్రపంచ వారసత్వం దీనినుంచి తొలగిస్తామంటే ఏమి చేస్తారు" అని నిలదీసింది.

ప్రపంచంలోకెల్లా అత్యంత కాలుష్యమున్న నగరాలలో ఆగ్రా ఎనిమిదవ స్థానంలో ఉంది. వారసత్వ సంపద లభించినందుకు ఎంత గర్వించాలో దానిని పరిరక్షించుకోవటంలోనూ అంత శ్రద్ధ చూపించాలి. తాజ్‌మహల్ మనందరికీ చెందింది. దాని పరిరక్షణ బాధ్యతకూడా అందరికీ ఉంటుంది.

> ఎంత మోసినా బరువనిపించదు 'బంగారం'-
> ఎంత చేసినా చాలనిపించదు 'సత్సంగం'.

## మంగళగౌరీ వ్రతం

(14.8.2018)

శంకరుడే తనకి భర్త కావాలంటూ ఓ దృఢ దీక్షతో పార్వతీదేవి తపస్సు ప్రారంభిస్తే ఆమె శరీరం గౌరవర్ణంలోకి మారిపోయింది. గౌరవర్ణం అంటే లేత పసుపురంగు అని అర్థం. అలా ఆమె గౌరవర్ణ శరీర చ్ఛాయని కలిగిఉండేసరికి ఋషులంతా ఆమెని 'గౌరి' అని పిలిచారు. ఆమె తపస్సు చేసిన కొండని కూడా 'గౌరీశిఖర'మని పిలువసాగారు.

ఈమె మంగళాలని కల్గిస్తుంది కాబట్టి ఈమెని మంగళగౌరి అన్నారు. దంపతుల్లో అన్యోన్యత అనే మంగళాన్ని కల్గిస్తే దాంపత్యగౌరి. పొలాల్లో మంగళాలని కల్గిస్తే ధాన్యమంగళగౌరి. సంతానమనే మంగళాన్ని కల్గిస్తే సంతాన మంగళగౌరి.

భర్త ఆరోగ్యాన్ని సరిచేస్తూ మంగళాన్ని కల్గిస్తే సౌభాగ్య మంగళగౌరి. కాలక్రమంలో ఈ విభాగాలన్నీ తొలగిపోయి 'మంగళగౌరి' అనేస్తున్నారు. ఈమెని శ్రావణమాసంలో మాత్రమే కాక ఎల్లప్పుడూ ప్రార్థించవచ్చు కాబట్టి 'వ్రతం' అన్నారు ఈమె పూజని. వివాహం శ్రావణంలో కాకపోయినా మంగళగౌరీ పూజని చేయించేది ఇందుకే. ❒



## శ్రీ గౌరీదేవి స్తుతి

**ఓంకార పంజర శుకీం**
**ఉపనిషదుద్యాన కేళి కలకంఠీం।**
**ఆగమ విపిన మయూరీం**
**ఆర్యాం అంతర్విభావయేత్ గౌరీమ్॥**

ఓంకారం అనే పంజరంలోని చిలుక, ఉపనిషత్తులనే ఉద్యానవనంలో కోకిల, ఆగమాలు అనే అడవిలో నెమలి అయిన గౌరీదేవిని మనస్సున ధ్యానిస్తున్నాను. ❒

## నాగచతుర్థి

(14.8.2018)

శ్రావణ, భాద్రపదాలు రెంటినీ వర్షఋతువని తెలియజెప్పారు ఋషులు. కాబట్టి ఈ రెండు నెలల్లోనూ వర్షాలు కురుస్తాయి. పాములకి చల్లనిదనం చాలా ఇష్టం. శ్రావణ వర్షాల కారణంగా ఈ ప్రకృతిలో విచ్చలవిడిగా తిరుగుతాయి పాములు.

చిరుచలి ఉండడం కారణంగా మరింత ఎక్కువ సేపు బహిరంగంగా ఉండాలని కోరుకునే ఆ పాముల కారణంగా పొలం పనులు చేసుకునే రైతులకి భయం ఉండడం సహజం కదా!

అలాగే తమ భర్తలని పంపడమనేది కూడా రైతుల భార్యలకి భయాన్ని కల్గించేదేగా! ఆ భయం రైతు దంపతికి లేకుండా చేసేందుకై 'నాగచతుర్థి' పేరిట సుబ్రహ్మణ్యపూజని ఏర్పాటుచేసిన ఋషులు మనకి తిండిని తినే అవకాశాన్ని కల్గించారు. ❒

## వ్రతం-పండుగ

**వ్రత్యతే ఇతి వ్రతమ్.** ఏదో ఒక కష్టం వస్తుందనే భయం లోపల ఉన్నా, నిజంగా భయం వచ్చినా ఆ కష్టంనుండీ, భయంనుండీ బయటపడడంకోసం చేసేటువంటి పూజ వ్రతం అవుతుంది.

కష్టాలూ, భయాలూ నిరంతరం వస్తూనే ఉండేవే కాబట్టి వ్రతాలని నిరంతరం చేస్తూనే ఉండాలి.

పండుగలంటే ఏ దైవమో అవతారరూపంతో భూమికి రావడం, అలాగే ఆయన విజయాలని చూపించడమో జరిగితే వాటిని పండుగలు అని లెక్కించాలి. కాబట్టి వ్రతం-పండుగ అనేవి ఒక్కటి కావు. వినాయకచవితి ఓ వ్రతం.

శ్రీరామనవమి ఓ పండుగ.

ఈ దృష్టితో గనుక పరిశీలించినట్లయితే వ్రతం పండుగ భేదం తెలుస్తుంది. ❒

## పురాణాల ప్రకారం

తంత్రమనే మాటకి ఆలోచన, ఉపాయం అని అర్థాలు. స్వతంత్రమంటే తనలో ఉండే ఆలోచన-తనలో తోచిన ఉపాయాన్ని చెప్పడమని అర్థం **(స్వస్మిన్ తంత్రమ్- స్వస్య తంత్రమ్).**

ఒక్కోసారి ఎంతటి గొప్పవానికి కూడా ఆలోచన లేదా ఉపాయం తట్టకపోవచ్చు. అలాంటి సందర్భాల్లో ఎవరో మేధావికి తట్టిన ఆలోచన లేదా ఉపాయం ఆ గొప్పవాళ్ళని ఇబ్బందినుండి బయటపడేయవచ్చు. అలాంటి స్వతంత్ర విధానాన్ని ప్రతి వ్యక్తీ కలిగి ఉండడాన్నే స్వాతంత్ర్యమన్నారు పెద్దలు **(స్వతంత్రస్య భావః).** అయితే ఈ ఆలోచన లేదా ఉపాయాన్ని తప్పక తీసుకుతీరాలనే నియమం ఉండదు ఉండ నక్కరలేదు పాలకులకి.

మనం ప్రస్తుతం జరుపుకుంటున్న స్వాతంత్ర్య దినోత్సవం అందరికీ తెలిసిందే. అయితే పురాణాల ప్రకారం మొదటి స్వాతంత్ర్య దినోత్సవం జరిగింది బకాసురవధ జరిగిన మరునాడు.

రోజుకో ప్రాణిని తనకి ఆహారంగా పంపాలని ఓ నియమాన్ని పెట్టి అలా జనుల్ని వధిస్తూ బకుడనే రాక్షసుడు ఉంటూంటే, తన ఆలోచననీ, ఉపాయాన్నీ అమలుచేయదలిచిన కృష్ణుడు బకుణ్ణి చంపడం కోసం భీముణ్ణి సిద్ధంచేసి బకాసురవధని చేసి జనావళి భయాన్ని శాశ్వతంగా పోగొట్టాడు. ఆ మర్నాడు జనులంతా ఆనందోత్సాహాలతో చేసుకున్న ఉత్సవం ప్రథమ స్వాతంత్ర్య దినోత్సవం. ❒

# మీకు నిజంగా కోపమా!




మనిషికి కలిగేటువంటి సహజమైన భావోద్వేగాలలో కోపం ఒకటి. అన్ని భావోద్వేగాలు పరి మితిలో వున్నంతవరకే మంచిది.

అతిగా నవ్వు ఎన్ని ఇబ్బందులు తెస్తుందో అదే విధంగా అతికోపం అన్ని చిక్కులు తెస్తుంది.

ఈ విషయం ఆయుర్వేద పితామహుడు చరకుడు వివరించాడు. కోపాన్ని చరకుడు 'మనో వికారం'గా వర్ణించాడు.

కోపం సహజమే. కాని మితిమీరితే అది ఒక రకమైన మానసిక లోపాన్ని ప్రతిబింబిస్తుంది.

తమ భావోద్వేగాలను అదుపు చేసుకోవటం ఒక కళ. ఆ కళలో బలహీనులు తమ మానసిక లోపాన్ని కోపం ద్వారా బయటపెట్టుకుంటారు.

కోపాన్ని 'రజో' గుణమన్నారు. మానవ శరీరంలోని వాత లేదా పిత్త దోషాలలో ఏదో ఒకటి అధికమైనప్పుడు కోపం పెరుగుతుందన్నారు.

అయితే సాధారణకోపం సహజమైనది. అది చిన్నతనంనుండి కనిపిస్తుంది. వారు కోరుకున్నవి ఇవ్వనప్పుడు పసిపిల్లలైనా కోపం ప్రదర్శిస్తారు.

ఆ కోపంలో వారేంచేస్తున్నది ఆ వయసువారికి సహజంగానే తెలియదు. ఆ కోపంలో ఇతరులమీద దాడి చేసేవారుంటారు. తమనితాము గాయపరచుకునేవారు ఉంటారు.ఆ రెండింటిలో ఏదైనాచూసే వారికి విచిత్రంగానే ఉంటుంది. సాత్వికగుణం సహజమైనది.మానసికస్పష్టత ప్రశాంతతనుప్రదర్శించేది.

రజో,తామసాలు అంతగా మంచివికాని గుణాలు. ఏదో ఒక కారణాన సాత్విక గుణం కోల్పోయి రజో గుణం ప్రదర్శిస్తారు.

వస్తువుపట్ల ఆకర్షణ, మమకారం వంటివి పట్టుదలలు ఏవైనా మానసిక ఆందోళన ఫలితంగా కోపం వస్తుంది. ఆ కోపం అంత మంచిది కాదు. అనేక అధ్యయనాలు జరిగిన తర్వాతనే 'తన కోపమే తనకు శత్రువు'అనే నిర్ణయానికి వచ్చాడు శతకకారుడు.

క్రోధగుణం గలవారికి శరీరంలో హానికర రసాయనాలు పేరుకుంటాయి. ఫలితంగా రోగనిరోధకవ్యవస్థ బలహీనమవుతుంది. త్వరగా అంటురోగాలు సోకుతాయి.

రక్తంలో కొలెస్ట్రాల్ ఇతర లిపిడ్స్ పెరుగుతాయి. రక్తపోటు సమస్యలు, గుండెజబ్బులు కొనితెచ్చుకుని ఆయుర్దాయం తగ్గుతుంది.

## ఆయుర్వేద విధానం

కోపం వదిలించుకునేందుకు క్రమంగా రజో, తమోగుణాలను వదిలించుకుని సాత్వికగుణాన్ని పెంపొందించుకోమంటుంది ఆయుర్వేద చికిత్స.

ఇందులో మూడురకాల చికిత్సల గురించిన ప్రస్తావన ఉంది. అందులో ఒకటి ఆధ్యాత్మిక చికిత్స, రెండవది హేతువుతో కూడినది, మూడవది సత్య విజయ లేదా మానసిక నియంత్రణ.

ఆధ్యాత్మిక చింతనవల్ల మనసు నియంత్రణలోకి వస్తుంది. హేతువుతో కూడిన నియంత్రణ అలవరచుకోవాలి. మానసికమైన మార్పు ముఖ్యం.

ఆలోచనలు మారటం. వీటితోపాటుగా ఆహారపు అలవాట్లు కూడా కోపం రావటంలో పాత్ర వహిస్తాయి.

నిద్ర, ఆహారపు అలవాట్లు చాలా ముఖ్య పాత్ర వహిస్తాయి. సమయానికి తినటం, తగుమేర నిద్ర వున్నప్పుడు క్రోధం త్వరగా తగ్గుతుంది. తలపెట్టిన పనులు వాయిదా వేయక వెంటనే చేసుకోవటం ద్వారా ఒత్తిడి తగ్గించుకోగలుగుతారు.

అదేవిధంగా వ్యాయామం అలవరచుకుని క్రమంతప్పక వ్యాయామం చెయ్యటం

## వదలాల్సిన గుణం

అతికోపంనుండి బయటపడటం అవసరమన్నది మానసిక శాస్త్రవేత్తల సలహా. అతికోపం మనిషివ్యక్తిత్వాన్ని దెబ్బతీస్తుంది. స్నేహితులు దూరమవుతారు.

వ్యక్తిగత సంబంధాలు దెబ్బతింటాయి. కాబట్టి కోపాన్ని ఎంత త్వరగా వదిలించుకుంటే అంతమంచిది. అయితే అది ఒక్కసారిగా వదిలేది కాదు. కోపంవచ్చినప్పుడు ప్రవర్తనను మార్చుకునేయత్నం చెయ్యాలి. కోపంవచ్చినప్పుడు దాన్ని వెను వెంటనే తగ్గించుకునే మార్గాలున్నాయి. వీటిని సాధన చెయ్యటం ద్వారా కొంతకాలానికి పూర్తిగా సాత్వికులవగలరు.

మానసికంగా మార్పులను తెస్తుంది. పోషకపదార్థాల ఆవశ్యకతను గుర్తించాం.

ఏదో ఒక ఆహారంకాక తగినంత పోషకపదార్థాలను అందించే ఆహారం తీసుకోవటం కూడా అవసరమంటుంది ఆయుర్వేదం. అతిగా తీపి పదార్థాలుతినటం, కాఫీలు, మసాలా దినుసులతోకూడిన ఆహారం తీసుకోవటం అవసరం.

నెయ్యి, శాకాహారం, అల్లం, లవంగాలు, ఇంగువ, పెరుగు, పాలు, డ్రై ఫ్రూట్స్‌లు సాత్విక గుణాన్ని పెంచుతాయి.




ఇంటిలోనివారిమీద కోపం వచ్చే సందర్భాలు అనేకం వుంటాయి.

అది భాగస్వామికాని, పిల్లలుకాని, బంధువులు, మిత్రులు వగైరాలలో ఎవరైనా కోపం తెప్పించవచ్చు. అటువంటి సమయంలో అక్కడేవుండి వారితో వాదన పెంచి, మాటామాటా పెంచుకుని కోపాన్ని తీవ్రస్థాయికి తీసుకువెళ్ళేకన్నా కోపానికి కారణమైన ఘటన, ప్రదేశంనుండి దూరంగా కదలటం మంచిది.

అందుకే కోపోద్రిక్త ప్రదేశంనుండి బయటకు నడవండి.

అక్కడినుండి ప్రశాంతవాతావరణం వెతుకుతూ నడుచుకుంటూ వెళ్ళండి.

దగ్గరలో పార్క్ వంటిది వున్నా, పచ్చిక బయళ్ళువున్నా వాటిమీద కొద్దిసేపు నడవండి. ఆ నడక వేగంగాఉండాలి.

అలా మారిన వాతావరణం, కళ్ళఎదుట కనిపించే పచ్చదనం కలిపి శరీరంలో ప్రశాంతతను తెచ్చే ఎండార్ఫిన్స్ అనే హార్మోన్‌లు విడుదలవుతాయి.

సెరటోనిన్ హార్మోన్‌ని మెదడు ఉత్పత్తి చేసేలా చేస్తాయి. ఇది మానసిక ప్రశాంతతను తెచ్చి మనసులోని అలజడిని తొలగిస్తుంది. పదినిమిషాల్లో కోపం పోయి సాధారణ స్థితికి చేరతారు. ◆

## దీర్ఘశ్వాస

కోపం పలురకాల భౌతిక మార్పులను చూపుతుంది. గుండె కొట్టుకునే వేగం పెరుగుతుంది. శరీరంలో ఎడ్రినలిన్ హార్మోన్ ఉత్పత్తి పెరుగుతుంది. దీనివలన కండరాలు బిగుసుకుంటాయి. బరువుగా గాలి పీల్చి వదులుతారు.

ఆ శ్వాస శబ్దం బయటకు వినిపిస్తుంది కూడా. ఆ మార్పులను నియంత్రించగలిగితే కోపం త్వరగా పోయి ప్రశాంతత వస్తుంది. అందుకే కోపం వస్తుందనిపించగానే కళ్ళు మూసుకోవాలి. దీర్ఘంగా గాలిపీల్చి వదలాలి. నాభినుండి పైకి గాలి పీలుస్తుండాలి. అలా కనీసం ఐదు నిమిషాలు చేయాలి.

అవసరం అయితే అంతకుమించి శ్వాసక్రియ కొనసాగించాలి. శరీరంలోని మార్పులు పోయి, అంతా రిలాక్స్ అయిందనిపించేవరకు అలా దీర్ఘశ్వాసను కొనసాగిస్తుండాలి.

## దయాగుణం

కోపం వచ్చినప్పుడు ఆ కోపానికి కారణమైన అంశం లేదా కోపం తెప్పించిన వ్యక్తి కోణం నుండి ఆలోచించాలి. ఆ సంఘటన ఎందుకు జరిగింది.

అది పొరపాటున జరిగిందా! ఊహించని ఘటనలు జరుగుతాయి. ఎదుటివ్యక్తి మీ కాలును తొక్కివుంటాడనుకోండి.అది పొరపాటున జరిగిందని వారు వివరిస్తే దాన్ని అంగీకరించగలిగే పెద్ద మనసు అవసరం. మీకు ఎవరైనా వ్యక్తిద్వారా కలిగినప్పుడు ఆలోచన అతనికోణంనుండి ఆలోచించండి. ఆ సమయంలో అతగాడి మూడ్ ఎలా ఉండి కోపం తెప్పించే పదం మాట్లాడిఉంటాడో ఒక్కసారి ఆలోచించండి.

అదే పరిస్థితిలో మీరు ఉండివుంటే మీ మాటలు, చేతలు అంతే తీవ్రంగా వుండే అవకాశంవుందా అనే కోణం నుండి ఆలోచించండి. అవతలవారి కోణం నుండి ఆలోచించగలిగితే కోపసమస్య ఇట్టే పోతుంది. ఎదుటివారికోణంలో ఆలోచించాలంటే కొంచెందయాగుణం అవసరం. అది అలవాటు చేసుకోవాలి.

## సంగీతం

సంగీతం అంటే చెవికోసుకునేంత ఇష్టత లేని వారిమీద కూడా సంగీత ప్రభావం వుండి తీరుతుంది. ఒత్తిడికి గురైనా, మనసులో ఆందోళన అధికంగావున్నా సంగీతాన్ని ఆశ్రయించమనేది అందుకే.

కోపసమయంలో కూడా సంగీతం పెట్టుకోవటం మంచిది. ఇంటిలో సంగీతం వినేందుకువీలైన ఏర్పాటువుంటే ఆ గదిలోకి వెళ్ళి ప్రశాంతంగా కూర్చుని, కళ్ళు మూసుకుని సంగీతం వినండి. సాంప్రదాయ సంగీత ప్రభావం మెరుగ్గా ఉంటుంది.

పసిపిల్లల భయం, కోపంవంటి వ్యతిరేకభావాలను అమ్మ జోల పాటతో పోగొట్టడం తెలిసిందే. అది సంగీత ప్రభావం.

'అలిగినవేళనే చూడాలి..' అంటూ ఆమె పాడిదగ్గరకురాగానే హీరో ముఖంలో కోపంపోయి చిరునవ్వు రావటం చూపించిన సినీ సన్నివేశం గుర్తున్నదా! అదే సంగీతానికున్న శక్తి.

సంగీతం వ్యతిరేక భావోద్వేగాలను పారద్రోలి ప్రశాంతతను తెచ్చిపెడుతుంది. చెవులకు ఫోన్స్ తగిలించుకుని దాని ద్వారా సంగీతం వింటూ బాల్కనీలో కూర్చోండి. లేదా పని చేసుకోండి. మీ కోపం పోయి పదినిమిషాలలో చిరునవ్వులు చిందిస్తారు.

## నమోదు

తరచుగా కోపం వస్తున్నదా! ఆ తర్వాత అసలెందుకు కోపం వచ్చింది మరచిపోతున్నారా! ఆ కోపం ఘటన గురించి మీరు మరచిపోయినా మీ కోపానికి బలి అయినవారుదాన్ని మరచిపోలేరు.

వారిమనసులోనుండి ఆ బాధ పోనంతవరకు వ్యక్తిగత సంబంధాలలో ఇబ్బందులు కొనసాగుతాయి. కాబట్టి కోపంవచ్చిన ప్రతిసారీ ఆ కోపానికి దారితీసిన పరిస్థితులను కాగితంమీద పెట్టండి.

ఎంత వివరంగా రాయగలిగితే అంత వివరంగా ఆ విషయాలన్నీ రాయండి. అవి ఎలా ప్రారంభమై ఎటువైపు వెళ్ళినా పరవాలేదు. అలా రాసుకుంటూ వెళ్ళటమే చెయ్యాల్సినది. మనసులోపలి భావాలన్నీ బయటకురావటం అవసరం.

ఆ తర్వాత రాసినదాన్ని ఒక్కసారిచదవండి. తరచుగా కోపానికి కారణాలు అర్థమవుతాయి. వాటిలో అర్థంలేని అంశాలు అనేకం. మీకే తెలుస్తాయి. ఇటువంటిదానికి నేను అంతగాకోప్పడ్డానా! అనే ఆలోచన కలిగి నవ్వువస్తుంది. సిగ్గు కలుగుతుంది. ఆ తర్వాత సర్దుబాటు అవసరం అర్థంచేసుకుని, క్రమంగా ప్రశాంతతను సంపాదించుకోగలుగుతారు.

టి. హేమంత్

# కొత్త సీరియల్ ప్రారంభం

"సత్యకుమార్ గారితో మీకెప్పటినుంచి పరిచయం"

తనముందు అవమానభారంతో తలదించుకుని కూర్చున్న సుహాసినిని ప్రశ్నించాడు ఎస్.ఐ.ధనుంజయ్. అతడి స్వరంలో తనపట్ల తేలికభావం ధ్వనించింది అని అనిపించిందో ఏమో, ఆమెముఖం మరింత ఎరుపెక్కింది. పెదవులు వణికాయి. ఆమెకు నలభై... నలభైఐదు మధ్య వయసు ఉంటుంది.

# ఉచ్చు


కె.కె.భాగ్యశ్రీ

E-mail: kkbhagyasree@gmail.com




కాని, చూడడానికి ఇంకా థర్టీ ప్లస్ లాగానే అనిపిస్తుంది. బాగా చదువుకున్న మనిషి కావడం మూలాన, ఆ విజ్ఞానం కళ్ళలో కనిపిస్తూ కాంతిమంతంగా వెలిగిపోతున్నాయవి.

వెంకటగిరి జరీచీర, మెడలో సన్నని గొలుసు, చేతులకి నాలుగు గాజులు, నుదుటన కనీకనిపించని చిన్నబొట్టు, రూపం చూస్తే ఆహ్లాదంగా, మొక్కలా ఉంది. ఆమె మనసంతా గుబులుగా ఉంది.

ఏనాడూ కలలోకూడా ఊహించలేదు... ఇలా పోలీస్ స్టేషన్ గడప తొక్కుతుందని. కనీసం ఊహల్లోకూడా వెళ్ళాలని కోరుకోని స్థలాన్ని ప్రత్యక్షంగా చూడాల్సిరావడంతో ఆమె నవనాడులూ కృంగిపోయాయి ఒక్కసారిగా.

పోలీస్‌స్టేషన్ అంటే ఇలా ఉంటుందీ... అని సినిమాలలో చూడడమే గానీ, నిజంగా ఇలా ఉంటుంది అని ఆమెకి తెలియదు. దానికి తోడు అక్కడి వాతావరణం ఆమెను ఏవేవో భయాందోళనలకి గురి చేస్తోంది. ఓ పక్క ఎవరో చిల్లరదొంగలను పట్టుకుని మక్కెలిరగదంతున్నాడో కానిస్టేబుల్.

ఇంకోపక్క చైన్‌స్నాచింగ్ చేసి పారిపోతూండగా పట్టుబడ్డ ఓ టీనేజ్ కుర్రాడిని లాఠీ విరిగేలా చావ బాదుతున్నాడింకో కానిస్టేబుల్. నేరస్తులందరికీ అదే ఆఖరిమజిలీనా అనిపించేటట్లుంది వాళ్ళని పోలీసులు ట్రీట్ చేస్తున్న విధానం చూస్తే.

పోలీస్ దెబ్బలు తట్టుకోలేక వాళ్ళు అరుస్తున్న అరుపులు చెవినపడుతూఉంటే ఏదో వేదన కలుగుతోంది. విధివిచిత్రం కాకపోతే... తనకి ఇలా పోలీస్ స్టేషన్‌లోకి అడుగుపెట్టే అగత్యం పట్టడమేమిటో! వేదాంతధోరణి ఉబికివచ్చింది ఆమె ఆలోచనల్లో.

"మీరు మౌనంగా ఉంటే మేము ప్రశ్నలడగడం మానేస్తాం అనుకుంటున్నారేమో... అలా జరగదు... అడిగే విధానంలో మార్పు వస్తుంది.

చెప్పండి... సత్యకుమార్ గారితో మీకున్న పరిచయం ఎటువంటిది? ఆయన మీకెన్నాళ్ళుగా తెలుసు?" మళ్ళీ ప్రశ్నించాడు ధనుంజయ్ మూతి బిగించుకున్నట్లుగా కూర్చున్న సుహాసినిని.

"నాకు అతడితో ఏ పరిచయమూలేదు. జస్ట్ ఒకటిరెండుసార్లు చూశానంతే?" పొంగుకొస్తున్న దుఃఖాన్ని పెదవి అంచుల్లో ఆపేయడానికి విశ్వప్రయత్నం చేస్తోంది సుహాసిని.

"ఐమీన్ నా ఉద్దేశ్యం అదే... అతడిని ఎప్పుడెప్పుడు చూశారూ అని అడుగుతున్నాను" కూర్చున్న కుర్చీలో నుంచి ఎదురుగా ఉన్న టేబుల్ మీదకు వంగుతూ ఆసక్తిగా అడిగాడు ధనుంజయ్.

"దిస్ ఈజ్ టూమచ్ సర్... ఒక పరువుగల స్త్రీని ఇంటరాగేషన్ పేరుతో ఇలా పోలీస్ స్టేషన్‌కి తీసుకుని వచ్చి అవమానకరమైన ప్రశ్నలు వేస్తున్నారు. ఇదే మీ అక్కచెల్లెళ్ళని అయితే ఇలా ట్రీట్ చేస్తారా?"

# కొత్త సీరియల్ ప్రారంభం



ఏడుపును దిగమింగుకుంటూ రోషంగా అడిగింది సుహాసిని. ఆమెకు అంతులేని ఆవేదనగా ఉంది.

"సారీ మేడమ్... మిమ్మల్ని ఇన్సల్ట్ చేయడం నా ఉద్దేశ్యం కాదు. కాకపోతే సత్యకుమార్ భార్య వైశాలి గారు మీమీద అనుమానం వ్యక్తపరిచారు కాబట్టి కనుక మిమ్మల్ని ఇలా విచారించవలసివస్తోంది" కాస్త మెత్తగా చెప్పాడు ధనుంజయ్ ఈసారి. పొందికైన సుహాసిని రూపం, గౌరవంగా కనిపించే ఆహార్యంఅతడి గొంతులోకి ఆ మృదుత్వాన్ని తెచ్చిపెట్టాయి.

సుహాసిని కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవైనాయి. ఏదో అపనమ్మకంతో కళ్ళు అల్లల్లాడాయి. వైశాలి తనను అనుమానించిందా? ఎందుకు! అసలు తనకి, సత్య కుమార్‌కి పరిచయం ఉందని ఆమె అనుమానం! ఎందుకో ఒక్కసారిగా ఏదో భయంతో ఆమె దేహం అల్లల్లాడిపోయింది. మనసు గాలివానలో పూలతీగెలా ఊగిపోయింది ఏదో సందేహంతో.

"వైశాలి నామీద అనుమానపడిందా? ఏమని? అయినా నేనేం చేశానని!" గంభీరంగా అడిగాననుకుంది కాని, తన గొంతు తనకే పీలగా ధ్వనించింది సుహాసినికి.

"మీరు పేపర్ రెగ్యులర్‌గా ఫాలో అవుతారా? పోనీ న్యూస్ ఛానల్స్ అన్నా చూస్తారా?" ఆరాగా అడిగాడు ఎస్.ఐ. ధనుంజయ్.

"అప్పుడప్పుడు... నాకున్న వర్క్ టెన్షన్స్, ఇంటి బాధ్యతల మూలాన నేను తరచుగా పేపర్ చదవడం కాని, టీవీ చూడడం కాని చేయలేను. పైగా నాకు టీవీ చూడడం అంటే బోర్... ఎందుకడుగుతున్నారు?" అయోమయంగా చూసింది సుహాసిని.

ధనుంజయ్ వెంటనే బదులీయలేదు.ఒకటి రెండు నిముషాలు సుహాసినికేసి దీక్షగా చూస్తూండిపోయాడు. అతడి మౌనం సుహాసినిలో ఆందోళనని రేకెత్తించింది. ఆరడుగుల పొడవు అందుకు తగిన ఉక్కులాంటి శరీర సౌష్టవంతో మాన్లీగా ఉన్నాడు ధనుంజయ్. ముఖంలో తెచ్చిపెట్టుకున్న గాంభీర్యం అతడి వృత్తికి ప్రతీకలా ఉంది.

అతడు నాలుగుగుద్దులు గుద్దితే ఎలాంటివాడికైనా ఎముకలు విరగడం ఖాయం. ధనుంజయ్ ఆమెవైపే సీరియస్‌గా చూస్తూ టేబుల్ సొరుగులోనుంచి ఒక న్యూస్ పేపర్ తీసి ఆమెముందు పడేస్తూ..." ఈ న్యూస్ చదవండి... ఇందాక నేను చెప్పిన సత్యకుమార్ ఇతడే... సిటీలో పేరున్న వ్యాపారవేత్తలలో ఒకరు.

ఈయన మొన్న సాయంత్రం హత్యచేయబడ్డాడు... అతడి స్వంత గెస్ట్‌హౌస్‌లో... ఎవరో దుండగులు కత్తితో తీవ్రంగా అతడిని గాయపరిచారు.

అధికరక్తస్రావం అవడంమూలాన వెంటనే మరణించాడు" చెప్పాడు గాఢమైన నిట్టూర్పునొకదాన్ని





## పాత్రలవల్ల అవగాహన

తాము పోషించే పాత్రల్లోనే కొత్త జీవితాలు, కొత్త వ్యక్తిత్వాలు పరిచయమై, వాటిద్వారానే తమ దైనందిన జీవనవిధానాలుమార్చుకునే వీలు చిక్కుతుంది.చందమామ కాజల్‌ది ఇదే అభిప్రాయం.

"నేను నటిని కావడంవల్ల ఎన్నో జీవితాలను అనుభవించే అవకాశం దక్కుతున్నది. సంప్రదాయ కుటుంబంనుంచి వచ్చిన అమ్మాయిగా, అల్లరి పిల్లగా, బాధ్యతగల గృహిణిగా, యువతిగా రకరకాల పాత్రలుచేస్తుంటాను కాబట్టి, వాటిగురించి అధ్యయనం చేసే అవకాశం ఉంటున్నది.

వివిధస్థాయిల్లో ఆలోచనా విధానాలు ఎలా ఉంటాయో అర్థంచేసుకుంటున్నాను. దీనివల్లనా ఆలోచనా విధానంలో కూడా మార్పు వస్తున్నది" అని వివరించింది కాజల్.

వదిలి. సుహాసిని కూర్చున్న చోటే బిగుసుకుపోయింది. వినకూడని వార్త చెవినపడ్డట్లుగా తెల్లబోయింది.

తనముందున్న ఆ న్యూస్‌పేపర్ జిల్లాఎడిషన్ చేతిలోకి తీసుకుని ఆ వార్తను,దానికి అనుబంధంగా ప్రచురించిన సత్యకుమార్ ఫైల్‌ఫోటోను చూసింది.

అతడు హత్య చేయబడినప్పటి ఫోటో కూడా ప్రింట్ అయినా అదంత స్పష్టంగా లేదు. సుహాసిని ఏదో షాక్ తగిలినట్లుగా అలా ఉండిపోయింది ఓ రెండు మూడు నిమిషాలపాటు.

కాసేపటి తరువాత తేరుకుని "అయ్యో! ఎంత పనైంది?" అంది అప్రయత్నంగా.

"ఇంత ఫెమిలియర్ పర్సన్‌ని మర్డర్ చేశారంటే మీకు తెలియకపోవడం వింతగా అనిపిస్తోంది. మొన్న రాత్రి హత్య జరిగితే... నిన్న ఉదయం ఎవరో అపరిచితవ్యక్తి ఫోన్‌చేసి మాకు సమాచారంఅందించాడు.

నిన్నల్లా టీవీ ఛానల్స్‌లో బ్రేకింగ్ న్యూస్ అంటూ ఒకటే మోత మోగిపోయింది.

ఇంత జరిగినా మీకు తెలియలేదంటే..." అంటూ అదోరకంగా చూశాడు ఎస్సై ధనుంజయ్.

"ఇది మరీ బాగుంది... అతడేమీ ఈ దేశానికి ప్రధానమంత్రో, రాష్ట్రానికి ముఖ్యమంత్రో కాదుకదా, మౌత్ టు మౌత్ పబ్లిసిటీ వలన తెలియడానికి!

ఆయన సిటీలో పేరున్న వ్యక్తే కావచ్చు... ఆయన్ని మర్డర్ చేసిన విషయం ఆయనతో సంబంధం ఉన్న వ్యక్తులకి, సంస్థలకి తెలుస్తుంది. అసలే నా ప్రపంచం చాలా చిన్నది. బయటివ్యక్తుల గురించి పట్టించుకునేందుకు నాకు నా సమయం సరిపోదు... విషయాలపట్ల అంత ఆసక్తి కూడా లేదు" కాస్త పదునుగా చెప్పింది సుహాసిని తన చేతిలోని వార్తాపత్రికను టేబుల్ మీద పడేస్తూ...

ఆమె ముందున్న ఆ న్యూస్‌పేపర్‌ని తీసితిరిగి టేబుల్ సొరుగులో పడేస్తూ... "మీరన్నది నిజమే... కాని, అతడు మీ స్నేహితురాలి భర్త.

అందుకే మిమ్మల్ని ఇలా అడగాల్సివచ్చింది.

పై పెచ్చు చాలా దారుణంగా అందిన చోటల్లా పొడిచేశారు. రక్తపుముద్దలా మారిన అతడి శరీరాన్ని చూస్తే పోలీసులమైన మాకే దడ పుట్టింది.

ఎంత కక్ష మనసులో పెట్టుకున్నారో గాని, చాలా ఎక్కువగా హింసించారతడిని" చెప్పాడు ఎస్సై ధనుంజయ్ తమకివన్నీ మామూలే అయినా తనలోనూ మానవత్వం ఉంది అని నిరూపించుకోవడానికి అన్నట్లుగా.

"వెరీ పిటీ... వింటూఉంటే నాకే ఇంత బాధగా ఉంది. ఇక ప్రత్యేకంగా చూసిన మీకు ఎంత ఉంటుందో!" అంటూనే ఏదో గుర్తొచ్చినట్లుగా "దానికీ, మీరు నన్ను ఇలా ప్రశ్నించడానికీ ఏమిటి సంబంధం. అతడు వైశాలి భర్తే కావచ్చు.

కాని, నాకు అంతగా పరిచయంలేని వ్యక్తి. అతడు హత్య చేయబడటానికి వెనుక అనేక కారణాలు ఉండవచ్చును. ఎవరో గిట్టనివారు అతడిమీద పగ తీర్చుకోవడానికి అతడి మీద హత్యాయత్నం చేసి ఉండవచ్చు. మధ్యలో నన్ను విచారించడం దేనికి!" కాస్త ఆవేశంగా అడిగింది సుహాసిని.

"చెప్పానుగా... వైశాలిగారి ఫిర్యాదు మేరకు మిమ్మల్ని ఇంటరాగేట్ చేస్తున్నాం అని!" ఎస్సై ధనుంజయ్ అన్నాడు కాస్త పదునుగా.

"వైశాలికేమన్నా మతిపోయిందా?అసలు వైశాలితో నాకున్న స్నేహమే అతి తక్కువ. ఇంక వాళ్ళాయనతో నాకేంటి?" కోపంతో ముక్కుపుటాలు అదురుతూ ఉండగా చెప్పింది సుహాసిని.

**కొత్త సీరియల్ ప్రారంభం**

"వైశాలిగారు, మీరు స్నేహితులు కాదా? ఆమె మీమీద అనుమానం ఉందనిచెప్తే మీకిద్దరికీ మంచి ఫ్రెండ్‌షిప్ ఉందని అనుకుంటున్నానింకా.." ఆసక్తిగా అడిగాడు ధనుంజయ్ కూర్చున్నచోటునుంచి లేచి, టేబుల్ పక్కగా వచ్చి సుహాసిని దగ్గరగా నిలబడుతూ.

"ప్రతి పరిచయమూ స్నేహానికి దారితీయదు ఎస్సైగారూ. కాబట్టి మా ఇద్దరినీ స్నేహితులు అనకపోవడమే బెటర్... తను, నేను డిగ్రీలో క్లాస్‌మేట్స్. 'హాయ్... బై...' చెప్పుకునే దగ్గరతనం మాత్రమే మా దగ్గర ఉంది.

ఇద్దరి స్వభావాలకీ పెద్దగా మ్యాచ్ అవకపోవడం వలన తను నాకున్న పరిచయస్తులలో ఒకరిగా మిగిలిపోయింది. నేను కూడా అంతవేగంగా ఎవరితోనూ కలవలేను. దానిమూలాన నాకున్న స్నేహితుల సంఖ్య కూడా చా...లా... తక్కువ. మధ్యలో చాలానాళ్ళుమేము చూసుకోలేదుకూడా.ఒక ఆరునెలల కిందట సి ఎమ్ ఆర్ షాపింగ్‌మాల్‌లో కలిసింది. వాళ్ళాయనని పరిచయంచేసింది. హలో అంటే హలో అనుకున్నాం.

అప్పుడప్పుడూ ఫోన్‌చేస్తూ ఉండమని తన నెంబర్ ఇచ్చింది. ఆ నెంబర్ దాచుకున్నాను కాని, ఎప్పుడూ అవసరంపడలేదు. కనీసం ఆమెతో టచ్‌లో అన్నా ఉండని నామీద ఆమె ఫిర్యాదు ఎందుకు చేసిందో నాకు బోధపడడంలేదు" నుదుట పట్టిన చెమటలని తుడుచుకుంటూ చెప్పింది సుహాసిని.

ధనుంజయ్ ఆమె నిజమే చెప్తోంది అనుకున్నాడు. అంతలోనే అందరినీ అనుమానించే దృష్టి అతడి ఉద్యోగప్రవృత్తి కావడం మూలాన ఏమో... తనని తాను సమర్థించుకునేందుకు ఆమె అలా చెప్తోందేమో' అన్న సందేహం కూడా అతడిలో తలెత్తింది.

"పోనీ సత్యకుమార్ ఎటువంటివాడు. ఐమీన్ అతడి స్వభావం, అభిరుచులు... వగైరా వగైరా"

"ఇది చాలా అన్యాయం సార్... మీరు నన్ను అవమానిస్తున్నారు. వైశాలితోటే నాకున్న అటాచ్‌మెంట్ తక్కువ అని చెప్తూ ఉంటే ఇక అతడి గురించి నాకేం తెలుస్తుంది! అతడి పర్సనల్స్ గురించి నన్ను ప్రశ్నిస్తారేం?" మండిపడింది సుహాసిని.

జ్వాలాముఖిలా ఎర్రగా ప్రజ్వలిస్తున్న ఆమె వదనంలో కొట్టొచ్చినట్లుగా కానవస్తున్న ఆగ్రహాన్ని చూసి కాస్త తడబడ్డాడు ఎస్.ఐ. ధనుంజయ్. ఎందుకో

ఆటలు ఆడుతుంటే వయసు మళ్ళినవారికైనా తమ యవ్వనం గుర్తుకువస్తుంటుంది.

-గుల్జార్, సినీగేయ రచయిత

## కొత్త సీరియల్ ప్రారంభం

ఆమెకిందులో ఏ సంబంధమూ లేదు అని మనసు గట్టిగా నమ్ముతోంది. కాని, వైశాలి ఇచ్చిన కంప్లెయింట్ మేరకు ఆమెను విచారించి తీరవలసిందే.

"కూల్ డౌన్ మేడమ్... వైశాలి గారు మిమ్మల్ని కేవలం అనుమానించినందువలనే ఇలా గౌరవంగా మిమ్మల్ని ఇంటరాగేట్ చేస్తున్నాం.

అదే ఆమె కనుక రిటెన్ కంప్లెయింట్ ఇచ్చి ఉంటే కనుక ఈపాటికి మిమ్మల్ని అరెస్ట్ చేసి ఉండేవాళ్ళం. ప్రజల ప్రాథమిక హక్కులని కాపాడడం రక్షకభటులుగా మా కర్తవ్యం కదా!" అతడి మాటలకి గడగడ వణికిపోయింది సుహాసిని. 'అరెస్టా? అంతతప్పుతానేం చేసింది! ఎవరు ఎవరిమీద అనుమానం వ్యక్తపరిచినా ముందు వెనుక



> నాకు ఇంటిబయటే స్టార్ స్టేటస్... ఇంటిదగ్గర అమ్మ అరుపులు, ఆయన రుసరుసలు వాస్తవాన్ని గుర్తుకుతెస్తుంటాయి.
> -మాధురీ దీక్షిత్, నటి

లాలోచించక అరెస్ట్ చేసేస్తారా ఈ పోలీసులు! ఒకసారి పోలీస్‌స్టేషన్ గడపతొక్కాక నిర్దోషిగా బయటకొస్తేమాత్రం పోయినపరువు తిరిగొస్తుందా!

ఏం తప్పుపనిచేసిందో... పోలీసులు తీసుకెళ్ళారు అంటూ ఇరుగుపొరుగులు, సన్నిహితులు చెవులు కొరుక్కుంటే అది మరణసదృశం కాదా!'

పలురకాల యోచనల వెనుక పరుగులు తీస్తోంది సుహాసిని మనసు. స్పృహ తెచ్చుకుని ధనుంజయ్ మాటలకి స్పందిస్తూ..."యూఆర్ రైట్...బట్ ఎట్ ది సేమ్ టైమ్... ఒక పరువుగల ఉద్యోగిని ఆత్మగౌరవాన్ని కాపాడడం కూడా మీ బాధ్యతే కదా!

చదువుకుని, సంఘంలో ఉన్నతస్థానంలో ఉన్న ఒక ఉద్యోగినితో ప్రవర్తించవలసిన తీరు ఇది కాదనుకుంటాను... అయినా తను రిటెన్ కంప్లైంట్ ఇచ్చినా.. ఏ ఆధారాలతో నన్ను అరెస్ట్ చేస్తారు?" సుహాసినికి ఎంత దాచుకుందామన్నా కోపం దాగడంలేదు.

"ప్లీజ్ మేడమ్... కూల్ డౌన్... మిమ్మల్ని ఇన్సల్ట్ చేయడం మా ఉద్దేశ్యం కాదు. కాకపోతే ఆమె అనుమానం నిజంకాదని నిరూపించాలంటే మిమ్మల్ని విచారించాలి కదా!

ఒక్క విషయం మేడమ్... అనుమానితులందరూ దోషులు కాదు. కాని, కొన్ని సందర్భాలలో మన నీడని సైతం అనుమానించే పరిస్థితి ఎదురౌతుంది. బహుశా వైశాలిగారు మిమ్మల్ని అనుమానించేందుకు అలాంటి కారణమే ఏదో ఉండవచ్చును.

ప్లీజ్ కోపరేట్ విత్ అజ్..." కాస్త మృదువుగా అన్నాడు ఎస్.ఐ ధనుంజయ్.

సుహాసిని మాట్లాడలేదు... 'మాట్లాడలేదు' అనే కన్నా 'మాట్లాడలేకపోతోంది...' అంటే సబబేమో! ఏదో అవ్యక్తమైన ఆవేదన మదిని కుదిపివేస్తుంది.

"అసలు మీ ఇంటికే వచ్చి ఇంటరాగేట్ చేద్దాం అనుకున్నాం. కాని, మీరుండేది మూడువందల ఇళ్ళున్న గేటెడ్ కమ్యూనిటీలో...

అలాంటి చోటుకి మేము వచ్చి మీకున్న మంచి పేరు పోగొట్టదలచుకోలేదు. ప్లీజ్... మేమడిగే ప్రశ్నలకి మీరు సూటిగా, నిజాయితీగా జవాబిస్తే మా ఇన్వెస్టిగేషన్ సులువవుతుంది.

ప్లీజ్ మామ్..."తనముందు కూర్చున్న విద్యార్థికురాలైన ఆ యువతితో అంతకన్నా కటువుగా మాట్లాడలేకపోతున్నాడు ధనుంజయ్.

సుహాసిని తన హ్యాండ్ బ్యాగ్‌తెరచి అందులోని మంచినీళ్ళ సీసా తీసి గటగటతాగింది.

అనుకోని ఈ సంఘటనకి ఆమె అశాంతికి లోనైంది అని గ్రహించాడుధనుంజయ్.

"కాఫీ టీ ఏమన్నా తాగుతారా మామ్?" అంటూ ఆదరంగా ప్రశ్నించాడు.

"నో థాంక్స్... నన్ను పిలిపించిన పని చూడండి. నాకవతల బోలెడు పని ఉంది" నుదుట పట్టిన చెమటలను కర్చీఫ్‌తో తుడుచుకుంటూ ఒకింత అసహనంగా చెప్పింది సుహాసిని.

"ష్యూర్ మామ్... మీ సహకారం ఉంటే అదెంత సేపు! టైమ్ మీకే కాదు... మాకు కూడా వాల్యుబుల్ అని గ్రహించాలి మీరు"

అర్థమైనట్లుగా తలపంకించింది సుహాసిని.

"కాలేజ్ రోజులైపోయాక మీరు వైశాలిని మళ్ళీ ఎక్కడ చూశారన్నారూ?" అడిగాడు ధనుంజయ్.

"ఆ మధ్యన నేను, నా కొలీగ్ కలిసి సి.ఎమ్.ఆర్ షాపింగ్ మాల్‌కి వెళ్ళాం. అక్కడ అనుకోకుండా కలిసింది వైశాలి.

నేను తనని చప్పున గుర్తుపట్టలేకపోయాను. తనే నన్ను పలకరించి కుశలప్రశ్నలు వేసింది. తన భర్తను పరిచయం చేసింది. ఒక్కడే కొడుకని, కాన్పూర్ ఐఐటిలో చదువుతున్నాడని చెప్పింది"

"మీ మధ్యన అంత స్నేహం లేదన్నారు కదా! మరి తన గురించి వివరాలు మీకెందుకు చెప్పినట్లో!" అడ్డు తగిలాడు ధనుంజయ్.

చురుగ్గా చూసింది సుహాసిని. "స్నేహం లేకపోవచ్చు... కాని, ఆమె ఒకప్పటి నా క్లాస్‌మేట్. సాధారణ పరిచయస్తులే చాన్నాళ్ళ తరువాత తారసపడితే ఒకరి వేరెబౌట్స్ ఒకరు తెలుసుకుంటారు. అలాంటిది తను, నేను మూడేళ్ళు కలిసి చదువుకున్నాం.

స్నేహం లేకపోయినా, ఎన్నో సంవత్సరాల తరువాత చూసుకున్నప్పుడు ఆ మాత్రం స్పందించడం సహజం అనిఅనుకుంటున్నాను"సూటిగాచెప్పింది.

"ఒకే మేడమ్...అలానే అనుకుందాం. మరి మీరు చెప్పారా మీ గురించి?"

"నేను చెప్పాలి అనుకోలేదు. కాని, ఆమెవేసిన ప్రశ్నలకి సమాధానంగా నా గురించిన వివరాలు క్లుప్తంగా చెప్పాను" అంది సుహాసిని.

"అంటే... మీ భర్త, పిల్లలు... వగైరాలా?"

"అవును"

"మీవారేం చేస్తున్నారు?"

"ఆయన లేరు... పోయి పన్నెండేళ్ళయింది" సుహాసిని స్వరం గద్గదమైంది.

"అయామ్ సారీ... పిల్లలు?"



### గుడ్ జాబ్

ఎప్పుడు చూసినా సాయిపల్లవి కబుర్లంటే... ఆమె కోపతాపాల చిరాకుపరాకుల గురించే వినపడుతుంటాయి. అయితే, ఆమెలోని ప్రొఫెషనలిజాన్నీ ప్రస్తావించుకునే అవకాశం చిక్కింది.

'పడి పడి లేచే మనసు' చిత్రం షూటింగ్‌లో సాయిపల్లవిలోని కొత్తకోణం కనపడింది. తీవ్ర జ్వరంతో ఉండి, విశ్రాంతి తీసుకోవాలన్న సలహా ఉన్నప్పటికీ, సినిమా షెడ్యూల్‌ను సమయానికి ముగించేయాలని తాపత్రయపడింది.

అన్ని షెడ్యూల్స్ పూర్తయిపోయాక తన పని మాత్రం పెండింగ్‌పెట్టి నిరుత్సాహపరచదలుచుకోలేదట. అందుకే తీవ్ర జ్వరంతోనే కోల్‌కతాలోని తన షెడ్యూల్ ముగించేసింది.

ఆమె సహనానికి, ప్రొఫెషనలిజానికి చిత్రనిర్మాతలు మురిసి ముద్దయిపోయారట.

దశదిశలా నవ్వులు కురిపించే

# కామెడీ కథల పోటీ





## ఒక్కో కథకి నజరానాగా ₹10 వేలు బహుమతి

## అలా పది కథలకు లక్ష రూపాయల బహుమతులు

నవ్వగలిగిన ఏకైక ప్రాణి మనిషి ఒక్కడే! నవ్వు మానవజాతికే గొప్ప వరం. 'నవ్వు, నవ్వించు' అన్నారు. నవ్వు ఓ గొప్ప టానిక్. శరీరంలో ఎక్కడ నలతగా వున్నాసరే, నవ్వితే ఆ నొప్పి తగ్గుతుందనేది ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయవేత్తల పరిశోధనల్లో తేలింది. అందుకే నవరసాలలో ఒకటైన నవ్వును అందరికీ పంచేందుకే ఈ కామెడీ కథల పోటీ. ఆరోగ్యాన్ని, ఆయుష్షును పెంచే ఈ ఛాలెంజీ పోటీలో రచయిత(త్రు)లందర్నీ పాల్గొనవలసిందిగా కోరుతున్నాం.

: నిబంధనలు :

మీ కామెడీ కథ, స్వాతి సపరివార పత్రికలో బొమ్మతో సహా, ప్రచురణలో రెండు పేజీలుమాత్రమే రావాలి.అనగా మీ వ్రాతప్రతి **ఆరు అరఠావులకు** మించకుండా వుండాలి. కాగితానికి ఒకవైపున మాత్రమే రాయాలి.

ప్రతి అరఠావుకు సుమారుగా ఇరవై ఐదులైన్లు ఉండాలి.

### ప్రచురణకు తీసుకున్న ప్రతి కథకు ₹2000

1. కామెడీ కథలఎంపికలో స్వాతి సంపాదకునిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు లేదు. ఈ పోటీ గడువు తేదీని పొడిగించేందుకుగానీ, పోటీని రద్దు చేసేందుకుగానీ, స్వాతి పబ్లికేషన్స్ యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి. 2. అనువాదాలూ, అనుకరణలు, ఇతర పత్రికలకి పంపబడి పరిశీలనలో ఉన్న రచనలను పంపవద్దు. 3. కామెడీ కథలు తమ స్వంతమే అని, అముద్రితమని, తమ స్వదస్తూరితో రాసిన హామీపత్రాన్ని విధిగా జతపరచాలి. 4. బహుమతి యోగ్యం కానివాటిని సాధారణ ప్రచురణకు తీసుకునే హక్కు మాకుంది.

5. ప్రచురణార్హం కాని కథలను తిప్పి పంపగోరువారు తగినన్ని స్టాంపులు అంటించిన స్వంత చిరునామా గల కవరు జతపరచాలి. 'కామెడీ కథల పోటీ'కి అని కవరుమీద స్పష్టంగా రాయాలి.

**మీ కామెడీ కథలను- ఎడిటర్, స్వాతి సపరివార పత్రిక, అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట, పోస్ట్‌బాక్స్ 339, విజయవాడ 520 002కు పంపాలి**

## కామెడీ కథలు మాకు చేరవలసిన ఆఖరు తేది : 10.8.2018

**కొత్త సీరియల్ ప్రారంభం**

"ఒక్కతే అమ్మాయి. శ్రీ భారతి కాలేజ్‌లో బిటెక్ చదువుతోంది"

"ఐసీ... మీ భర్త చనిపోయారు కదా! మరి మీ జీవనభృతి ఏంటి!"

"నేను గవర్నమెంట్ కాలేజ్‌లో ఫిజిక్స్ లెక్చరర్‌ని. కాబట్టి నా భృతికొచ్చిన లోటేమీ లేదు..." పదునుగా అంది సుహాసిని.

"మీ భర్తపోయాక మళ్ళీ పెళ్ళి చేసుకోవాలనిపించలేదా మీకు?" అడిగాడు ధనుంజయ్.

నాగినిలా తలెత్తింది సుహాసిని. "సారీ సర్... యు ఆర్ ఎక్సీడింగ్ యువర్ లిమిట్స్... అది నా వ్యక్తిగత విషయం. దానితో మీకెలాంటి సంబంధంలేదు..." అంది కరుగ్గా.

"అపార్థం చేసుకోకండి... వాస్తవాలను వెలికి తీయాలంటే మూలాల్లోకి చొచ్చుకెళ్ళక తప్పదు. అది మిమ్మల్ని నొప్పించినా సరే, నిర్మొహమాటంగా చెప్పాడు ఎస్.ఐ. ధనుంజయ్.

అతడివైపు చిరాగ్గా చూస్తూ "ఆయన, నేను ప్రేమించి పెళ్ళిచేసుకున్నాం. ఆయన చాలా గొప్ప వ్యక్తి. ఆయన స్థానాన్ని ఇంకొకరికి ఇవ్వాలనిపించలేదు" చెప్పింది సుహాసిని.

ఈసారి ఆమె కళ్ళలో చెమ్మచోటు చేసుకోవడం గమనించాడు ధనుంజయ్.

ఇలాగే ఇంకొంతసేపు విచారణ పేరిట అటుతిప్పి ఇటుతిప్పి ఆమెను మరికొన్ని ప్రశ్నలడిగాడు. అన్నింటికీ సూటైన సమాధానాలే చెప్పింది సుహాసిని.

"సత్యకుమార్‌ని తొలిసారి చూసినప్పుడు మీకేం అనిపించింది" అడిగాడు ధనుంజయ్.

"ప్రత్యేకించి ఏ భావమూ కలగలేదు. ఎందుకంటే నేను ఎవరితోనూ అంత ఎక్కువగా మాట్లాడను. అపరిచితులతో మరీనూ..."

"ఐసీ... ఆ తరువాత మీరు ఆయన్ను మళ్ళీ ఎప్పుడు కలిశారు?" అడిగాడు ఎస్సై.

"ప్రత్యేకించి కలవడానికి ఆయన నాకు మిత్రుడు కాదు, బంధువూ కాదు... ఏదో యాదృచ్ఛికంగా కలవడమే తప్ప!" అంది సుహాసిని.

ఇంకా ఎంతసేపు ఇంటరాగేషన్ పేరిట తన బుర్ర తింటారో ఆమెకు అంతుపట్టడంలేదు.

'తుంటికొడితే పళ్ళు రాలినట్లుగా' ఎక్కడో వైశాలి భర్తని ఎవరో చంపేసి పారిపోతే తనను విచారించడం ఏమిటి... ఖర్మ కాకపోతేనూ!

"అదే... ఆ యాదృచ్ఛికంగానే ఎప్పుడు కలిశారూ అని!" ధనుంజయ్ నిలదీశాడు.

"మా గేటెడ్ కమ్యూనిటీలోనే... ఆ రోజు నేను కాలేజ్‌కి బయలుదేరుతూఉంటే మా మెయిన్‌గేట్ ఎంట్రన్స్ ముందు కలిశాడు.

అతడే నన్ను గుర్తుపట్టి పలకరించాడు. "మీ స్నేహితురాలి భర్తని... కనీసం ఇంటికి పిలచి ముఖాన ఇన్ని కాఫీనీళ్ళన్నా పోయరా" అని సరదగా అడిగాడు.

కాలేజ్‌కి టైమవడం మూలాన ఎక్కువసేపు మాట్లాడలేనంటూ వెళ్ళిపోయాను నేను" సహనాన్ని కూడదీసుకుంటూ చెప్పింది వైశాలి.

పోలీస్ విచారణ గురించి స్నేహితులు చెప్పుకోగా వింది. అప్పుడప్పుడు కొన్ని సినిమాలలో కూడా చూసింది. కాని, ప్రత్యక్షంగా అనుభవిస్తూ ఉంటే మాత్రం మతిపోతోంది.

"ఐసీ... ఫస్ట్ ఇంప్రెషన్ ఈజ్ ద బెస్ట్ ఇంప్రెషన్ అన్నారు. మొదటిసారి అతడిని చూసినప్పుడు ఏమీ అనిపించలేదు అన్నారు. రెండోసారి చూసినప్పుడు ఏమనిపించింది మీకు" అడిగాడు ఎస్.ఐ.

సుహాసిని కాస్త తటపటాయించింది. చెప్పాలా వద్దా అన్న ఆలోచనలో కొట్టుమిట్టాడింది కాసేపు.

ఆమెనే గమనిస్తున్నాడు ఎస్.ఐ. ధనుంజయ్.

**ఇంకా ఉంది**

# మిథిలా పాల్కర్

## పర్సనల్ ఎజెండా

తన జీవితం ఎంతో స్మార్ట్‌గా ఉందంటున్నది బాలీవుడ్ తార మిథిలా పాల్కర్. పన్నెండేళ్ళ వయస్సునుంచే నటి కావాలన్న కోరిక ఆమెలో ఉండేదట. ఆమె వ్యక్తిగత వివరాల్లోకి వెళ్తే :

► **బాల్యంలో నేను :** ఎన్నో స్కూల్ కార్యకలాపాల్లో చురుగ్గా పాల్గొనేదాన్ని

► **మా కుటుంబ నేపథ్యం :** మధ్యతరగతికి చెందినదాన్ని. నేను వివిధ కార్యకలాపాల్లో పాల్గొనడం మా తాతగారికి భయం కలిగించేది.

ఎకడమిక్స్‌పై దృష్టి నిలపమని పదేపదే చెప్పేవారు. నేను మా తాతా అమ్మమ్మల దగ్గరే ఉండేదాన్ని

► **ఇటువంటి కుటుంబ నేపథ్యంలో :** నటనను కెరీర్‌గా ఎంచుకోవడం కష్టమని తెలుసు. అందుకే నా నటన కలలకు ఫుల్‌స్టాప్ పెట్టాను

► **గ్రాడ్యుయేషన్ అయిపోగానే :** థియేటర్ కంపెనీలో పని ప్రారంభించా. అక్కడనుంచి నా నెట్‌వర్క్ మొదలైంది. చాలా నాటికలు చూసేదాన్ని.

ఆర్ట్ ఫెస్టివల్స్‌కు హాజరయ్యేదాన్ని. మళ్ళీ నటన కలలు మొదలయ్యాయి

► **మా తాతగారిని :** కష్టపడి ఒప్పించి, నా చదువు పూర్తయ్యాక అన్న కండిషన్‌పైన ఒప్పించాను

► **తొలిసారి ఆడిషన్ :** 2014 జూన్‌లో ఆరంభించాను. అలా 'కట్టిబట్టి' అవకాశం వచ్చింది. అందులో నాది సపోర్టింగ్ క్యారెక్టర్

► **నా తొలి మరాఠీ సినిమా :** 'మురంబ'

► **ప్రస్తుతం మీ ప్రాజెక్టులు :** మూడు విడుదలలు ఉన్నాయి. 'థియేటర్' కూడా చేస్తున్నా. అలాగే అనేక షోలు త్వరలో రానున్నాయి

► **మరువరాని ప్రాజెక్టులు :** ఇదీ అని ప్రత్యేకంగా ఒక్కదానిగురించి చెప్పలేను. 'మురంబ', 'కార్వాన్'లకు హార్డ్‌వర్క్ చేశాను. అద్భుతమైన వ్యక్తులతో కలిసి పనిచేసే అవకాశం వచ్చింది

► **నా నటనా ప్రయాణంలో :** ఇప్పటిదాకా కొండంత ఛాలెంజ్‌లు వున్నాయని చెప్పలేను. వెబ్ సిరీస్‌లో కొంచెం ఛాలెంజింగ్‌గా అనిపించే పని వుంది

► **ముంబయిలో జీవనం :** విభిన్న అనుభవం. నగరం నాకెంతో నచ్చింది

► **ఎంటర్‌టైన్‌మెంట్ పరిశ్రమలో :** పని విభిన్నమైనదిగా వుంటుంది. ప్రయాణంలో కొన్ని నిబంధనలుంటాయి. నిరుత్సాహాలు ఎదురవుతాయి. ఓర్పు, అంకితభావం అవసరం అవుతాయి



► **నేనిప్పటిదాకా నేర్చుకున్న పాఠాలు :** చాలా పెద్దవి. జీవితంలో ఏదీ అంత సులువుగా దక్కదని నేర్చుకున్నాను. మనం కనే కలలు నిజం కావాలంటే హార్డ్‌వర్క్‌చేసి తీరాల్సిందే

► **నా ఫిట్‌నెస్, డైట్ :** వారసత్వంగా నాకు మంచి మెటాబాలిజం వుంది. దీనివల్ల ఫిట్‌నెస్ కార్యక్రమాలకు సంబంధించి కొంచెం లేజీగా వుంటుంటా. అయితే, ఫంక్షనల్ ట్రైనింగ్ బాగా ఎంజాయ్ చేస్తాను. జిమ్‌లో కంటే వెలుపలి వర్కవుట్లు ఇష్టం. ఎటువంటి డైట్లూ అనుసరించను. చిరుతిండ్లు ఇష్టం. తిండిపోతుని

► **భవిష్యత్ కలలు :** నిజంగా ఏదీ ప్లాన్ చేసుకోవడం లేదు. ఎన్ని పనులు చేయగలిగితే అన్ని చేయాలనుకుంటున్నాను. నటన, డ్యాన్స్, పాటలు... అన్నీ. ఏవి ఎలా జరుగుతాయో వేచి చూద్దాం

# వారఫలం

ఆగష్టు 9 నుండి 15, 2018 వరకు

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి
సెల్ : 94921 56064



**మేషం:** అశ్వని, భరణి, కృత్తిక 1వ పా.వృత్తి-వ్యాపారాలలో లక్ష్య సాధనదిశగా సాగాలి. కొన్ని ఒత్తిడులు ఎదుర్కోవలసివచ్చినా క్రమంగా అనుకూలతలు పొందుతారు. అనారోగ్యం సూచితం. ఆర్థికంగా ఉత్సాహములు పొందలేకపోతారు. గృహ వాహనాదుల కొనుగోలు వంటివి ఉంటాయి. ఎదుటివారినుండి మెప్పుకై యోచించక ప్రతికూల సమయంగా భావించి అన్నిటా ఆలోచనలతో సాగాలి. గురు, శుక్ర, బుధ వారములు అనువైనవి. నవగ్రహారాధనలు ఉపకరించగలవు.



**వృషభం:** కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1,2 పా. రాశ్యాధిపతి పంచమకోణస్థితిచే సంతానమునకు ఏర్పడిన విజయాలచే మానసిక ఉత్సాహములు సిద్ధించగలవు.సోదరమూలక ప్రయోజనములుంటాయి.ఆర్థికంగా కొన్నిటికి సర్దుబాట్లు అవసరమవ్వగలవు. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలలో మనసోద్దిష్టములను నెరవేర్చుకోగలరు. ఇతరుల నుండి ఏర్పడు సలహాలను ఆలోచించి స్వీకరించండి. ప్రయాణాలలో జాగ్రత్తలు అవసరం. శుక్ర, శని, ఆది వారములు అనువైనవి.



**మిథునం:** మృగశిర 3,4పా, ఆరుద్ర, పునర్వసు 1,2,3పా. ఇంటిలో శుభకార్యాలను నిర్వహించగలరు. సరదాలకు, చిలిపితనములకు దూరంగా ఉంటూ కర్తవ్యాలకు ప్రాధాన్యతనిచ్చుకోండి. ప్రధానంగా ఏమరుపాటుతనంతో వాహన యంత్రాదులను ఉపకరించకండి. నూతన వస్తు-అలంకరణలు ఏర్పరచుకోగలరు. విద్య ఉద్యోగాలకై చేసే యత్నాలలో ఉపకారాలుంటాయి. గురు,ఆది,సోమవారాలు అనువైనవి.



**కర్కాటకం:** పునర్వసు 4వ పా, పుష్యమి, ఆశ్లేష. ప్రతిపనిలోను శ్రద్ధాసక్తులు చూపవలసిన సమయం. వ్యతిరేకించువారు చికాకు పెట్టు సూచనలు ఉన్నాయి. మీరు వాగ్ధోరణిని అదుపులో ఉంచుకొని ఎదుటివారికి మీపట్ల అవగాహన కలగకుండా వ్యవహరించుకోవాలి. అవసరాలకు తగినట్లుగా ఆదాయములుంటాయి. పనిఒత్తిడి పెంచుకొనుటచే మానసిక ఇబ్బందులను దూరంచేసుకోగల్గుతారు. నిత్యం నవగ్రహారాధనలు మేలుచేస్తాయి. శుక్ర, శని, బుధవారములు అనుకూలం.



**సింహం:** మఖ, పూర్వఫల్గుని,ఉత్తరఫల్గుని 1వ పా. ఈ వారంలో ప్రయత్న అనుకూలతలు ఉన్నా అసంతృప్తికి లోనుకాగలదు. బంధుమిత్రులచే కొన్ని ఖర్చులు ఎక్కువగాఉండడంవారికి సహకరించుటకు చిన్న చిన్న బకాయిలను చేయుటవంటివి ఉంటాయి. మీ నిర్ణయాలలో జాప్యం ఏర్పడకుండా మెలకువలు పాటించుకోవాలి. ప్రభుత్వతరహా చెల్లింపులకు ప్రాధాన్యతనీయవలసివుంటుంది. కొన్ని కష్టవార్తలు వినవలసిరావచ్చును. మీరు నిత్యం ఆదిత్య దుర్గారాధనలు చేసుకోవాలి. ఈ రాశివారికి గురు, ఆది, సోమవారములు అనువైనవి.



**కన్య:** ఉత్తరఫల్గుని 2, 3, 4పా, హస్త, చిత్త 1, 2పా. రోజులు సంతృప్తికరంగా సాగుతాయి.ఖర్చులను సమర్థించుకోగలరు. కుటుంబంలో ఉత్సాహములు నెలకొంటాయి. బంధుమిత్రులలో గుర్తింపు నేర్పరచుకోగలరు. ఆర్థికంగా స్థిరపడడానికి, జీవనోపాధులు ఏర్పరచుకొనేందుకు ప్రయత్నములను ముమ్మరం చేయగలరు. భాగస్వామికి అలంకరణలు ఏర్పరచగలరు. విద్యార్థులకు ఉన్నతవిద్యావకాశాలు ఏర్పడగలవు. వీరికి గురు, శుక్ర, శని, బుధ వారములు అనువైనవి.



**తుల:** చిత్త 3, 4పా, స్వాతి, విశాఖ 1, 2, 3పా. ముఖ్యమనుకొనే పనులను పట్టుదలలు చూపి పూర్తిచేసుకోవాలి. సోదరులతోగాని, జ్ఞాతులతోగాని భూస్థలసంబంధ ఇబ్బందులు ఏర్పడకుండా జాగ్రత్తలు పాటించాలి. ఖర్చులకు తగిన ప్రయోజనాలుంటాయి.వృత్తి, ఉద్యోగ, వ్యాపార, వ్యవహారములలో నూతన పరిచయములు తద్రీత్యా ప్రయోజనములు ఉంటాయి. ఒప్పందములు, అగ్రిమెంట్లువంటి వ్యవహారములతో పునస్సమీక్షణలు అవసరం. సుబ్రహ్మణ్యారాధనలు తప్పనిసరి చేయండి. శుక్ర, శని, ఆది, సోమ వారములు అనువైనవి.



**వృశ్చికం:** విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ. మీ ప్రయత్నాలను ముమ్మరం చేసుకోగలరు. మీరంటే సమీపులలో గుర్తింపును ఏర్పరచుకోగలరు.ఆర్థికంగా కలిసిరాగలదు.కొన్ని సందర్భాలలో ఖర్చులు కన్పించినా మొండిధైర్యమును చూపగలరు. అధికారులతో వ్యవహారములందు ఒకింత సంయమనములతో సాగాలి. నూతనవస్తువుల ఏర్పాట్లు ఉంటాయి. ఉద్యోగయత్నాలలో నిరాశలు ఏర్పరచుకోకుండా యత్నములను సాగించండి. ఆది, సోమ, బుధ వారములు అనువైనవి.



**ధనుస్సు:** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పా. ఈ వారంలో ఎక్కువభాగం మిశ్రమఫలితములతో సరిపెట్టుకోవలసిరావచ్చును. విసుగు విరామం కోరుకోకుండా మీ యత్నములను సాగించాలి. ప్రభుత్వతరహా చెల్లింపులకు ప్రాధాన్యతనీయండి. ఎదుటివారి కవ్వింపు చర్యలకు వశమవ్వకుండా జాగ్రత్తలు అవసరం. ఆర్థిక అవసరములను దృష్టిలోనుంచుకొని ఖర్చులను చేయండి. ఖర్చులు ఒకదానిపై ఒకటిగా ఏర్పడతాయి. తొందరపాటుకు దూరంగా ఉండండి. శుక్ర, శని వారంలో అన్నిటా మరింత జాగ్రత్తగా వ్యవహరించుకోండి.



**మకరం:** ఉత్తరాషాఢ 2, 3, 4పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా. ఈ వారంలోదాదాపుగా అనుకొన్నపనులను పూర్తిచేసుకోగల్గుతారు. కోపం, ఆవేశం వంటివి పైకి ఏర్పడకుండా జాగ్రత్తలు అవసరం. అనారోగ్యం విషయంలో మెలకువలు తప్పనిసరి చేసుకొంటూ, ఎదుటివారికి సలహాలిచ్చుటకు దూరంగాఉండాలి.సంతానానికి శుభములేర్పడతాయి. ఉద్యోగాలలో ప్రమోషన్లు లేదా ఆర్థికప్రయోజనాలు కాని ఏర్పడతాయి. గతంలో రావలసినవి కొన్ని ఈ వారంలో మీకు ఏర్పడతాయి. ఆది, సోమ వారములందు అన్నిటా మెలకువలు అవసరం.



**కుంభం:** ధనిష్ఠ 3, 4పా, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3పా. ఈ వారంలో మీరు విలాసమునకు లేదా అనవసర వస్తు కొనుగోళ్ళకు ఎక్కువ ఖర్చులుచేసే సూచనలున్నాయి. అహంభావాలు ఆధిపత్య ధోరణులకు దూరంగా ఉండాలి. యంత్ర వాహనాల ఉపయోగాలలో మెలకువలు తప్పనిసరి చేయండి. ఇచ్చిపుచ్చుకొనే విషయాలలో మొహమాటాలకు తావివ్వకండి. వివాహాది శుభకార్యాలలో పాల్గొనగలరు. మంగళ, బుధ వారాలలో అన్నిటా మెలకువలు అవసరం.



**మీనం:** పూర్వాభాద్ర 4వ పా, ఉత్తరాభాద్ర, రేవతి. ఈ వారంలో ఎదురుచూస్తున్న వ్యవహారాలు కొన్ని ప్రతికూలించుటచే చికాకులు పొందే సూచనలున్నాయి. కుటుంబంలో మీ ప్రతిపాదనలకు మంచి గుర్తింపులేర్పడతాయి.క్రయవిక్రయాలువంటివి పూర్తిచేసుకోగల్గుతారు. బాధ్యతలను పెంచుకొంటారు. ముఖ్యమైన ఒప్పందాలు, అగ్రిమెంట్లు చేపట్టుకొని పూర్తిచేసుకోగలరు. గౌరవాలకు ఆశించక ఆర్థిక విషయాలపై దృష్టిపెట్టండి. ఆది, సోమ, బుధ వారములు అనువైనవి.

నియమబద్ధ జీవితానికి కోర్కెలను జయించడం మొదటి మెట్టు అవుతుంది.

# అనిల్

Putting ethics into practice involves courage more than conviction



## సృజనాత్మకతకు సాన

ప్రస్తుత కాలంలో పిల్లలపట్ల దృష్టంతా చదువుకు సంబంధించే ఉంటున్నది. ఒకప్పుడైతే వారిలోని సృజనాత్మకశక్తిని, వికాసాన్ని మెరుగుపరిచేవారు. ఇప్పుడవన్నీ లేవు.మార్కులు,ర్యాంకుల పరుగులో వారిలోని ఆసక్తుల్ని వెలికితీసే ప్రయత్నాలు ఏవీ సాగడం లేదు.

నిజానికి పిల్లలు ఎదుగుతున్నకొద్దీ వారిలో సృజనాత్మకశక్తి వేగంగా తగ్గిపోతుంటుంది.సరైన శిక్షణ, ప్రోత్సాహంలేనట్లైతే యుక్తవయస్సుకు వచ్చేసరికి, ఇక వారిలో ఎటువంటి సృజనాత్మకతా కనపడదు.

ఇది సమంజసధోరణి కాదు. చిన్నతనంనుంచీ వారిలోని సృజనాత్మకతకు తగినంతగా సానపెట్టాలి.

పిల్లల్లో సహజంగానే ప్రతి విషయంపట్లా ఆసక్తి వుంటుంది. వాళ్ళు ఉత్సాహంతో వేసే ప్రశ్నలకు సమాధానాలు క్లుప్తంగా చెప్పకుండా, వారికే వాటిని వెతుక్కోగల క్లూ ఇస్తుంటే, వారిలో ఆలోచనాశక్తి పెరుగుతుంది.

ఇలా అనేక రకాలుగా వారిలోగల సృజనాత్మకధోరణిని ప్రోత్సహిస్తూ వుంటే, రానురాను చురుగ్గా, శక్తివంతంగా తయారవుతారు. *

## బొమ్మల పజిల్

ప్రతి సెట్‌లోనూగల విభిన్న రకం ఏదో సర్కిల్ చేయండి. *



## ఆహార పానీయాలు

ఏదోఒకటి తిని కడుపునింపుకుంటున్నారులే అనుకుని పిల్లల ఆహార పానీయాల విషయంలో సంతృప్తి చెందకూడదు. వారి ఆహారం విషయంలో తీసుకునే జాగ్రత్తలు వారిని అనేక రుగ్మతలనుంచి పరిరక్షిస్తుంటాయి.

పిల్లలకు సరైన పోషకాలు, ఖరీదైన పదార్థాల నుంచి అందుతుంటాయని అస్సలు భావించకూడదు.

శరీరానికి శక్తిని ఇచ్చే, మలినాలను వెలికి నెట్టే పదార్థాలు ఎంపికచేసుకునే వారికి ఇస్తుండాలి.

శక్తికోసం పప్పులు, ఆకుకూరలు వంటివి, క్యాల్షియంకోసం నువ్వుల ఉండలు వంటివి, పీచుకోసం బీర, కీర, సొర, బీట్‌రూట్, క్యారెట్‌వంటివి పిల్లలకు ఇస్తుండాలి.

రోగనిరోధకశక్తిని పెంచడంలో సిట్రస్ పండ్లు బాగా ఉపకరిస్తాయి. పిల్లలు తరచూ అనారోగ్యానికి గురవుతున్నారంటే కారణం ఏవో ఒక పోషకాల లోపాలై వుండవచ్చుకాబట్టి అవేంటో క్షుణ్ణంగా పరిశీలించి,తగిన పోషకాలతో భర్తీ చేయాలి. *

## విజయ సంకేతం

బ్రిటీషర్ల పాలననుంచి మనకు స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు లభించి 72 సంవత్సరాలయింది.

1947 ఆగష్టు 15వ తేదీన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఢిల్లీలోని ఎర్రకోటపై మువ్వన్నెల జెండా ఎగరేసి, మనకు లభించిన స్వాతంత్ర్యాన్ని



ఎలుగెత్తి చాటారు. ఆ రోజు నుంచి మనం ఏటేటా స్వాతంత్ర్య దిన వేడుకలు జరుపుకుంటున్నాం.

సరికొత్త దేశ ఆవిర్భావ దినోత్సవం ఇది. కేవలం ఏటేటా వచ్చే సెలవు దినం అనుకోకూడదు. అతిముఖ్యమైన జాతీయ పర్వదినమిది.

మానవులంతా కోరుకునే స్వేచ్ఛ, విముక్తుల ప్రాధాన్యాన్ని, గొప్పతనాన్ని గుర్తుచేసే రోజు. స్వాతంత్ర్య సముపార్జన అనేది ఓ గొప్ప చారిత్రాత్మక ఘటన. ఇటువంటి గొప్ప దినాన్ని తరతరాలవారూ విస్మరించకుండా కొనసాగిస్తున్న పండుగ.

మనకు లభించిన స్వాతంత్ర్యం మనకు దేశభక్తిని, బాధ్యతను గుర్తుచేస్తుంటుంది. మంచి పౌరుని పాత్రను మళ్ళీమళ్ళీ గుర్తుచేస్తుంది.

ఏడాది పొడవునా ఎన్ని జాతీయ సెలవులున్నా ఆగష్టు 15 ప్రాధాన్యం అసాధారణమైనది.

కాబట్టి పిల్లలూ, ఉదయాన్నే స్కూలుకు వెళ్ళి జాతీయజెండా ఎగరేసి, ఆ తర్వాత చాక్లెట్లు తినేసి, సెలవును సరదాగా, ఆనందంగా గడిపేయడమే కాకుండా, ఈనాటి ప్రాముఖ్యాన్ని, ప్రాధాన్యాన్ని, దేశ స్వాతంత్ర్య సముపార్జన ఔన్నత్యాన్ని స్మరించుకోవాలి.




# ఆప్తులెవరు?

ముున్నొకప్పుడు ధర్మదత్తుడనే వైశ్య సత్తముడుఉండేవాడు.అతనికి రాజదత్తుడు, ధనదత్తుడు అనే ఇద్దరు కుమారులు.

ధర్మదత్తుడు మొదట నిరుపేద. కాని అదృష్ట బలంవల్లనూ, చాకచక్యంవల్లనూ కోట్లు ఆర్జించాడు. ఈనాడు ధర్మదత్తుని ఓడలు విహరించని



సముద్రాలు లేవు. అతని అనుచరులు గాలించని దీవులు లేవు. అతని చేతుల్లోంచి మారి, లాభం తెచ్చిపెట్టనిదినుసులుగాని,వస్తువులుగానిలేవు.

ధర్మదత్తుడు యాభై పైబడ్డాడు. కుమారులిద్దరూ పెద్దవాళ్ళయ్యారు.

వర్తకపు మెలకువలు తెలిసికొని తండ్రికి చాలా తోడుపడుతున్నారు. ఇప్పుడు ధర్మదత్తునికి ఎటువంటి చీకులూ చింతలూ లేవు. అయినా అతని మనస్సుకి ఏదో వెలితిగానే వుంటున్నది.

ఒకరోజున అతనిలా ఆలోచించాడు- 'నా కుమారులిద్దరూ నా అంతటివాళ్ళు అయ్యారు. ఇక వాళ్ళకు నా సాయం అక్కరలేదు. నాకూ ముసలితనం వస్తున్నది. ఇంతవరకూ చెప్పుకోదగిన ఒక్క ఉపకారమైనా నేను ఎవరికీ చేసి వుండలేదు. వ్యాపారంలో నావల్ల చెరుపు పొందిన వారు చాలామంది ఉంటారు. వారిలో ఒకరికైనా సాయం చేస్తే, పరమార్థం సాధించినట్టు అవుతుంది. కొంత మనశ్శాంతీ కలుగుతుంది''

ఈ ఆలోచన కలిగినవెంటనే ధర్మదత్తుడు పుత్రులిద్దరినీ పిలిపించి వ్యాపారం అంతా వాళ్ళకు అప్పగించాడు.

కిటుకులన్నీ చెప్పాడు. తరువాత "నాయనలారా! నేను రేపువేకువనే లేచి దేశాంతరం బయలుదేరుతున్నాను. కొన్నాళ్ళవరకూ తిరిగి రాను'' అని చెప్పాడు.

ఆ వార్త విని కొడుకులు కొంత విచారం వెలిబుచ్చారు. కాని పెత్తనం చేజిక్కినందుకు మనస్సులో సంతోషంగానే వుంది.

మరునాడు ధర్మదత్తుడు పెందలకడనే లేచి దేశాంతరం వెళ్ళటానికి సిద్ధమయ్యాడు.

కొడుకు లిద్దరినీపిలిచి 'అబ్బాయిలూ! వెళ్ళి వస్తాను. భద్రం!' అని చెప్పి ముందంజవేశాడు. అతని చేతిలో ఒకచిన్నసంచి మాత్రంవుంది.

కొడుకులిద్దరూ సంచి చూశారుగాని దానిలో ఏముందో గమనించలేదు. ఆ సంచిలో ఏముందో తెలిస్తే వాళ్ళు చాలా ఆశ్చర్యపోయేవాళ్ళు.

ధర్మదత్తుడు దేశాంతరం వెళుతున్నానన్నాడేగాని, నగరం విడిచి ఎక్కడికీ వెళ్ళలేదు.

ప్రొద్దు పోయేదాకా ఊరకనే అటూ ఇటూ తిరిగి కాలక్షేపంచేశాడు. చీకటి పడగానే నగరంలో ఒక కొసని నిరుపేదలు నివసించే పేటలోకి వెళ్ళి, ఒక నిర్జనప్రదేశంలో వేషం మార్చేశాడు. చింకిబట్టలు కట్టాడు. ఇప్పుడ తన్ని ఎవరూ గుర్తుపట్టలేనంతగా మారిపోయాడు.

బాగా ప్రొద్దుపోయింది. చలి కాలం కావటంవల్ల ఎవరింట్లో వారు తలుపులు బిడాయించుకొని పడుకున్నారు. అక్కడక్కడ కుక్కలు మాత్రం మొరుగుతున్నాయి.

ధర్మదత్తుడు పోయిపోయి ఒక గుడిసెదగ్గర ఆగి - 'అమ్మా! చాలాదూరం నుంచి వచ్చాను, ముసలివాణ్ణి. అలిసిపోయాను. ఈ రాత్రికి ఆశ్రయమిస్తారా నాకు?' అని అడిగాడు.

"ఎవరు నాయనా! లోపలికి రండి'' అంటూ నెమ్మదిగా ఒక స్త్రీ కంఠం వినిపించింది. ధర్మదత్తుడు తడిక నెట్టుకొని లోపలకి ప్రవేశించాడు.

ఆ గుడిసెలో వుంటున్నదెవరో ధర్మదత్తుడికి బాగా తెలుసు. ఒక వితంతువూ, ఆవిడ పిల్లలు ముగ్గురూ ఉంటున్నారు. చాలారోజులక్రితం చనిపోయిన సోమగుప్తుడి కుటుంబం అది.

ఈ సోమగుప్తుడు ఒకప్పుడు వాణిజ్యంలో ధర్మదత్తుడితో పోటీచేశాడు. కాని నెగ్గలేకపోయాడు.అతని సంసారం చితికిపోయింది. చివరకు అతడు దివాళా తీసి ఆ బెంగతో క్రుంగి, కృశించి చనిపోయాడు.

అతని భార్య ఇప్పుడు నగరం చివర నిరుపేదలు నివసించే పేటలో ఒక గుడిసెలో ఉంటూ, కష్టంగా కాలం వెళ్ళబుచ్చుతోంది.

గుడిసెలో అడుగుపెట్టగానే ధర్మదత్తుని గుండె





నెవరో కలచినట్టయింది. 'ఈ కుటుంబం దుస్థితికి నేనేగదా కారకుణ్ణి' అనుకున్నాడు.

వాళ్ళెవ్వరూ అతనిని గుర్తుపట్టలేదు. ప్రీతిగా ఆహ్వానించి సత్కరించారు. ఆ కుటుంబాన్ని చూడగానే ధర్మదత్తునికి ఎంతో ముచ్చటవేసింది.

వారి ముఖాన దారిద్ర్యపు గురుతులున్నాయి. కానైతే ఎట్టి విసుగూ, బాధా లేదు. తన ఇంట్లో అష్టైశ్వర్యాలుండేవి. కాని ఒకరిని చూస్తే ఒకరికి పడేది కాదు. నౌకర్లు సైతం కాట్లాడుకునేవాళ్ళు.

ధర్మదత్తుడు ఆ రాత్రికి వారింట్లోనే భోజనం చేసి అక్కడే పడుకొన్నాడు.

పంచభక్ష్యపరమాన్నాలు లేకపోయినా ఉన్న దాంట్లో లేదనకుండా ప్రీతితో పెట్టారు. అతనికి అది అమృతతుల్యమనిపించింది. ప్రొద్దున్నేలేచి "తల్లీ! వెళ్ళివస్తాను, ఊళ్ళో పని ఉంది" అన్నాడు.

కాని ఇంటావిడ "బయటకు వెళ్ళినా పూటకూళ్ళే గదా, ఇక్కడే ఉండ"మంటూ బలవంతం చేసింది. లోలోనసంతోషిస్తూ ధర్మదత్తుడు "సరే" అన్నాడు.

ఇలా పదిరోజులు గడిచాయి.

ధర్మదత్తుడు ఆ ఇంట్లోనే తృప్తి మీర ఆతిథ్యం పొందాడు. ఒక రోజునఅతడు ఇలాఅన్నాడు- "నేనెవరినో ఎరక్కపోయినా, వెంటనే ఆశ్రయమిచ్చారు. నిజంగా మీరు చాలా మంచివారమ్మా!"

"అయ్యో నాయనా! ఎవరైతేనేం? ఒకపూట పెట్టినంతమాత్రాన మా భోగభాగ్యాలు తరిగిపోతాయా?" అన్నది ఇంటావిడ.

"ఎక్కడి ఒక్కపూటమ్మా! నేను పదిరోజులనుంచి తిష్ఠ వేశానే!" అన్నాడు అతడు.

"అయితేనేం నాయనా! నీకోసం మేము ప్రత్యేకంగా శ్రమపడేదేముంది? ఉన్న దానిలో ఇంత తింటున్నావు. పడివుంటున్నావు.

నీవైనా పెద్దవాడివి. ఈ పరాయిదేశంలో ఎక్కడ, ఏం తిప్పలు పడతావు?" అన్నది ఆవిడ.

ఇక ధర్మదత్తుడు నిజం చెప్పకుండా ఉండలేకపోయాడు. అప్పుడు అతడన్నాడు- "అమ్మా! నేను నిజంగా పరదేశినికాను. ఈ ఊరివాడినే. నా పేరు ధర్మదత్తుడు. గుర్తుపట్టారా నన్ను ఇప్పుడైనా?" అని.

"ధర్మదత్తుణ్ణి గురించి వినటమేగాని ఎన్నడూ చూడలేదు నాయనా! అయినా ధర్మదత్తుడు కోటీశ్వరుడటగదా? ఈ చింకిబట్టలతో నువ్వు 'ధర్మదత్తుణ్ణి' అంటే ఎవరు నమ్ముతారు?" అంది ఆవిడ.

అప్పుడు ధర్మదత్తుడు, సోమగుప్తునికీ, తనకూ వ్యాపారంలో పోటీ జరగటం, సోమగుప్తుడు దివాళా తీయటం, ఆ కథ అంతా చెప్పాడు.

కొన్ని కారణాలవల్ల తన స్థితిగతులు దిగజారిపోయాయని, అందువల్ల తాను ఆశ్రయం వెదుక్కుంటూ వచ్చానని కూడా చెప్పాడు.

ఆవిడ పల్లెత్తుమాట అనలేదు. ఒక నిట్టూర్పు విడిచి "నాయనా, జరిగిందానికేం! పెద్దవయసులో ఎక్కడికెళ్ళి మాత్రం ఏం చేస్తావు? మా ఇంటిలోనే వుండిపో. నీకే లోటూ రాకుండా చూస్తాం" అన్నది ఎంతో ఆప్యాయంగా.

ధర్మదత్తుడు "సరే"నంటూ ఒక్కసారిమాత్రం నగరంలోకి వెళ్ళివస్తానన్నాడు.

ఆ సాయంత్రమే ధర్మదత్తుడు వెంటతెచ్చుకున్న సంచిపట్టుకుని తిరిగి ఇంటికి వెళ్ళాడు.

తండ్రిని చూసి రాజదత్త, ధనదత్తులిద్దరూ "ఏం నాన్నా! వచ్చావా? నీ సంగతే రోజూ అనుకుంటున్నాం" అన్నారు.

అందుకు ధర్మదత్తుడు- "అత్యవసరమైన ఒక పని తగిలింది. అందుకని వచ్చాను. వెంటనే ఒక పాతికవేల మాడలు కావాలి" అన్నాడు.

"అయ్యో! ఇప్పుడెలా? ఇంటిలో రొక్కం లేదే!" అని పెదవి విరిచాడు పెద్దవాడు.

"ఇంత మొత్తం ఇప్పుడు ఎందుకు?" అన్నాడు చిన్నకొడుకు.

"ఈ మొత్తం నేను ఒకరికిచ్చి సాయపడదలచుకున్నాను" అంటూ సోమగుప్తుని కుటుంబం సంగతి అంతా చెప్పాడు ధర్మదత్తుడు.

ఇది విని అతని కుమారులు మండిపడ్డారు. "చెమటోడ్చి సంపాదించిన ధనమంతా ఈ విధంగా కానివాళ్ళకు పంచిపెట్టి గంగపాలు చేస్తావా? లోకంలో ఎక్కడన్నా వుందా ఇట్లాంటిది?" అని లేచారు.

వాళ్ళ కేకలు విని నలుగురూ పోగయ్యారు. అప్పుడు ధర్మదత్తుడన్నాడు- "అబ్బాయిలూ! ఆగ్రహపడకండి. మీకు నేను కోట్లు సంపాదించి ఇచ్చాను. పెంచి పెద్దవాళ్ళను చేశాను.

కాని మీరు నా నిమిత్తం ముష్టి పాతికవేల మాడలు ఇవ్వలేకపోయారు. అందుకని, తగు జాగ్రత్తలోనే వున్నాను. ఇదిగో చూడండి!" అని సంచివిప్పి చూపించాడు. దానిలో లక్షలు ఖరీదు చేసే మణులూ, రత్నాలూ ఉన్నాయి.

కొడుకులిద్దరూ తెల్లబోయారు.

అందరూ ఆశ్చర్యపడ్డారు. ధర్మదత్తుడు మాత్రం విచారంగా బయటకు నడిచాడు.

ఆ సాయంవేళ వేసటగా తిరిగివచ్చిన ధర్మదత్తుణ్ణి, చనిపోయిన సోమగుప్తుని భార్యాపిల్లలూ ప్రీతితో ఆహ్వానించారు. ధర్మదత్తుడు ఎక్కడకు వెళ్ళివచ్చిందీ, ఆ సంచివిషయమై ఎంత రగడజరిగిందీమాత్రం వాళ్ళకు తెలియనే తెలియలేదు.

పి.నీలవేణి



# నానారూప పదార్థ నిషేధపర్వం




ట్వెంటీ ట్వంటీ... ఐపిఎల్ 20-20 కాదు. రెండువేల ఇరవైయ్యవ సంవత్సరం. ఒక వారాంతపు శనివారం రాత్రి సోఫాలో జేరబడి కాళ్ళు బారజాపుకొని దూరదర్శన్‌లో కామెడీ షో చూస్తున్నాడు కామెడీరావు ఉరఫ్ డి.కామేశ్వర్రావు.

తల్లిదండ్రి పెట్టిన పేరు నచ్చకో, ఇంటర్నెట్ వచ్చాక వెబ్‌సైట్‌ల ఐడీలన్నీ డాట్‌కామ్‌ల్లో ఉండటం చూసో లేక వెరైటీకోసమో తన ఐడిని కామ్.డి.రావ్‌గా పెట్టుకున్నాడు. అదికాస్తా ఇతరుల నోళ్ళల్లోపడి కామెడీ రావుగా రూపాంతరం చెంది కామెడీ అయ్యింది.

సరే, ఆ కామెడీ సంగతొదిలేసి మన కామెడీలోకి వద్దాం. ప్రదర్శనలో స్కిట్ అనబడే చిన్న హాస్యనాటిక అయ్యాక నిర్ణేతల విమర్శలు పరామర్శలు అవుతుండగా కామెడీరావు దూర శ్రవణయంత్రం మోగింది. అందుకని అలవాటుగా 'అలో' అన్నాడు.

ఆ శనివారం రాత్రి అటునుండి వచ్చిన అశని పాతంలాంటి వార్త విని బారజాపిన కాళ్ళని బరుక్కున లాగి, జేరేసిన ఒంటిని జరుక్కున లేపి నిటారయ్యి రిమోట్‌తో ఛానెల్ మార్చాడు. 'అందువల్ల ప్రియమిత్రులారా... నానారూపాలని కలుగజేసే పదార్థాన్ని నిషేధిస్తూ ఉత్తర్వు జారీ చేస్తున్నాను.

మీ దగ్గరున్న ఆ ద్రవ్యాన్ని ప్రభుత్వ చౌకధరల దుకాణంలో జమచేసి ఆ ఎత్తుకు సరిపడా ప్రత్తిని పొందవచ్చని సూచన చేస్తున్నాను.

ద్రవ్యమార్పిడికి నేటినుండి నెలదినాలు గడువు పెడుతున్నాను. గడువు తరువాత ఏ ఒక్కరిదగ్గర సదరు పదార్థం లభ్యమైనా కఠినచర్యలు తప్పవని మనవి చేస్తున్నాను.ఇది నా కఠోర నిర్ణయమని ఇందు మూలంగా హెచ్చరిస్తున్నాను. జై జనత దేశాధినేతగారి ఉద్వేగమయిన ప్రసంగం విని కని అవాక్కయ్యాడు కామెడీరావు.

అతడి అవాక్కుతో పనిలేక అది తమ హక్కన్నట్టు ఛానెల్ వాళ్ళు అదే ప్రసంగాన్ని గంగ వెర్రులెత్తినట్టు ప్రవాహంలా సాగిస్తూనేవున్నారు.

కాసేపటికి తేరుకున్న కామెడీరావు 'సరే, ఆ నానా రూపాలని కలుగజేసే పదార్థమేమిటో ఆయన ఇదమిత్థంగా చెప్పలేద'ని గ్రహణకొచ్చినవాడై నిర్ధారణ కోసం రిమోట్‌తో ఛానెల్ మార్చాడు.

ఏ ఛానెల్ పెట్టినా ఏమున్నది క్రొత్త చరణం అన్నట్టు అన్నిట్లోనూ ఒకటే పల్లవి అల్లరిచెయ్యటం చూసి దూర శ్రవణ యంత్రానికి పనిచెప్పి దూర ప్రాంతాలవారితో మంతనాలు చేశాడు.

'ఔనా నిజమేనా' అన్నవాళ్ళు కొందరైతే, 'అంతా భ్రాంతియేనా' అన్నట్టున్నవాళ్ళు కొందరు.

ఎక్కడా స్పష్టత రాకపోవటంతో ఇంట్లోంచి బయటపడి ప్రక్కింటి వశిష్ఠరావు దగ్గరికి వెళ్ళబోయాడు. ఎప్పుడూ కర్ఫ్యూ పెట్టినట్టు ఖాళీగా ఉండే కాలనీ రోడ్లు, రాజమౌళి మహాభారతం థియేటర్లముందు క్యూకట్టే బహుజన సమూహాల్లా చిందరవందరగా ఉండటం చూసి సందేహనివృత్తికోసం ఆ సందేహాలలో భాగమవుదామని చూశాడు.

అతడికెవరూ అవకాశం ఇవ్వకపోవటంతో తనకి కావాల్సిన భోగట్టాకోసం సందుచేసుకుని ఆ బృందాల మధ్య తిరగసాగాడు. అయినా సందేహనివృత్తి కాలేదు.

తెల్లారింది. పెద్ద పెద్ద అక్షరాల పతాక శీర్షికలతో వార్తాపత్రికలు వచ్చాయి. అన్నింటిలోనూ కూడబలుక్కున్నట్టు ఒకటే హెడ్డింగ్... 'బ్లాస్టిక్'. ప్లాస్టిక్ బ్యాన్‌ని ఉదహరిస్తూ... ఔను మీరు చదివింది నిజమే, ప్లాస్టిక్ నిషేధంగురించే రాత్రి నేతగారు మోత మోగించింది.

ఆ మోత గంటలు గడిచేకొద్దీ తన పరిధి పెంచుకుంటూ మరో ఆలోచనకి వ్యవధి లేకుండా చేస్తుంది. కర్మాగారాల్లోనూ కార్యాలయాల్లోనూ ఏచోటకన్నా అదే వేట. నిషేధపు జాబితాలో జమచేయవలసి వచ్చే వస్తువులు ఏమిటి?

బ్యాగులు, బకెట్లు, లోటాలు, చేటలు అయితే ఫరవాలేదు. ఎటొచ్చీ, టీవీలు, ఫ్రిజ్‌లు, బైక్‌లు, కార్లు వీటన్నిటినీ పీకి పందిరెయ్యాలంటేనే తంటా... ఎంకి

**శాంతారాం సూరపు**

పెళ్ళి సుబ్బిచావుకొచ్చిందని ప్లాస్టిక్ బ్లాస్ట్ ప్రజల పరాచకానికొచ్చిందని అనుకున్నారు జనం.

సందట్లో సడేమియా అన్నట్టు మన కామెడీరావు 'అయ్యగారొస్తారు ఆపిల్‌పండు తెస్తార'ని ఎదురు చూడకుండా అందిన అరటిపండు తినటం మంచిదని ప్లాస్టిక్ ఏరివేతకి ప్లస్ టిక్ పెట్టాడు.

ఎక్కడినుండి మొదలుపెట్టాలన్న శంకని వంకగా పెట్టి మూడంకె వేసి నిద్దరోకుండా ఇంటిని చక్కబెట్టాక వీధిని చక్కబెట్టాలన్న పెద్దల మాటని పిజ్జా బర్గర్ మూటగా భావించి కార్యోన్ముఖుడయ్యాడు.

కుర్చీలు, స్టూల్లు, కూలర్లు, కర్టెన్లులాంటి పెద్ద వాటి జోలికి అప్పుడే పోకుండా చిన్న చిన్న వాటిని ఏరిపారెయ్యబోతే జడక్లిప్పులు, పౌడర్ టిన్నులు, పేస్టులు, క్రీములు, బాటిళ్ళు మేట్లు ఇలా చిన్నాచితకా డొక్కు డోలు ఓదగ్గర పోగెట్టబోతే పెద్ద గుట్టగా ప్లాస్టిక్ సరంజామా జమవ్వసాగింది.

ఇదో ఎత్తు అయితే ఇక పాలిథిన్ సంచుల పాత్రకి అంతే లేదు. తవ్వినకొద్దీ ఊటలా పోగవుతూనే వున్నాయి. 'డామిట్, ఇది ఇల్లా ప్లాస్టిక్ మిల్లా' అనుకున్నాడు కామెడీరావు. అతడిలానే కామ్‌గా ఇంటిపని కానిస్తున్నవాళ్ళంతా ప్లాస్టిక్ చొరబాటుని చూసి 'ఔరా' అనుకుంటున్నారు.

ఇల్లు ఊడ్చేసరికే కళ్ళు తిరిగినంత పనయ్యింది. ఈ కసవు ఎవడు మోసుకెళ్తాడని చెప్పి, పత్తేదో ఆ పత్తేదారు తీసుకుంటే తీసుకోనిమ్మని శోధించి చెత్తని పట్టి కూడేసే చెత్తేదారుకోసం ప్రయత్నించాడు కామెడీరావు. రోజులో పదిమందైనా అటుగా వచ్చి దొరికిన తృణమో ఫణమో సంచిలో వేసుకుపోయే డస్టెక్టివ్‌లు ఆ రోజు దుర్భిణి వేసినా కనపడనంత డ్రాస్టిక్ మార్పు చూసి విస్తుపోయాడు.

అప్పుడే ఏంచూశావన్నట్టు నాలుగు రోడ్లు తిరిగేసరికి నమ్మలేని నిజం ఎదురైంది. ఓచోట గుంపు కనిపించటంతో చూద్దామని వాళ్ళలోకి చొచ్చుకు వెళ్ళాడు కామెడీరావు. వాళ్ళందరి మధ్యలో ఫకీరు లాంటి కుర్రాడు అభయమిస్తున్నట్టు కనిపించగా ఆరా తియ్యబోయి అచ్చెరువొందాడు.

రాత్రికి రాత్రి పేటకో కొత్త సంఘం పుట్టుకొచ్చిందట. చెత్త చేరవేత సంఘం. ఇప్పుడీ కుర్రాడులాంటి వాళ్ళంతా చెత్త ఏరుకునేవాళ్ళు కాదుట, కొరియర్స్ అనాలట. వాళ్ళదగ్గర టోకెన్ తీసుకుంటే క్రమసంఖ్యని బట్టి ఎవరి వంతువస్తుందో వాళ్ళ ఇంటికొచ్చి తీసుకుప్పు ప్లాస్టిక్ వివరాలకి బిల్ ఇచ్చి, చౌక ధరల దుకాణంలో జమచేసి వాళ్ళిచ్చే ప్రత్తిని తిరిగి చేరుస్తారట.



స్విస్ బ్యాంకుల్లో భారతీయుల డిపాజిట్లు గత నాలుగేళ్ళలో 80 శాతం తగ్గాయి.

-పీయూష్ గోయల్, కేంద్రమంత్రి

వస్తువునిబట్టి రుసుం ఉంటుందిట. ఆ చేరవేత సంఘంలో ఏరివేత ఒక ఉపశాఖ అట. ఏరివేత వీలు కానివాళ్ళ ఇంటికొచ్చి పీకి పందిరేసి అందింది తీసుకెళ్తారు. అలానే పరిసరాల్లోని ప్లాస్టిక్ కూడా.

ఇంటి పరిసరాల్లో అయితే ఇంటివాళ్ళు, పేట పరిసరాల్లో అయితే పేటలోని వాళ్ళు చందాలేసుకుని రుసుం చెల్లించాల్సివుంటుంది. 'ఇది మరీ అన్యాయం' అరిచాడు కామెడీరావు. నిజమేనన్నట్టు చూశారు మిగతా జనం. 'అన్నేయమంటే మరేటి నేయం... తవరే అట్టుకెల్లండి మరి. సొంతాడంత కూలో సూర్యుడు నెత్తిమీన ఎత్రిక పోతుంతే నా సామిరంగ ఉంతాది...' అర్ధోక్తిగా ఆగాడు కుర్రాడు.

జనం చప్పున చప్పబడిపోయారు. కామెడీరావుకి కూడా ఎండ పేరెత్తేసరికి నోట తడారిపోయింది. వాళ్ళలోని ప్రతిస్పందనని పసిగట్టిన కుర్రాడు నవ్వి, 'పేస్టిక్ ఉండగానే పైసలు సక్కబెట్టాలి కద'న్నా.

'టైంరా కానీ' జనంతోపాటు అనుకున్న కామెడీరావు ఆ షరతులకు సమ్మతించినవాడై గుంపులో తన వంతు వచ్చిన టోకెన్ అనబడే చిత్తుకాగితంపై బరికిన ఒక నంబరు అందుకుని ఆ కుర్రాడిచ్చిన చిత్తు పుస్తకంలో ఆ నంబరు ఎదురుగా తన ఫోన్ నెంబరు రాసి ఇంటిదారి పట్టాడు.

ఆ మూడోరోజు రాత్రి ప్రభుత్వం స్పష్టమైన జాబితాతో ముందుకొచ్చింది. టీవీ, ఫ్రిజ్, బైక్, కార్లులాంటివి ముట్టుకోకుండా పూర్తిగా ప్లాస్టిక్‌తో తయారయ్యే వస్తువులపై నిషేధం అని తేల్చిచెప్పింది.

పాలిథిన్ సంచులు, సీసాలు వగైరా చిన్నా చితకా వాటికి ప్రత్తిని, బకెట్లు, బిందెలు వగైరా మార్పిడిలో సదరు అల్యూమినియం పాత్రల ధరల్లో కొంత కోత కోసి ఇవ్వబోతున్నట్టు, కుర్చీలు, టేబుళ్ళు వగైరావాటికి చౌక ధరల్లో సమకూరుస్తున్నట్లు చెప్పారు.

ఇంకేం స్పష్టత వచ్చేయటంతో నాలుగో రోజునుండే జనం చౌకదుకాణాల ముందు బారులు తీరారు.

రద్దీ ఎక్కువవటంతో చేరవేతదార్లు తమ ధరలు అనూహ్యంగా పెంచారు. వచ్చే ప్రత్తికంటే ఈ పత్తేదార్లకి ఇచ్చేదే ఎక్కువ అవుతుందని జనం తమ స్వశక్తిపైనే దృష్టి పెట్టారు.

అలాంటివాళ్ళలో మన కామెడీరావు ముందుంటాడు కాబట్టి ఒక శుభముహూర్తమున ద్రవ్యగామిగా తయారయ్యాడు. నెత్తిపై టోపీలా కుర్చీలు తిరగేసి పెట్టుకుని, బకెట్లలో చిన్న చిన్న ప్లాస్టిక్ వస్తువులు నింపి రెండు చంకలకి తగిలించుకుని-

మెడకి స్టూళ్ళు వ్రేలాడదీసుకుని, టేబుల్ టీపాయ్ బల్లల్ని గుండె వీపు భాగాల్లో కట్టుకుని, వాటి కాళ్ళని తన కాళ్ళకి చుట్టుకుని, టబ్‌లు చెరో చేతిలో డాలుల్లా అమర్చుకుని 'ప్లాస్టిక్ వెడలె ప్రత్తి పాత్రల్దేబోవగ...' అన్నట్టు బయలుదేరాడు.



## టీచర్... తార

గుజరాత్‌లో పుట్టి ఢిల్లీలో పెరిగిన పాయల్ వాద్వా నటి కావాలనుకుంటూనే ఆరేళ్ళపాటు టీచర్‌గా పనిచేసింది. మోడల్‌గా మారి, ఇప్పుడు 'పెదవి దాటని మాటొకటుంది' సినిమాతో నటించాలన్న కోరికను తీర్చుకోగలిగింది.

"బాల్యంనుంచి నటి కావాలన్నది నా కోరిక. కాని, మా అమ్మానాన్నలు చదువుకే తొలి ప్రాధాన్యమిచ్చారు. గ్రాడ్యుయేషన్ తరువాత టీచర్‌గా చేస్తూనే, నా కోరిక తీర్చుకునే ప్రయత్నాలు సాగించాను. సినిమా షూటింగ్ అనుభవాలు అద్భుతంగా వున్నాయి" అని చెప్పింది.

దారిలో కుక్కలు అరుస్తున్నా 'కరవబోదురు గాక నాకేమి భయము... మీ పళ్ళు ప్లాస్టిక్‌లో ఇరుక్కొనునేగాని నా కండకేమియూ గండములేద'ని విర్రవీగుతూ గజము పోవుచుండ శునకములు మొరుగు రీతిని ముందుకేగాడు.

కామెడీరావుని చూసిన చేరవేత కుర్రాళ్ళు ఆ ఆలోచన తమకి రానందుకు అసూయపడ్డారు. క్షణాల్లో ఆ ద్రవ్యగామి వేషం ఫ్యాషనైపోయింది.

అర్ధగంట తరువాత వచ్చినవాళ్ళంతా ఆ వేషంలోనే రావటం చూసి కాపీరైట్స్ అమ్ముకునే పని పెట్టుకున్నా సొమ్ము చేసుకునేవాడిని కదా అని వాపోయాడు కామెడీరావు. రెండుగంటలయ్యింది. క్యూ కూసంత కూడా ముందుకు జరగలేదు.



## ప్రేక్షకులు మెచ్చుతారు

మలయాళీ బ్యూటీలను తెలుగు తెరకు పరిచయం చేయడంలో టాలీవుడ్ ముందుంటుంది. అక్కడినుంచి తెలుగు పరిశ్రమకు దిగుమతి అయిన తాజా తార గాయత్రి సురేష్. ఎమ్.బి.ఎ. చదివి, ఉద్యోగంకోసం వెతుక్కునే సిరి పాత్ర.

తనది పక్కింటి అమ్మాయి పాత్ర అని, ప్రేక్షకులు తనను ఆదరించగలరని, తెలుగు కూడా బాగానే నేర్చుకుంటున్నానని చెపుతున్నది.

సినిమా తొలి షెడ్యూల్‌ను పూర్తిచేసేసి, రెండో షెడ్యూల్‌కు రెడీ అయింది.

ఒంటికి ఎండ తగలకపోయినా లోపలంతా ఉక్కపోతతో తిక్కగా ఉంది. ఆ తిక్కకో లెక్కకుదర్చటానికి ప్రక్కవాళ్ళ సంభాషణలో తల దూర్చాడు కామెడీరావు.

"అవునండీ... చెక్క అల్యూమినియం పాత్రలు సరే, ఈ పత్తేపారమే అర్థంకాలేదు' అన్నారెవరో.

'ఈ ప్రత్తినుండి నూలు వడికి జమచేస్తే గుడ్డ సంచులు ఇస్తారుట' పేపర్ భోగట్టా చెప్పారొకరు.

'భూమి గుండ్రంగా ఉండటమంటే ఇదేనండోయ్... మా తాతలనాడు చూశాను చేతిసంచులు' గుర్తుచేసుకున్నారొకరు. 'ప్లాస్టిక్ నుండి వెలువడే రసాయనం వల్ల క్యాన్సర్ వస్తుందట కదండీ, అందుకే నిషేధమంట' ఓ స్కూలు మాస్టారు.

"క్యాన్సర్ కంటే కూడా ప్రజలదగ్గరున్న ప్లాస్టిక్ నంతా ప్రభుత్వం లాగేసుకోవటం వెనుక ఇంకో ఆన్సర్ వినిపిస్తుంది" అన్నారొకరు.

"ఏంటి?" అడిగారు మాస్టారు.

"ప్లాస్టిక్ కరెన్సీ ప్రవేశపెడుతున్నారు కదండీ. అందుకే ప్రజల దగ్గరున్నదంతా లాగేసుకున్నాక ప్లాస్టిక్ ధర ప్లాటినమ్‌ని మించిపోతుందని వినికిడి" చెప్పాడతను.

"అంటే అప్పుడు పెద్ద పెద్ద జ్యూయలరీ షాపుల్లో బంగారం ప్లాటినమ్ అమ్మినట్టు ప్లాస్టిక్ కూడా అమ్ముతారంటారా" అడిగారొకరు.

"అదేంకాదులెండి... పేపర్ కరెన్సీ ఉందని పేపర్ ధర పెరిగిపోయిందా ఏం" లాజిక్ లాగాడు రావు.

"సహీ బోలా" అన్నారెవరో ఆ ప్రక్కన.

"మాస్టారూ, మీ ఉద్దేశ్యంలో ఈ నిషేధం ఎందుకంటారు" ఆయనే అడిగాడు.

"చైనానుండి ప్లాస్టిక్‌తో తయారైన బియ్యం గ్రుడ్లు, కూరగాయలు యథేచ్ఛగా వచ్చేస్తున్నాయి. అదంతా ఆపటానికే ఈ ప్లాస్టిక్ బ్యాన్ అనుకుంటున్నాను" చెప్పాడు కామెడీరావు.

"బియ్యం, గుడ్లు, కూరగాయలూనూ. అమ్మయ్యో, అవి తింటే మనుషుల గతి ఏంటి...?" అని కంగారు పడ్డారు మాస్టారు.

"పాలిథిన్ సంచులు తిని అర్ధాంతరంగా చనిపోయే పశువులగతే. ఐనా మనం మనుషులం కదండీ... నానాగడ్డీ కరిచినా ఏమవ్వనిది ప్లాస్టిక్ తింటేమాత్రం ఏమవుతుందిలెండి. తినగతినగ వేము...అన్నచందాన ప్లాస్టిక్‌కూడాను.ముందు ముందు బ్రతికుంటే ప్లాస్టిక్ తినొచ్చనే నానుడి పుట్టుకొస్తుంది చూడండి" వెటకారం చేశాడు కామెడీరావు.

> మా మాట కాదన్నవారు మాకు శత్రువు అన్నట్టుగా అధికారంలో వున్నవారు ప్రవర్తిస్తున్నారు.
>
> -జస్టిస్ జాస్తి చలమేశ్వర్
>
> సుప్రీమ్‌కోర్టు మాజీ న్యాయమూర్తి



"అది పుట్టుకొచ్చేలోపల పుట్టుకలే ఆగిపోయేలా ఉన్నాయి..." అని భవిష్యత్తుని చూసినట్టు చెప్పారు మాస్టారు.

"మనుషుల గురించి ఇంత ఆలోచించేవాళ్ళం పశుపక్ష్యాదుల గురించి ఎందుకు ఆలోచించము చెప్పండి" పర్యావరణంపై ఉండవలసిన బాధ్యతని గుర్తుచేశాడు కామెడీరావు.

వాళ్ళంతా ఆలోచనలో పడబోగా జనాల్లో కలకలం మొదలైంది. ప్రత్తి పాత్రలు స్టాక్ అయిపోవటంతో దుకాణం కట్టేసి వెళ్ళిపోజూస్తున్న సిబ్బందిని నిలువరిస్తున్నారు జనం. అదేమిటో చూద్దామన్నట్టు అటు కదిలాడు కామెడీరావు.

అంతదాకా అతడితో చర్చించిన నలుగురూ స్ఫూర్తి పొందినవారై వెంటనడిచారు సైన్యంలా. ఉన్నట్టుండి వెనుకనుండి అరుపులు వినిపించటంతో ఉలిక్కిపడి వెనక్కితిరిగి చూశాడు కామెడీరావు.

అతడివెనుక నడుస్తున్నవాళ్ళు 'బాషా' అంటున్నారో 'బాహు' అంటున్నారో తెలియదుకాని, మొత్తానికి తనని ఎత్తేస్తున్నారనిమాత్రం అర్థమై బోల్డంత బిడియపడిపోయాడు. ఆపై వాళ్ళిస్తున్న ధైర్యంతో బింకంగా ముందుకు అడుగేశాడు.

"ఏమిటి మీ డిమాండ్స్" అడిగింది దుకాణదారు అయినా ప్రభుత్వమే ప్రశ్నిస్తున్నట్టు ఫీలయ్యాడు కామెడీరావు. 'మాకే ప్రత్తిపాత్రలు వద్దు, కర్ర వర్రీలు వద్దు... అలనాడు విదేశీ వస్త్రాల్ని వస్తువుల్ని బహిష్కరించినట్టు మేం ప్లాస్టిక్ సంచుల్ని, వస్తువుల్ని స్వచ్ఛందంగా బహిష్కరిస్తున్నాం..." అంటూ ఆంజనేయుడిలా ఒంటిని బిగించాడు.

ఒంటికి కట్టుకున్న ప్లాస్టిక్ పలపలమంటూ ముక్కలై స్లో మోషన్‌లో నేలరాలసాగింది.

అది చూసి "కామ్ డి... కామ్ డి..." అంటూ వెనుకనున్న నలుగురు రిథమిక్‌గా అరవటంతో మిగతా జనం కూడా గొంతు కలిపారు. కాసేపటికి దేశమంతా దూరదర్శినిలో అదే దృశ్యం మారుమోగ సాగింది. పాలకులు బ్రిటీష్‌వారుకాక భారతావనివారు కావటంతో కామెడీరావు చర్యకి అడ్డు చెప్పకపోగా ప్రతిచర్యగా అతడిని బ్లాస్టిక్‌కి రోల్ మోడల్‌ని చేసి మెడల్ ఇచ్చి సత్కరించారు.

సభంతా కరతాళధ్వనులతో హోరెత్తుతుండగా కామెడీరావు రెండు ముక్కలు మాట్లాడాడు.

"ప్లాస్టిక్ సంచులు మొయ్యకండి. ప్లాస్టిక్ మెతుకులు మొయ్యకండి. మీవి, పశుపక్ష్యాదుల ప్రాణాల్ని ఫణంగా పెట్టకండి... జై జనత..."

"జై జనత" ఏకకంఠంగా అరిచారు సభికులు. 'జై జనత' అంటూ మరింత ఉత్సాహంగా అరిచాడు కామెడీరావు.

"ఏమిట్రా కామెడీ" తట్టిలేపాడు డామిట్రావు, ఉరఫ్ డా॥ మిత్ర. కామెడీరావుతో కూడి అతడి పేరు డామిట్రావ్‌గా రూపాంతరం చెందింది.

"బ్లాస్టిక్‌రా" పలవరించాడు కామెడీరావు.

"రాత్రి టీవీలో ప్లాస్టిక్ గ్రుడ్డు చూసినదగ్గరనుండి అక్కడే స్టిక్ అయినపోయినట్టున్నావు" నెత్తి కొట్టుకున్నాడు డామిట్రావు.

"రాత్రికి రాత్రే దీనిపై నిషేధం ప్రకటిస్తే ఎంత బావుంటుందిరా..." అని కలల్లో తేలిపోతూనే అన్నాడు కామెడీరావు.

డామిట్రావు మాట్లాడలేదు. కాని, గోడపైన బల్లి మాత్రం 'తథాస్తు' అన్నట్టు పలికింది.

ఆ పక్కనున్న స్వాతివారి 2018 క్యాలండర్ రెపరెపలాడింది.




## జీర్ణకారి

ఎండుద్రాక్ష అంటే కిస్‌మిస్‌ను స్వీట్ల తయారీకే పరిమితం చేస్తుంటారు కాని, వేసవిలో వాటిని తినడంవల్ల ఎంతగానో మేలు జరుగుతుంది. కిస్‌మిస్‌లోని పీచు జీర్ణశక్తికి బాగా ఉపకరిస్తుంది.

డయేరియా, మలబద్ధకాలను నివారిస్తుంది. పొటాషియం, విటమిన్ సి సమృద్ధిగా లభిస్తాయి కాబట్టి ఆర్థ్రరైటిస్‌గలవారికి మంచి ఆహారం.

ఐరన్ వుంటుంది కనుక రక్తహీనతనుంచి పరిరక్షిస్తుంది. దంత, చిగుళ్ళ వ్యాధులు తగ్గుతాయి. మెదడుకు ప్రయోజనకరమైనవి. జ్ఞాపకశక్తి, ఏకాగ్రత పెరుగుతాయి.డయాబెటిస్‌గలవారు ఇతరత్రా స్నాక్స్‌కంటే వీటిని తినడం మంచిది. ◆

## యాంటీబయాటిక్స్

ముక్కులు కారిపోతూవుంటే జలుబు మహా ఇబ్బందిగా వుంటుంది. త్వరగా తగ్గిపోవాలని అనేక మంది యాంటీబయాటిక్స్ వాడేస్తుంటారు. జలుబుకు యాంటీబయాటిక్స్ అవసరమా? అన్న సందేహాన్ని వైద్యుని సంప్రదించి నివృత్తిచేసుకోవచ్చు.

యాంటీబయాటిక్స్‌ను బ్యాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్ల చికిత్సలో వాడతారు.బ్యాక్టీరియావల్ల ఇన్‌ఫెక్షన్ కలిగినప్పుడు ఇన్‌ఫెక్షన్‌తో పోరాడేందుకు యాంటీబయాటిక్స్ సాయపడతాయి.

కాని, జలుబు అనేది వైరస్ వల్ల వస్తుంది కాని బ్యాక్టీరియావల్ల కాదు. మరి జలుబుకు యాంటీబయాటిక్స్ వాడకం అవసరమా? ◆

## పూర్తిస్థాయి వ్యాయామం

శరీరంలో ఏదో ఒక ప్రదేశంలో కొవ్వు పేరుకు పోయిందని పేర్కొంటూ, అక్కడ కొవ్వును కరిగించే ప్రయత్నాలు చాలామంది చేస్తుంటారు.

ఫలానా ప్రదేశంలో కొవ్వు పేరుకున్నదంటూ దానికి రకరకాల పేర్లుపెట్టుకుంటారు.

నడుముదగ్గర, తొడలవద్ద, పిరుదుల్లో-ఇలా ఒక్కోచోట పేరుకున్న కొవ్వును ఒక్కో పద్ధతిలో కరిగించే ప్రయత్నాలు సాగిస్తారు. కాని, ఈ విధంగా సహజమార్గంలో ఓ ప్రత్యేక ప్రదేశంలో కొవ్వును కరిగించడం కష్టం.




పూర్తిస్థాయి శారీరక వ్యాయామాలు, ఆహార నియమాలు పాటించాలి. అప్పుడే శరీరంలో అదనపు కొవ్వు ఎక్కడున్నా కరిగిపోతుంది.

ఈ వ్యాయామాలలో ఏదైనా ప్రత్యేక అవయవంపై దృష్టిసారిస్తే ఫలితాలు సంపూర్ణంగా ఉంటాయి. ◆

## ఎండలో గడిపితే చాలు

ఒత్తిడిగా ఉందంటే ఏ పనీ చేయకుండా ఓ దగ్గర కూర్చోవడమో, లేక పడుకోవడమో చేస్తుంటారు. ఐతే, ఒత్తిడిగా వున్నప్పుడు కనీసం పావుగంటసేపు ఎండలో గడిపితే, ఒత్తిడి తగ్గిపోయి, చురుకుదనం వచ్చేస్తుంది.

సూర్యకిరణాలు శరీరాన్ని చురుగ్గా మార్చుతాయి. దీంతోపాటు మనస్సు ఉల్లాసంగా మెదడు పనితీరు చురుగ్గా మారుతుంది. అలాగే మనస్సులోని బాధను నచ్చినవారితో పంచుకుంటే భారం తగ్గి హాయిగావుంటుందని నిపుణులు పేర్కొంటున్నారు. అంటే ఒత్తిడిగా వున్నప్పుడు ఒంటరిగా అస్సలు కూర్చోకూడదన్నమాట.

అందరితో కలివిడిగా, హుషారుగా, సంతోషంగా వుండేవారు ఒత్తిడికి త్వరగా లోనవరని, ఒకవేళ ఒత్తిడికి గురైనా త్వరితంగా బయటపడతారన్నది వారి అభిప్రాయం. ◆

## చురుకుదనాన్నిచ్చే గ్రీన్‌టీ

ప్రతిరోజూ గ్రీన్ టీ తాగుతుంటే చురుకుగా, హుషారుగా ఉండడమేకాదు, ఆరోగ్యానికీ మేలు అవుతుంది. గ్రీన్‌టీ వ్యాధినిరోధకంగా పనిచేస్తుంది. మానసిక ఒత్తిడిని, ఆందోళననూ నివారిస్తుంది.

స్కిన్ ఎలర్జీల నుంచి ఉపశమనాన్ని కలిగిస్తుంది. నోటి దుర్వాసనకు దారితీసే బ్యాక్టీరియాకు గ్రీన్‌టీ అడ్డుకట్టగా వుంటుంది. దంత వ్యాధులకు కారణమయ్యే బ్యాక్టీరియా, వైరస్‌లను నశింపచేసే గుణం కలిగి వుంటుంది.

కండరాలకు విశ్రాంతిని ఇవ్వడంలో శరీరంలోని కొవ్వును కరిగించడంలో గ్రీన్‌టీ సాయపడుతుంది. జలుబు, దగ్గు నివారణలో, కీళ్ళ నడుమ వుండే కార్టిలేజ్ పరిరక్షణలో ఉపకరిస్తుంది.

గ్రీన్ టీ ఫలితాల జాబితా మరెంతో ఉంటుంది. కాబట్టి రోజుకు ఒకటి, రెండు కప్పుల గ్రీన్ టీ తాగుతుంటే ఫలితాలు అనంతం. ◆

## జ్ఞాపకశక్తి తగ్గుతుంది

ఎప్పుడు చూసినా కూర్చునివుంటే కొవ్వు పేరుకుపోతుందనేది బాగా తెలిసిన విషయం. దీనివల్ల కలిగే మరో నష్టాన్నీ కొత్త అధ్యయనాల్లో గుర్తించారు. గంటల తరబడి కూర్చుని గడిపేస్తుంటే క్రమంగా కొన్నాళ్ళకు మెదడులోని జ్ఞాపకశక్తికి సంబంధించిన భాగం కుంచించుకుపోతుందంటున్నారు అమెరికన్ శాస్త్రవేత్తలు.

కదలకుండా అదే పనిగా కూర్చుంటుంటే మెదడులో వుండే జ్ఞాపకాలను పోగుచేసే భాగంలో కణాల సంఖ్య పల్చబడిపోతుందని విస్తృత పరిశోధనల్లో గుర్తించారు. గంటకోసారి లేచి ఓ ఐదు నిమిషాలపాటు అటూ ఇటూ చురుగ్గా తిరుగుతుంటే ఈ సమస్యలు వుండవు.

# సెక్స్ AND సైకాలజీ

Different way to have sex than most of us have tried



డా॥ జి. సమరం

సి.కె. ఆకివీడు

ఇప్పుడు నేను గర్భవతిని. పెళ్ళయిన చాలా రోజుల తరువాత గర్భం వచ్చింది. అయితే మావారు రోజూ సెక్స్‌లో పాల్గొనకుండా ఉండలేరు. ఇప్పుడు నాకు 8వ నెల గర్భిణీ అయినప్పటికీ రోజుకి 2-3 సార్లు సెక్స్‌లో పాల్గొంటారు. కాని ఏమైనా అవుతుందేమోనని నాకు భయం ఉంది.

అయితే ఆయన, నేను సెక్స్‌లో పాల్గొనబట్టే కడుపులో బిడ్డ చక్కగా తయారవుతున్నాడు.

నా వీర్యం గర్భంలో ఉన్న బిడ్డకి మంచి బలం చేకూరుస్తుంది, నీకు ఏమీ ఫర్వాలేదు. కావాలంటే చూసుకో రోజురోజుకీ నీ కడుపెంత పెద్దదవుతోందో గమనించు. అందుకని మనిద్దరం చివరికంటా నిర్భయంగా సెక్స్‌లో పాల్గొనవచ్చునని ధైర్యం చెబుతూ ఆయన పని కానించుకుంటారు.

మీరు అయినా అసలు విషయం చెప్పండి. స్త్రీ గర్భంతో ఉన్నప్పుడు సెక్స్‌లో పాల్గొంటే గర్భంలో ఉన్న బిడ్డకి మంచే జరుగుతుందా? బిడ్డ బాగా బలంగా పుడతాడా ? సలహా చెప్పండి.

పురుషుని వీర్యం గర్భంలో ఎదుగుతున్న బిడ్డకి ఏమాత్రం తోడ్పడదు. ఏడవ నెల నిండేవరకు మామూలుగా అన్నిరకాల రతిభంగిమలలో పాల్గొనవచ్చును. 8వ నెల వచ్చినదగ్గరనుంచి గట్టిగా స్ట్రోక్స్ ఇవ్వకుండా సెక్స్‌లో పాల్గొనాలి.

నెలలు నిండుతున్నా సెక్స్‌లో పాల్గొనడంవలన ఎటువంటి నష్టం లేదు. కొన్ని పరిశీలనలో చివరి కంటా సెక్స్‌లో పాల్గొన్న స్త్రీకి కాన్పు సునాయాసంగా జరుగుతుందని తేలింది.

గర్భం ఉన్న స్త్రీ సెక్స్‌లో పాల్గొనడంవల్ల పెల్విక్ కండరాలు మరింత బలంగా తయారయ్యి కాన్పు తేలికగా అవుతుంది.

కాన్పు సమయంలో పెల్విక్ కండరాలు బిగుసుకుపోకుండా సునాయాసంగా విచ్చుకుంటాయి.

గర్భిణీకి సెక్స్, ఒక విధంగా ఎక్సర్‌సైజ్‌గా పని చేస్తుంది. అందుకని మీరు జాగ్రత్తలు పాటించి సెక్స్‌లో నిరభ్యంతరంగా పాల్గొనవచ్చును.

## అబద్ధంతో నష్టపోతారు

లైంగిక ఆనందం విషయంలో రాజీపడాల్సిన అవసరంలేదు.తాము కోరుకున్నది పొందటం హక్కు, అవతలివారు కోరుకునేది అందించటం బాధ్యత. ఆ విషయంలో నిజాయితీ వుండాలి.లేనిది వున్నట్టుగా భావించుకున్నా, బాగుందని అబద్ధాలాడినా ఇద్దరూ నష్టపోతారు.

ఆ విషయం తెలిసి చేస్తారో లేక తెలియక నటిస్తారో తెలియదుకాని భావప్రాప్తి విషయంలో ఆడవారు అబద్ధాలు ఆడతారు. తాము భావప్రాప్తి పొందకపోయినా పొందామనిచెప్పే ఆడవారి సంఖ్య అరవైఏడుశాతంవరకు ఉంటున్నది.

పడకగదిలో పొందలేకపోయిన భావప్రాప్తి గురించి బయట చెప్పుకుంటారు. కాని ఆయన దగ్గర పడకగదిలో వున్నప్పుడు, అతగాడు అడిగినప్పుడు అబద్ధం చెపుతారు.

'ఆహా! చాలా బాగుంది' అని అతడిని మాటలతో తృప్తిపరచాలని చూస్తారు. దానివలన వచ్చే దీర్ఘకాలిక ఇబ్బందుల గురించి ఆలోచించరు.

పురుషుల్లో 80 శాతంమంది తాము చేసినది తృప్తినిచ్చిందా! లేదా! అని అడిగితీరతారు. అలా అడిగినప్పుడు 'భావప్రాప్తికి చేరాన'ని ఆమెనుండి సమాధానం వస్తే తాను చేస్తున్న తీరు సక్రమమైనదేనని అనుకుని ఇక అదే పద్ధతిలో కొనసాగిస్తాడు. తాను భావప్రాప్తికి చేర్చే మార్గం కనుగొన్నాననన్న ఆనందం అతనిలో పెంచుతారు. కాని భావప్రాప్తి అందుకోలేక ఆడవారు నష్టపోతారు. జీవితంలో ఒక్కసారి కూడా భావప్రాప్తికి చేరకుండానే, ఆ అనుభవం సంపూర్ణంగా పొందకుండానే సెక్స్ జీవితం ముగించిన ఆడవారు చాలామంది వున్నారు.

అందుకని భావప్రాప్తి గురించి అబద్ధం చెప్పటం ద్వారా నష్టముంటుంది. ప్రారంభంలో భయంతో చెప్పలేకపోయినా, ఆ తర్వాత ఏదో ఒక సమయంలో తన అసంతృప్తిగురించి ఆమె గళంవిప్పక తప్పదు.

అలా చెప్పిన క్షణంలో అతనిలో కుంగుబాటు మొదలవుతుంది. మగవాడు తాను అందించే సెక్స్ తృప్తి విషయంలో చాలా గర్వపడతాడు.

భావప్రాప్తికి చేరుతున్నానని ఆమె చెప్పినప్పుడల్లా అతని గర్వం పెరుగుతుంది. ఎప్పుడైతే ఒక్కసారిగా నీవల్ల నాకు ఎటువంటి సుఖంలేదని అంటారో అప్పుడు అతనిలో అంతకాలం తాను సెక్స్ విఫలుడినా అనే సందేహం మొదలవుతుంది.

ఆనాటి నుండి సెక్స్ అనగానే వెనకడుగు. సరిగా చెయ్యలేనేమో అనే సందేహం- వెరసి ఆ ఆదుర్దాతో అంగస్థంభన సమస్యలను కొనితెచ్చుకుంటాడు. ఇటువంటి పరిస్థితి వస్తుందనే తాము అబద్ధం ఆడతామని అనేవారు లేకపోలేదు.

వాస్తవంలో ఈ భావప్రాప్తి లోపాన్ని ఇద్దరూ కలిసి పరిష్కరించుకోవాలి. తనను భావప్రాప్తికి చేర్చే శరీర భాగాలు ఏమిటో స్త్రీకి తెలియదు. ఎటువంటి పద్ధతిలో అతగాడు చేస్తే సెక్స్ ఆనందం నాల్గింతలు పెరుగుతుందో కూడా ఆమెకు తెలియదు.

అలా తెల్సుకోవాలంటే తన శరీరభాగాలమీద తాను ప్రయోగం చేసిచూసుకోవాలి.స్వయంతృప్తి మార్గంలో ఆమె తన శరీరంలోని భాగాలను పరీక్షించుకుంటే, ఏది తనలో భావప్రాప్తికి చేరుస్తున్నదో అర్థమవుతుంది. అలా తెలుసుకున్న భాగాలను అతగాడికి అప్పగించితే మిగిలిన పని అతడు చూసుకుంటాడు.

ఆడవారిని పైస్థాయికి తీసుకువెళ్ళే భాగం ఒకటైె, అతని దృష్టి ఆ భాగంమీద లేనప్పుడు అంతా రసాభాసగా అంతమవుతుంది. తమ శరీరంమీద తామే ప్రయోగం చేసుకోవటానికి ఇష్టం లేనివారు తొలినాళ్ళలో అతగాడిని ఆ ప్రయోగాలు మీ శరీరంమీద చెయ్యమని నిరభ్యంతరంగా అడగవచ్చు.

ఆ ప్రయోగ ఫలితాల్లో ఏది మెరుగ్గా, తృప్తినిచ్చేదిగా తేలుతుందో ఆ పద్ధతిలో రెచ్చిపోయి సుఖపడగలరు. అందుకే సెక్స్ జీవితం ప్రారంభంలోనే సమస్యలను పరిష్కరించుకోవాలి. తన శరీరంలోని భాగాలు, అవి స్పందించే తీరును తెలుసుకున్న స్త్రీలు సెక్స్ జీవితంలో సంపూర్ణ ఆనందం పొందుతారు. ◆

డా॥ జి. సమరం వాసవ్య నర్సింగ్‌హోమ్ బెంజిసర్కిల్ విజయవాడ 520 010 ఫోన్ 0866-2472370 E-mail drsamaram@hotmail.com www.gsamaram.com

ఆర్.ఎల్. విజయనగరం

**నేను నెలతప్పి ఇరవైరోజులయింది. కడుపులో వికారము అనిపిస్తోంది. డాక్టర్‌చే పరీక్ష చేయించుకుంటే 'ప్రెగ్నెన్సీ' అని తేలింది. నాకు వగరువగరుగా ఉండేవి తినాలని పిస్తోంది. ఉసిరికాయలు, పచ్చి జామకాయలు, మామిడికాయలు తినాలనిపిస్తోంది.**

**అలా తింటూంటే మావాళ్ళు ఇవన్నీ వేషాలు అంటున్నారు. కాని నాకు ఎందుకో అలాంటివి తినాలని ఎక్కువగా అనిపిస్తోంది. ప్రెగ్నెన్సీ వస్తే ఇలా తినాలనిపించడం ఉంటుందా, ఉండదా? నేను ఏమీ వేషాలు వేయడంలేదు.**

**కాని మావాళ్ళు ఏదో డ్రామా ఆడుతున్నట్లు అంటున్నారు. అసలు విషయం మీరు చెప్పండి.**

గర్భం వచ్చినవాళ్ళల్లో కొన్ని రసాయనిక చర్యలు జరుగుతాయి. హార్మోన్లు కూడా అధికంగా ఉత్పత్తి అవుతాయి. వీటిల్లో కలిగిన హెచ్చుతగ్గులు,మార్పులు కొన్ని ప్రత్యేక శారీరక, మానసిక స్థితిగతులని కల్గి స్తాయి. అందువల్లే కడుపులో వికారం అనిపించడం, వాంతులవడం, మగతగా అనిపించడం ఉంటాయి. అంతేకాకుండా కొందరిలో పుల్లపుల్లగా, వగరు వగరుగా తినాలనిపించడం ఉంటాయి. అంతేగాని అవి వేషాలుమాత్రం కాదు.

ఆర్.ఎల్. కావలి

**స్త్రీలల్లో కామోద్రేకం కలగకపోతే గర్భం రాదా? నిజమేమిటో తెలియచేయండి?**

గర్భం రావడానికి, కామోద్రేకం కలగడానికి సంబంధం లేదు. సెక్స్‌లో పాల్గొన్నప్పుడు ఎటువంటి కోరికా లేకపోయినప్పటికీ అండం విడుదల ఉన్నట్లయితే మామూలుగానే గర్భం వస్తుంది. స్త్రీలల్లో నెలనెలా అండం విడుదల అవుతుంది. అండం విడుదలయిన సమయంలో సెక్స్‌లో పాల్గొంటే మామూలుగానే గర్భం వచ్చేస్తుంది.అందుకనే ఫ్రిజిడిటీ ఉన్న స్త్రీలల్లో మామూలుగానే సంతానం కలుగుతుంది.

ఎస్.ఎల్. సూర్యాపేట

**మా అమ్మాయి రజస్వలైంది. ఆమె విషయంలో ఎటువంటి పథ్యాలు చేయించాలి? జాగ్రత్తలు ఏమి తీసుకోవాలి?**

యుక్తవయస్సు వచ్చిన తర్వాత మెచ్యూర్ అవడం అనేది అతిసహజమయిన పరిణామం. మెచ్యూర్ అయిన అమ్మాయి విషయములో ఎటువంటి జాగ్రత్తలూ తీసుకోనవసరంలేదు.పథ్యాలు చేయనవసరం లేదు. ఎప్పటిలాగానే స్కూల్‌కి వెళ్ళవచ్చు. అన్నింట్లోనూ అందరిలాగానే ఉండవచ్చు.

యుక్తవయస్సు వచ్చిన అమ్మాయిగాని, అబ్బాయిగాని చాలా త్వరత్వరగా ఎదుగుతారు.

ఈ ఎదిగే వయసులో వాళ్ళకి మంచి పౌష్టిక ఆహారం కావాలి. పాలు, గుడ్లు, పప్పులు, పళ్ళు ఇటువంటివి అన్నీ ఇవ్వాలి. కొంత ఎక్సర్‌సైజ్ కూడా కావాలి. దాంతో పిల్లలు ఏపుగా, బలంగా ఎదుగుతారు.

ఆడపిల్లలు రజస్వలయినదగ్గరనుంచి చాలా త్వరితంగా ఎదుగుతారు. అందుకని మీ అమ్మాయి విషయంలో చక్కని ఆహారం పెట్టండి. ఆరోగ్యంగా, బలంగా తయారవుతుంది.

హెచ్.ఆర్.కె. హైదరాబాద్

**మా ఆవిడ సెక్స్‌లో పాల్గొన్నప్పుడల్లా పొత్తికడుపులో నొప్పి అంటూ బాధపడుతుంది. ఎందుకని? నేను సెక్స్‌లో సరిగా పాల్గొనడంలేదా? రతిభంగిమల్లో ఏమైనా తప్పు ఉందా? సలహా చెప్పండి.**

పొత్తికడుపులో నొప్పి రావడానికి, రతిభంగిమల్లో తేడా రావడానికి సంబంధం లేదు. ఆవిడకి గర్భాశయంగాని, దానిపక్కన ఉండే పేగుల్లో ఇన్‌ఫెక్షన్ గానీ వచ్చివుంటుంది. దీనినే 'పెల్విక్ ఇన్‌ఫ్లమేటరీ డిసీజ్ (పి.ఐ.డి.)' అంటారు.

డాక్టర్‌పరీక్ష చేయడంవల్ల, అల్ట్రాసౌండ్ స్కానింగ్ చేయడంవల్ల పి.ఐ.డి ఉన్నట్లయితే తెలిసిపోతుంది. దాని ప్రకారం యాంటీబయాటిక్స్ వాడితే వాపు,నొప్పి తగ్గిపోతాయి. సెక్స్‌లో పాల్గొన్నప్పటికీ నొప్పి రాదు. వెంటనే మీ శ్రీమతిని డాక్టర్‌కి చూపించండి.

కె.కె. బెంగళూరు

**నా వయస్సు 45 సంవత్సరాలు. ఇంతవరకు పెళ్ళి చేసుకోలేదు. పెళ్ళి ఇంత కాలానికి కుదిరింది. అమ్మాయి వయస్సు 40 సంవత్సరాలు. ఆలస్యంగా పెళ్ళిచేసుకుంటే పిల్లలు పుట్టరని విన్నాను. పిల్లలు పుట్టకపోతే పోనీ. కనీసం సెక్స్‌లో ఎంజాయ్‌చేసే అవకాశం ఉంటుందా, ఉండదా? సెక్స్‌లో ఎంజాయ్‌చేసే అవకాశం లేకపోతే పెళ్ళి మానేస్తాను. మీ సమాధానంపై నా పెళ్ళి ఆధారపడి వుంది. వెంటనే జవాబు చెప్పగలరు.**

లేట్ వయస్సులో కూడా పెళ్ళి చేసుకోవచ్చు. సెక్స్‌ని ఎంజాయ్ చేయవచ్చును. కావలసినదల్లా ఇద్దరి మధ్య ఎట్రాక్షన్ ఉండాలి. ఒకరినొకరు బాగా ఇష్టపడాలి, అభిమానించాలి. ప్రేమించాలి. అలా ఉన్నట్లయితే సెక్స్‌లో కూడా మామూలుగానే ఎంజాయ్ చేయగలుగుతారు. మీరు పెళ్ళిచేసుకోండి.

Courtesy : MAXIMINDIA

సీరియల్

# మనిషి లోని మనిషి



మందాకినితోపాటు పనివాళ్ళంతా ఇంట్లో ఉన్నారు. కాని వాళ్ళెవరూ గజేంద్రతోడాను ఆపలేరని తెలుసు.

నాయకుడవగానే కిందమీదా తెలీటంలేదు వాడికి. అంతా వదిలిపోయిం దనుకుంటే వీడి పీడ ఎక్కువైపోయింది సుదీపకు.

భయపడితే వాడు మరీ బెదిరిస్తాడని తెలుసు. అందుకే "ఎందుకొచ్చావ్?" అంటూ కరుగ్గా అడిగింది సుదీప.

"పిచ్చిప్రశ్న" అంటూ పెద్దగా నవ్వుతూ దర్జాగా హాల్లోని సోఫాలో కూర్చున్నాడు గజేంద్రతోడా.



E-mail: Suryadevaranovelist@gmail.com

సూర్యదేవర రామ్మోహనరావు

"బెల్లం దగ్గరికి చీమలు ఎందుకు చేరతాయి. తెలీదా? ఇప్పుడు నా బెల్లం నువ్వే. అందుకే చీమలా నీ చుట్టూ తిరుగుతున్నాను. వయసులోని ఒంటరి ఆడదానివి ఎన్నాళ్ళు ఇలా ఉండిపోతావ్. ఎవరో ఒక మగ తోడు కావాలి గదా. అది నేనే అయితే కోటలా నీకు రక్షణ ఇస్తాను. ఎన్నిసార్లు చెప్పాలి నీకు? నా ప్రపోజల్ ఏం చేశావ్?" అనడిగాడు.

"ఛీ వెధవా. నా మొగుడిదగ్గర కుక్కిన పేనులా పడివున్న కుక్కవి. అతను పోగానే నోటికి వచ్చింది మొరుగుతున్నావ్. 'వదినా' అంటూ పిలిచిన నోటితో అసభ్యంగా మాట్లాడ్డానికి సిగ్గులేదూ...?" అంటూ ఈసడించింది సుదీప.

"లేదు" అన్నాడు వెంటనే గజేంద్రతోడా.

"నాకు సిగ్గులేదు. సిగ్గు-బిడియం లజ్జ లాంటివి ఎలా ఉంటాయో కూడా నాకు తెలీదు. నాకే కాదు, ఉగ్రవాదులకు నిలయంగా మారిన పాకిస్తాన్‌కి సిగ్గు లేదు. భారతదేశపు లంచగొండి ప్రభుత్వోద్యోగు లకు అంతకంటే సిగ్గులేదు.

ఈ విషయం నీకన్నా సాదూభాయ్‌కి చాలా బాగా తెలుసు. అయినా నువ్వేమన్నా వాడికి తాళి కట్టిన పెళ్ళానివా ఓ బెట్టుచేస్తున్నావ్.

ఉంచుకున్న దానివేగదా. ఇక నుంచి నేను ఉంచు కుంటా. నువ్వు సుఖపడి నన్ను సుఖపెట్టు. నీలాంటి అందగత్తె పక్కనుంటేనే నా మగతనానికి మర్యాద. నువ్వంటే పడిచస్తున్నాను. పట్టుదలకుపోయి పీకల మీదికి తెచ్చుకోమాకు"

"హెచ్చరిస్తున్నావా? నీ బెదిరింపులకు భయపడి లొంగిపోడానికి నేను మామూలు ఆడపిల్లను కాదు. మానమర్యాదలకి పౌరుషానికి ప్రాణమిచ్చే గుజరాత్ పడుచును.పిచ్చి ఆలోచనలు చేయకుండా మర్యాదగా బయటికి నడు" వేలెత్తి డోర్‌వంక చూపించింది.

మందాకినితోబాటు ఇంట్లో పనివాళ్ళు అంతా దూరంగా నిలబడి బెదురుచూపులు చూస్తున్నారు. ఏం జరుగుతుందోనని కంగారుపడుతున్నారు.

తాపీగా లేచి నిలబడి సీరియస్‌గా చూశాడు గజేంద్రతోడా. "బయటికివెళ్ళను... నువ్వు ఏం చేస్తావ్?" అని నిర్లక్ష్యంగా అడిగాడు.

"పోలీస్ కంప్లయింట్ ఇస్తాను..." అంది కోపంతో



జేవురించిన ముఖంతో సుదీప.

"నువ్వు పోలీస్ రిపోర్ట్ ఇవ్వటమంటే నీ చావు నువ్వు కొనితెచ్చుకున్నట్టేనని మర్చిపోకు. నేను అరెస్ట్ అయిన మరుక్షణం నువ్వు ఎక్కడ వున్నా సరే, నా మనుషులు నిన్ను కాల్చిచంపేస్తారు జాగ్రత్త. చూడు! నువ్వు నవ్వుతూ నా పక్కలోకొస్తే నాకు ఆనందం. పగతో వస్తే నా ప్రాణం తీస్తావని భయం.

ఎందుకంటే, ఆడది తలుచుకోవాలేగాని మగాడ్ని ఎప్పుడైనా చంపేయగలదు. అందులోనూ నీలాంటి రోషమున్న ఆడదాంతో మరీ ప్రమాదం.



## జరిగిన కథ (39)

తనకి, తన తండ్రికి, సంస్థానానికి ద్రోహం చెయ్యాలనుకున్న ఓ నీచుడిని ఏం చేయాలని ఆ సభలోనే ఇన్‌డైరెక్ట్‌గా స్వామీజీని అడుగుతుంది సంజనా. ఆమెకు అంతా తెలిసిపోయిందని గ్రహిస్తాడు స్వామి సత్యానంద.

ఇంతలో జనం ఒక్కసారిగా గగ్గోలుగా అరవటం వినిపించి ఉలిక్కిపడి ఆ దిశగా చూస్తారంతా. చనిపోయిందనుకున్న ఓ కోడెగిత్త హటాత్తుగా లేచి పరుగులు పెడుతూ వస్తోంది. జనం ఎటువాళ్ళు అటు పరుగులు పెడుతుంటే ఆ కోడెగిత్త నేరుగా వెళ్ళి స్వామి సత్యానందను తన వాడి కొమ్ములతో కుమ్మేసి చంపేస్తుంది.

ఆ కోడెగిత్తలోకి కార్తికేయ పరకాయ విద్యతో ప్రవేశించాడని ఒక్క సంజనామాత్రమే గ్రహిస్తుంది. ఆ రకంగా శత్రుసంహారము పూర్తవుతుంది. ఐతే జనానికి, పోలీసులకి, మీడియాకు అర్థంకాని విషయం ఒక్కటే, చచ్చిన కోడెగిత్త బతకడం ఏమిటి? స్వామీజీని చంపాక తిరిగి అది చనిపోవడమేమిటనేది.

ఢిల్లీలో సాదూభాయ్ పోగానే అతని భార్య సుదీపమీద కన్నేస్తాడు మాఫియా లీడరు గజేంద్రతోడా. ఇక జరిగేది చదవండి.

అందుకే ఆలోచిస్తున్నాను. లేదంటే ఈ క్షణమే నిన్ను ఇప్పుడే ఇక్కడే నీ బెడ్‌రూమ్‌లోకి ఎత్తుకు వెళ్ళి సొంతం చేసుకోవడానికి క్షణం పట్టదు"

"అప్పుడుకూడా నీకోరిక తీరదురా నీచుడా. నువ్వు నన్ను తాకేలోపలే నేను ప్రాణం తీసుకుంటాను" అన్నది సుదీప.

"చూద్దాం... నీ పంతం నెగ్గుతుందో నా కోరిక తీరుతుందో. చూడు! నీకు మూడురోజులు టైమిస్తున్నాను. బాగా ఆలోచించుకుని నాకు ఫోన్ చెయ్యి. అల్లరికాకుండా వచ్చిపోతూంటాను.

లేదనుకో. మూడో రోజు వచ్చి నిన్ను కిడ్నాప్ చేసి నా అడ్డాకి ఎత్తుకుపోతా. తర్వాత నీ అడ్రస్ కూడా ఎవరికీ దొరకదు గుర్తుంచుకో" అంటూ సీరియస్‌గా హెచ్చరించి తన మనుషులతో వెళ్ళిపోయాడు గజేంద్ర తోడా. వాడి కారు శబ్దం దూరమయ్యేవరకు బొమ్మలా మెట్లమీదే నిలబడిపోయింది సుదీప.

తర్వాత నెమ్మదిగా హాల్లోకొచ్చి సోఫాలో కూలబడింది. మనసు అల్లకల్లోలమైపోయింది. ఆఫీసుకు వెళ్ళబుద్ధిగావటంలేదు. పనివాళ్ళంతా ఆమె వంక జాలిగా చూస్తున్నారు. ఎవరికీ రాకూడని కష్టం ఇది. ఏదో ప్రశాంతంగా బతుకుతుండటం విధికి ఇష్టం లేనట్టుంది. ఊహించని కష్టం సృష్టించాడు. తనను ఎవరు ఆదుకుంటారు. దుఃఖం ముంచుకొస్తోంది.

ముఖాన్ని రెండు చేతుల్లో దాచుకుని చాలాసేపు



## తొలిసారి డ్యూయల్ రోల్

**తొ**లిసారి డ్యూయల్ రోల్ చేశానంటూ త్రిష తెగ మురిసిపోతున్నది.

"'మోహిని' హారర్ చిత్రమే కావచ్చు, కాని పూర్తి ఫ్యామిలీ ఎంటర్‌టైనర్. కుటుంబ ప్రేక్షకులూ ఎంజాయ్ చేయతగినదని 'యు' సర్టిఫికెట్ ఇచ్చామని సెన్సార్‌వాళ్ళే చెప్పారు.

ఈ సినిమా నాకు చాలా ఛాలెంజింగ్‌గా అనిపించింది. అస్సలు పోలికల్లేని వైష్ణవి, మోహినీ పాత్రలు చేశాను. ఆసక్తిదాయకమయిన చిత్రం. సినిమాను తెలుగులో కూడా విడుదల చేసినందుకు అందరికీ చాలా చాలా థ్యాంక్స్" అని చెప్పింది.

దుఃఖిస్తూ ఉండిపోయింది. చాలాకాలంగా ఆ ఇంట్లో పనిచేస్తున్నవాళ్ళే ఆ పరిస్థితికి చలించిపోయారు. మేడమ్ సుదీప మంచిమనసు అందరికీ తెలుసు.

ఆమె సంతోషంగా ఉంటేనే తామంతా ఆనందంగా ఉండగలరు. కాని ఆ దుర్మార్గుడు గజేంద్ర తోడాని ఎవరాపగలరు? బాధగా ఉంది అందరికీ.

సుదీప పర్సనల్ మెయిడ్ మందాకిని నెమ్మదిగా వచ్చి కాళ్ళదగ్గర కూర్చుంది. "మేడమ్. మీరిలా బాధపడ్డం చూళ్ళేకపోతున్నాం. ఊరుకోండమ్మా. మీ మంచి మనసుకు అంతా మంచే జరుగుతుంది.ఆ దేవుడు మిమ్మల్ని కాపాడ్డానికి ఎవరో ఒకర్ని పంపించకపోడు. మీరు ధైర్యంగా ఉండాలి" అంటూ సుదీపకు ధైర్యం చెప్పింది.

సరిగ్గా అదే టైమ్‌కి అక్కడ పర్లాకిమిడి సంస్థానాధీశుడు రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్‌తో బాటు మేనల్లుడు కార్తికేయ ఇద్దరూ ఢిల్లీ ఎయిర్‌పోర్ట్‌లో విమానం దిగారు.

పర్లాకిమిడి సంస్థానానికి చెందిన గెస్ట్‌హౌస్ ఒకటి పాత ఢిల్లీ అవుట్ స్కర్ట్స్‌లో ఉంది. అది ఇప్పటిది కాదు. ఎప్పుడో రామచంద్ర గజపతి మహదేవ్‌గారి హయాంలో కట్టించింది. ఏదో పనిమీద తరచూ ఢిల్లీ రావలసివుంటుందనే ఉద్దేశంతో కట్టించారు.

గెస్ట్‌హౌస్ బాగోగులు చూసేందుకు ఒక స్థానిక కుటుంబాన్ని కూడా అవుట్‌హౌస్‌లో ఉంచారు. రోల్స్ రాయిస్ కారు కూడా ఉంది. ఐదేళ్ళక్రితం విష్ణుచంద్ర గజపతి మహదేవ్ లండన్‌నుంచి వచ్చినప్పుడు బాగా పాతబడిందనే ఉద్దేశంతో గెస్ట్‌హౌస్‌ని రీమోడల్ చేయించి అధునాతనంగా తీర్చిదిద్దారు.

బెంజ్ కార్లంటే రాజావారికి చాలా ఇష్టం. ప్రస్తుతం ప్యాలెస్‌లో ఉన్న పాతిక కార్లూ బెంజ్ కార్లే. అలాగే ఢిల్లీలో కూడా ఒక బెంజ్ కారు వుంచారు.

రోల్స్ రాయిస్ కూడా కండిషన్‌లోనే ఉంది. కార్లు రెండూ షెడ్లో ఉంటాయి.

స్థానికులు గెస్ట్‌హౌసుని భద్రంగా చూడ్డంలేదని వాళ్ళని తప్పించి పర్లాకిమిడి నుంచి వంటావార్పు తెలిసిన నమ్మకమైన ఒరియా కుటుంబాన్ని ఢిల్లీ తీసుకెళ్ళారు. భార్యాభర్త ఇద్దరు పిల్లలు. వాళ్ళు గెస్ట్‌హౌస్‌ని కనిపెట్టుకుని ఉంటూ పిల్లల్ని అక్కడే చదివించుకుంటున్నారు.

నెలనెలా అందరికీ అందినట్టే సంస్థానం నుంచి వాళ్ళక్కూడా జీతభత్యాలు అందుతూంటాయి. రాజావారు ఢిల్లీ వచ్చారంటే వాళ్ళకి పండగే.

ఎందుకంటే తినాలనుకున్న తిండి దొరుకుతుంది రాజావారు తినగా మిగిలినవన్నీ వాళ్ళకేగదా. అంతే కాదు, రాజావారికి కొడైకెనాల్, ఊటీ, కాశీ, గయ, ముంబయి, మద్రాసు, బెంగళూరులాంటి అనేక ప్రాంతాల్లో అందమైన విడిది గృహాలు ఉన్నాయి.

రాజావారు ఎక్కడికి వెళితే అక్కడి ఎస్టేట్ ఉద్యోగులకు మూడునెలల బోనస్ అందుతుంది. అందుకే చాలా విశ్వాసంగా ఉంటారు వాళ్ళు.

విమానం దిగ్గానే రాజావారు, కార్తికేయ ఇద్దరూ ట్యాక్సీలో గెస్ట్‌హౌస్ చేరుకున్నారు. పాత ఢిల్లీ అనగానే టక్కున కార్తికేయ మదిలో మెదిలిన రూపం సుదీప. అక్కడికి సుదీప నిలయం 3 కిలోమీటర్ల దూరానికి మించదు. ఎలా ఉందో ఏమిటో? కాని అటు వెళ్ళకూడదనే దృఢసంకల్పంతోనే ఢిల్లీ వచ్చాడు కార్తికేయ.

ఇదిలా ఉండగా మరో సమస్య ఎదురైంది. ఒక్కోసారి మన అంచనాలు తప్పుతుంటాయి. నమ్మకంగా ఐపోతాయనుకున్న పనులు కూడా జాప్యం జరుగుతుంటాయి. అలాంటి అనుభవమే రాజావారికీ ఎదురయింది. కార్తికేయ ఎఫెక్ట్ గురించి ప్రధానమంత్రి గారికి పూర్తిగా వివరించి ఫ్యాక్టరీల నిర్మాణానికి ఎంత ఖర్చవుతుందో అంచనాలు చెప్పి ప్రభుత్వం నుంచి లభించే సాయం ఎంతో తెలుసుకుంటే మిగిలినవి ప్లాన్ చేసుకోవచ్చనే ఉద్దేశంతో ఢిల్లీ వచ్చారు.

కాని జరిగిన పొరబాటేమంటే పి.ఎమ్. ఢిల్లీలోనే ఉన్నారనే నమ్మకంతో ప్రధాని ఆఫీసుకు ఫోన్ చేయకపోవటం. ఎంతో నమ్మకంతో నేరుగా వచ్చేశారు.

కాని చెక్ రిపబ్లిక్ ప్రత్యేక ఆహ్వానం అందటంతో ప్రధాని ఆ ఉదయమే ప్రత్యేక విమానంలో సిబ్బందితో కలిసి చెక్ రిపబ్లిక్‌లో పర్యటనకు వెళ్ళారు.

అటునుంచి లండన్ చేరుకుని యూరప్ సమ్మిట్‌లో స్పెషల్ గెస్ట్‌గా పాల్గొని ఇటీవలే యూరి మిలటరీ క్యాంపుపై పాకిస్తాన్ జరిపిన దాడిమీద ప్రసంగిస్తారు. వారం తర్వాతగాని ఆయన ఇండియా తిరిగిరారు.

ప్రధాని ఆఫీసుకు ఫోన్ చేయగానే తెలిసిన సమాచారం ఇది. అది వింటూనే దిగాలు పడిపోయారు రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్. "ఏం చేద్దాంరా కార్తీ. వెళ్ళిపోయి వచ్చేవారం వద్దామా?" అనడిగారు.



**షరియత్ అమలుకావాలని కోరుకునేవారు భారత్‌ని వదిలి పాకిస్తాన్‌కి వెళ్ళిపోవచ్చు.**

*-సాక్షి మహారాజ్, బి.జె.పి. ఎమ్.పి.*

"వద్దులే మావయ్యా. వెళ్ళి ఏం చేస్తాం... అనవసరంగా తిరగటంతోనే సరిపోతుంది మనకి. ఎలాగూ వచ్చేశాంగా. కళ్ళు మూసుకుంటే వారం గిర్రున తిరిగిపోతుంది. ఈ లోపల మీ మిత్రుడు హోమ్ మినిస్టర్‌గారిని అలాగే పరిశ్రమల శాఖామంత్రిని ఇంకా ఎంపిలను కలవండి. ఎక్కువ ఫండ్స్ వచ్చేట్టు మనకి మద్దతు కూడగట్టండి" అన్నాడు కార్తికేయ.

"మరి నువ్వు?"

"ఇక్కడ కొందరు ఫ్రెండ్స్ ఉన్నారు. వెళ్ళి కలుస్తాను. కాలక్షేపంగా ఉంటుంది. వీలైతే ఓ రోజు ఆగ్రా వెళ్ళి తాజ్‌మహల్‌ని చూసొద్దాం"

"గుడ్ ఐడియా. తాజ్ అందాలు చూడాలంటే పున్నమిరోజే చూడాలి. పౌర్ణమి దగ్గర్లోనే ఉంది చూసొచ్చేద్దాం" అన్నారు ఉత్సాహంగా రాజావారు. తర్వాత పర్లాకిమిడి ప్యాలెస్‌కు ఫోన్‌చేసి ఇక్కడి పరిస్థితి సంజనాకు వివరించారు. గెస్ట్‌హౌస్ నుంచి బయటికి వెళ్ళాల్సిన పనిలేదు. అన్ని సౌకర్యాలూ ఉన్నాయి.

ఆ రోజు టీవీ చూస్తూ గెస్ట్‌హౌస్‌లోనే రెస్ట్ తీసుకున్నారు. అయితే కార్తికేయ మనసులో అలజడి మాత్రం ఎవరికీ తెలీదు. ఆ రోజు మళ్ళీ వస్తానంటూ సుదీపకు మాట ఇచ్చాడు. ఇప్పుడు మాట నిలబెట్టుకోవాలా వద్దా! అని.

కార్తికేయ మనసును తొలిచేస్తున్న ప్రశ్న ఇది. పదేపదే సుదీప గుర్తుకొస్తోంది. ఎంతైనా తను సాదూ భాయ్ శరీరంలో పరకాయప్రవేశం చేసి ఉండగా పక్షం రోజులు ఆమెతో సంసారం చేసిన అభిమానం. పాపం ఒంటరిగా ఎలా ఉందో ఏమిటో.

అక్కడ సుదీప నిలయంలో పనివాళ్ళతో సహా అంతా తనకు తెలుసు. కాని తను ఎవరికీ తెలీదుగా. ఒకసారి అటు వెళ్ళి తను ఎలా ఉందో చూసి పరామర్శించి వస్తే తప్పేమిటి? ఇందులో సంజనాకు జరిగే అన్యాయం కూడా ఏమీలేదు.

అసలు ఢిల్లీలోనే పి.ఎమ్. ఉండుంటే తను పనుల తోనే సరిపోయేది. ఇలా మాటిమాటికీ సుదీప గుర్తొచ్చేదికాదు. వారంరోజులు ఖాళీగా ఉండాలనేసరికి పదేపదే గుర్తొస్తోంది. మరునాడు ఉదయం బయటికి వెళ్ళడానికి రోల్స్ రాయిస్ కారును షెడ్‌లోంచి బైటికి తీశారు రాజా విష్ణుచంద్రగజపతి మహదేవ్.

"మావయ్యా. ఈ పాతకారు నేను తీసుకెళ్తాను. మీరు బెంజ్‌కారు తీసుకెళ్ళండి"అన్నాడు కార్తికేయ.

"ఫరవాలేదురా. నాలాగే ఇదీ ముసలిదయింది. మా ఇద్దరికీ సరిపోతుంది. ట్రబులివ్వదు. యువకుడివి. దర్జాగా ఉంటుంది బెంజ్‌కారు నువ్వు తీసుకెళ్ళు" అంటూ ముందుగా తనే డ్రైవ్‌చేసుకుంటూ రోల్స్‌రాయిస్‌లో బైటికెళ్ళిపోయారు రాజావారు.

కార్తికేయ బెంజ్‌కారు తీసుకుని బయటికెళ్ళి కొందరు మిత్రుల్ని కలిశాడుగాని సుదీప నిలయం వైపు పోలేదు. అప్పటికీ ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాడు. ఆపైన తను చెప్పినట్టే ఇల్లీగల్ వ్యాపారాలు మానేసి ఎక్స్‌పోర్ట్ అండ్ ఇంపోర్ట్ బిజినెస్ మాత్రం చూసుకునేందుకు ఉదయం ఆఫీసుకు వెళ్ళిపోతుంది అని తెలిసింది. ఆఫీసుకు వెళ్ళి కలవటం తనకు ఇష్టం లేదు. అందుకే వెనక్కివచ్చేశాడు.

మూడోరోజు ఆదివారం. ఆఫీసులకు సెలవు. సుదీప ఇంట్లోనే ఉంటుంది. ఏమైనా సరే వెళ్ళి ఓసారి చూసిరావాలనే నిర్ణయానికొచ్చేశాడు.

ఉదయం ఎనిమిది గంటలకే రెడీ అయి బెంజ్ కార్లో బయలుదేరాడు కార్తికేయ.

అక్కడ సుదీప నిలయంలో పరిస్థితి వేరుగా ఉంది. భయం గుప్పిట్లో చిక్కి వణుకుతోంది. అల జడి ఆరాటాల మధ్య నలిగిపోతోంది. ఎందుకంటే గజేంద్ర తోడా ఇచ్చిన మూడురోజుల గడువు తీరిపోయింది. ఆ వెధవ మందీమార్బలంతో ఏ క్షణంలో నయినా రావచ్చు. వచ్చి సుదీపను ఎత్తుకుపోవచ్చు.మారణాయుధాలతో వచ్చే నికృష్టుడ్ని ఇక్కడ ఎవరూ ఆపలేరు. పోలీస్ కంప్లయింట్ ఇస్తే చంపేస్తానంటూ వాడు ముందే హెచ్చరించాడు.



ఇదివరలో బి.జె.పిని బహిరంగంగా సమర్థించాం... ఇప్పుడు బహిరంగంగా వ్యతిరేకిస్తాం.

-ఉద్ధవ్‌థాక్రే, శివసేన్ అధ్యక్షుడు

ఏం చేయాలి? వాడు ఖచ్చితంగా వస్తాడు. సందేహంలేదు. సుదీపకోసం పిచ్చెక్కి ఉన్నాడు వాడు. సుదీపకూ టెన్షన్‌గానే ఉంది. ఏం చేయడానికీ పాలుపోవడం లేదు. భయంతో రాత్రి సరిగా నిద్రకూడా పోలేదు. ఉదయం లేవగానే స్నానాదికాలు ముగించి ఎనిమిది గంటలకే కాఫీ టిఫిన్లు తీసుకుంది.

గుండె రాయిచేసుకునివచ్చి హాల్లో కూర్చుని వీధి గుమ్మంవంకే చూస్తోంది. ఆ పరిస్థితే వస్తే గజేంద్ర తోడాను చంపి తనూ చచ్చిపోవాలనే దృఢసంకల్పంతో పిడిబాకును బొడ్లో దాచి ఉంచుకుంది.

"నేను ఓ మాట చెపుతాను. వింటారా?" మేడమ్ అని అడిగింది మందాకిని.

సుదీపలాంటి యజమానురాలిని కాపాడుకోకపోతే తమకు పుట్టగతులుండవని మందాకినికే కాదు పనివాళ్ళందరికీ తెల్సు. ప్రతినెలా సక్రమంగా జీతాలివ్వటమేకాదు, అడక్కుండానే పనివాళ్ళ కష్టం తెల్సుకుని ఆదుకునే గొప్ప మనసున్న మనిషి, దేవత. అలాంటి దేవతకు రావలసిన కష్టంకాదిది.అందుకే తమకే కష్టం వచ్చినంతగా బాధపడిపోతున్నారు పనివాళ్ళు.

"ఏంటే.. చెప్పు?" అంది పొడిగా సుదీప.

"ఏముందమ్మా. గాల్లో దీపం పెడితే రెక్కల పురుగులన్నిటికీ లోకువే. రెక్కలతో కప్పి వెలుగును ఆర్పేయాలని చూస్తాయి. కాదంటే అక్కడ మంటలో పడి అవి ఛస్తాయి ఇక్కడ మగపురుగులు మనల్ని వేధించి చంపాలని చూస్తారు. మగదిక్కు లేకపోతే ఇంతేగా. అడ్డమైన ప్రతి వెధవా ఆడదాన్ని సొంతం చేసుకోవాలని చూస్తాడు"

"ఇంతకీ ఏమంటావే? వాడికి లొంగిపొమ్మంటావా?" అడిగింది సుదీప.

"అయ్యో... నా ఉద్దేశం అదికాదు మేడమ్"

"ఇంకేమిటి? చెప్పిచావు. అసలే టెన్షన్‌తో చచ్చిపోతున్నాను" అంది సుదీప.

"యుద్ధమంటూ వస్తే జయించేవాడు రెట్టించిన ఉత్సాహంతో పోరాడతాడు. ఓడిపోయేవాడు పిక్కబలం చూపి పారిపోయి దాక్కుంటాడు. అపాయంలో ఉపాయంగా తప్పించుకుని దాక్కోవాలి. మీరు కనబడకపోతే ఆ గజేంద్రతోడా ఏం చేస్తాడు?"

"ఏంటే... దాక్కోమంటావా... ఎన్ని రోజులు?"

"మనకి మంచిరోజు వచ్చేవరకు"

"వస్తుందంటావా?"

"ఖచ్చితంగా వస్తుంది. నన్ను నమ్మండి.మీరిక్కడే ఉంటే వాడు అన్నంత పనీ చేస్తాడు. మిమ్మల్ని కిడ్నాప్ చేస్తే తర్వాత మేం ఏం చేయలేము. నా మాట విని ప్రస్తుతానికి మీరెళ్ళి బెడ్‌రూమ్‌లో దాక్కోండి. వాడొస్తే పొద్దుటే మీరు ఎక్కడికో వెళ్ళిపోయారని చెప్తాం. ఆ తరువాత గుజరాత్ వెళ్ళి ఎక్కడో పేరు మార్చుకొని కొన్నాళ్ళు సెటిలయిపోతే వాడి తీవ్రత తగ్గుతుంది"

"వేరే చోటుకి వెళ్ళి కొన్నాళ్ళు రహస్యంగా ఉండటం తరువాత. ఇప్పుడు నేను వచ్చేవరకు కదలనంటూ వాడిక్కడే కూర్చుంటే? నేను ఎంతసేపు బెడ్‌రూమ్‌లో ఉండాలి?"

"కూర్చోడు మేడమ్. వాడిమీద చాలా పోలీస్ కేసులున్నాయి. పబ్లిక్‌లో ఎక్కువసేపు ఉండలేడు"

"మిమ్మల్ని కొట్టి నిజం చెప్పిస్తే?"

"చచ్చినా చెప్పం. ఎందుకంటే మీరంటే మాఅందరికీ ప్రాణం. నా మాట విని లేవండి"

"అంతేనంటావా?"



## ఘాటు ప్రేమ

ఎప్పటికప్పుడు తన ప్రేమలోని ఘాటును తెలియజెప్పున్నట్లు ఆంద్రూనీబోన్‌తో కలిసి దిగిన ఫోటోలను సామాజిక మాధ్యమాల్లో పోస్ట్ చేస్తుంటుంది ఇలియానా. సైగా, ఓ నెటిజన్ అడిగిన ప్రశ్నకు "ఆండ్రూను పిచ్చిపిచ్చిగా ప్రేమిస్తున్నాను. అయామ్ మ్యాడ్‌లీ ఇన్ లవ్ విత్ ఆండ్రూ" అంటూ జంకు లేకుండా సమాధానం ఇచ్చింది.

'విదేశీయుడ్ని ఎంపిక చేసుకున్నారేం' అన్న ప్రశ్నకు ఘాటుగా స్పందించిందికూడా.

"నేనతనితో ప్రేమలో పడ్డా. అతను ఏ దేశమని ఆలోచించలేదు. రంగు చూడలేద"ని పేర్కొన్నది. ఎంత ఘాటు ప్రేమయోకదా!

చేశారు వాళ్ళిద్దరూ. కారు గేటులోకి ప్రవేశించగానే కార్తికేయ హృదయ స్పందన హెచ్చింది.

ఎంత వద్దనుకున్నా సుదీపను చూడబోతున్న ఆనందం మనసును పులకింపజేస్తోంది. నేరుగా ముందు కెళ్ళి పోర్టికో ఇవతలే ఓ పక్కకు తీసి కారు ఆపాడు. అప్పటికి పోర్టికో అవతల లాన్‌లో దేనిగురించో డ్రైవరు దీనారామ్‌తో బాగా గొడవపడుతోంది మందాకిని. కారు శబ్దం విని ఇద్దరూ ఒకేసారి ఇటు చూశారు. తెల్లగా హంసలా మెరిసిపోతున్న బెంజ్‌కారు ఇంతకుముందెప్పుడూ చూళ్ళేదు. ఎవరన్నట్టు దీనారామ్‌ని చూసింది మందాకిని.

తెలీదన్నట్టు భుజాలెగరేశాడు దీనారామ్. ఇంతలో కారుదిగి డోర్ మూస్తున్న కార్తికేయను చూసి కరెంట్ షాక్ తిన్నట్టు త్రుళ్ళిపడ్డాడు దీనారామ్.

"ఓరిదేవుడా... ఇతను... ఇతను రావడమేమిటి?" అన్నాడు. "నీకు తెలుసా? ఎవరతను?" అడిగింది మందాకిని ఆశ్చర్యపోతూ.

"సైంటిస్టు" చెప్పాడు.

"ఇంత అందంగా ఉన్నాడు"

"సైంటిస్టు అందంగా ఉండకూడదా?"

"నా ఉద్దేశం అదికాదు. సైంటిస్ట్‌కి ఇక్కడేంపని?"

"అదేగా, శత్రువు కొంపకి ఎవరన్నా వస్తారా?"

"శత్రువా...!"

"ఔనుగదా... అతను ఎవరను కుంటున్నావ్?" అన్నాడు దీనారామ్.

అప్పటికీ మందాకినికి అర్థంకాలేదు.

"చెప్పేది సరిగా చెప్పితగలడు. చూస్తే రాకుమారుడిలా ఉన్నాడు. శత్రువేంటి?" విసుక్కుంది.

"రాకుమారుడే. పర్లాకిమిడి సంస్థానం రాజవంశీకుడు. ఇతని పేరు గుర్తులేదుగాని ఆ రోజు సాదూభాయ్‌వెంట మేమంతా మధ్యప్రదేశ్ అడవుల్లోకెళ్ళింది ఇతన్ని చంపటానికే. ఏం జరిగిందో చెప్పాగదా..."

"ఆగాగు" అంటూ ఉలిక్కిపడి చూసింది మందాకిని. ఆశ్చర్యంతో తలమునకలయిపోయింది. తన సందేహమే నిజమయింది. చిటికెలో విషయం బోధపడింది. అంతే వడివడిగా ముఖ ద్వారాన్ని చేరుకుంది. కారుదిగి మెట్లెక్కబోతున్న కార్తికేయకు అడ్డం నిలబడింది.

చూస్తూవుంటే మతిపోగొడుతున్న సుందరాకారుడు. యువ సైంటిస్టు ఇతడా...

మాఫియా ముఠాలు చంపాలని చూసింది ఇతడినా. సాదూభాయ్ శరీరంలోకి పరకాయ ప్రవేశంచేసి ఈ ఇంట్లో పక్షం దినాలు ఉండిసంచలనం రేపిన మగాడు ఇతడా...

దిమ్మెరపోయి చూస్తోంది. కాని పరిచయం లేనట్టే చూస్తూ దరహాసం చేశాడు కార్తికేయ.

"నువ్వు దారి తప్పుకుంటే నేను లోనకు వెళ్తాను. మేడమ్ సుదీపగార్ని చూడాలి" అన్నాడు.

"నేనే సుదీపను. చూస్తున్నారుగా చెప్పండి. ఎవరు మీరు?" అడిగింది. చూస్తుంటే సుదీప మేడమ్‌కి మాటిచ్చాడుకాబట్టి తనెవరో చెప్పకుండా ముఖం చూపించి వెళ్ళిపోయే ఉద్దేశంతోనే వచ్చినట్టనిపించింది. అతడిచేతే నిజం చెప్పించాలని అలా మాట్లాడింది.

"గోల్డ్‌కి రోల్డ్‌గోల్డ్‌కి కూడా తేడా తెలియనంత అమాయకుడిని కాదు"

"గీటు పెడితేనే కదా గోల్డో కాదో తెలిసేది"

"నీ గోలాపి వెళ్ళి మేడమ్‌ని పిలు"

మందాకినిని పక్కకునెట్టి మెట్లెక్కి హాల్‌లోకి వచ్చేశాడు. వెనకే వచ్చిన డ్రైవరు దీనారామ్ డోర్‌లోకి వచ్చి ఆశ్చర్యంగా చూస్తున్నాడు. అసలు విషయం వాడికి తెలిచదు. "కూర్చోండి. మేడమ్‌తో మీరు ఎవరని చెప్పాలి...?" మెట్లవైపు వెళ్ళబోతూ అడిగింది మందాకిని.

"అయాం కార్తికేయ. పరామర్శించడానికొచ్చాను. సాదూభాయ్ పోయారని తెలిసింది" చెప్పాడు.

ఇంకా ఉంది

ఆలోచిస్తే ఇదే మంచిదనిపించింది సుదీపకు. ముందు తను క్షేమంగా వుంటే వాడ్ని ఏం చేయాలో తర్వాత ఆలోచించవచ్చు.

మందాకిని ఆలోచన నచ్చటంతో క్షణం కూడా ఆలస్యం చేయకుండా మేడమీది తన బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిపోయి డోర్ మూసి లాక్ చేసుకుంది సుదీప.

మందాకిని పనివాళ్ళందర్నీ దగ్గరకుపిలిచి గజేంద్రతోడావస్తే ఏంచేయాలో వివరించి పంపింది. దాంతో ఏమీ జరగనట్టే పనివాళ్ళంతా ఎవరి పనుల్లో వాళ్ళు ధైర్యంగా ఉండిపోయారు.

సరిగ్గా అదే టైమ్‌లో అంటే ఉదయం ఎనిమిది గంటల ముప్ఫయ్ నిముషాలకు కార్తికేయ డ్రయివ్ చేస్తున్న బెంజ్ కారు సుదీప నిలయం ఉన్న వీధిలోకి ఎంటరయింది. తనకి బాగా గుర్తు.

ఆ రోజు రాత్రి గాంధీ ఆస్పత్రి మార్చురీనుంచి తప్పించుకొచ్చాక ఇక్కడే వీధి మొగలోనే రిక్షా దిగి డబ్బులు ఇచ్చి పంపించేసి నడుచుకుంటూ సుదీప నిలయములోకి వెళ్ళాడు. అప్పటికీ ఇప్పటికీ పెద్ద మార్పేమీ లేదు. సుదీప నిలయంలో గూండాలకు బదులు గేటుముందు ఇద్దరు గుర్ఖాలు కాపలాఉన్నారంతే.

గేటులోకి వస్తున్న ఖరీదైన బెంజ్ కారును చూసి వినయంగా సలాం

కమల్‌హాసన్, రజనీకాంత్‌లు ఇద్దరూ స్వార్థప్రయోజనాలకోసం రాజకీయాల్లోకి వచ్చారు. వారికన్నా ఇప్పుడున్న రాజకీయ నేతలే మేలు. -చారుహాసన్, నటుడు



# నేనెవరో తెలుసా!

అమరావతిని నవ్యాంధ్ర రాజధానిగా ఎంచుకున్నతర్వాత జరిగిన శంకుస్థాపన కార్యక్రమం తిలకించినవారికి నాడు మోడీ మట్టి ఇచ్చి వెళ్ళాడా అనే చర్చ తప్పించి, అక్కడ వేసిన శిలాఫలకంమీద తెలుగు లేదన్న విషయం పట్టటంలేదు.

నాలుగేళ్ళుగా ప్రభుత్వ పాఠశాలల్లో ఇంగ్లీషు మాధ్యమమే నడపాలన్న నిర్ణయాలను విజయవంతంగా నడిపిన ప్రభుత్వం హఠాత్తుగా తన ఐదేళ్ళ పాలన చివరి సంవత్సరంలో తెలుగు గురించి గోల పెడుతోంది. షాపులవాళ్ళమీద జరిమానా కొరడా ఝుళిపిస్తామంటుంది కాని పాలనను తెలుగులో నడుపుతామనిమాత్రం అనటంలేదు.

భాష అనేది ఆ ప్రాంతంవారి సంస్కృతిని ప్రతిబింబిస్తుంది. ఆ భాషవారికే ప్రత్యేకమయినవి కొన్ని వుంటాయి. తెలుగులో తప్పించి మరెక్కడా కనిపించని పద్యాలు,అష్టావధానాలు, హరికథలు, బుర్రకథలు వంటివాటిని వదిలేసుకుంటే మన భాషా జాతిని మనమే నిర్వీర్యం చేసుకున్నట్లే కదా. అయినా మన నేతలకు ఆ విషయంగురించిమాత్రం ఏమీ పట్టటంలేదు.

ఇటువంటి నేటి రాజకీయ నాయకులు ఒకనాటి రాజకీయవేత్త ప్రతిజ్ఞను గుర్తుచేసుకోవాలి. ఆయన మంత్రిపదవులు నిర్వహించలేదు. తాను పుట్టిన సీమను దాటి విస్తరించాలని అనుకోలేదు. తన భాష, తన సంస్కృతిగురించి ఆలోచించాడు.

పెద్దల మాటను విని, వారి ప్రసంగాలకు ఉత్తేజితుడై రాజకీయరంగంలో అనేకన్నా ప్రజాసేవా రంగంలోకి వచ్చాడు. ఇప్పటికి వందేళ్ళక్రితమే 'నేను ఇంగ్లీషు పదాలు మాట్లాడకుండా తెలుగులోనే సంభాషణ, ప్రసంగం చేస్తాను' అని ప్రతినబూని చివరి వరకు దానిని నిలబెట్టుకున్నాడు.

సాధారణంగా తాము మాట్లాడే విషయం వేదికమీద పెద్దలున్న ఇతర భాషలవారికి అర్థంకావాలని వారికి వచ్చిన భాషలో మాట్లాడే యత్నం చేస్తుంటారు. తెలుగువారికి ఈ జ్ఞానం బాగా ఎక్కువ.

ఉత్తరాదివారు ఎక్కడికి వచ్చినా హిందీలో మాట్లాడి వెళుతుంటారు. కాని మనంమాత్రం వారికోసం ఇంగ్లీషులో మాట్లాడే తంటాలుపడుతుంటాం.

అది నేటికీ కనిపించే విషయం. అయితే తెలుగులోనే మాట్లాడాలనే ప్రతినబూనిన ఆయన 1937లో నంద్యాలలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర రాజకీయ మహాసభకు అధ్యక్షుడు. సభా ప్రారంభకుడు రాజాజీ. ఆయనకు మంచి వక్తగా పేరుంది.

సభా ప్రారంభకుడిగా రాజాజీ చేసిన ప్రసంగం కన్నా అచ్చ తెలుగులో ఈయన చేసిన ప్రసంగమే మెరుగ్గా, సమగ్రంగా, సముచితంగా వుందంటూ ఇంగ్లీషు పత్రికలు మరుసటిరోజు ప్రశంసించాయి.

మన భాషపట్ల మనకు అభిమానం వుంటే ఇతరులు తప్పకుండా గౌరవిస్తారు అనేదానికి నిదర్శనం ఆయన భాషాభిమానం. దేశ స్వాతంత్ర్య పోరాట సమయంలో తెలుగువారికి ముఖ్య కేంద్రం మచిలీపట్నం. అక్కడ దిగ్గజాలవంటివారుండేవారు.

రాజకీయ, సాహిత్య, పత్రికా, క్రీడారంగాలు అన్నింటికీ అదే కేంద్రం. పత్రికా రంగంలో కృష్ణా పత్రికను నడిపించిన ముట్నూరు కృష్ణారావు, రాజకీయాల్లో భోగరాజు పట్టాభిసీతారామయ్య, సామాజిక రంగములో రఘుపతి వెంకటరత్నం నాయుడువంటివారు వుండేవారు.

ఆ ముగ్గురు ప్రముఖులతో సన్నిహితంగా, వారి ప్రసంగాలు వినితన జీవితాన్ని మలచుకున్న యువకుడు ఆయన. వారు ఉత్తేజపరచగా జీవితాంతం ఖద్దరు ధారణ,అంటరానితనం నిర్మూలనకు కృషిచేశారు. పదహారవ ఏటనే స్వాతంత్ర్య పోరాటంలోకి దూకారు.

బ్రిటీష్‌వారు తమ పరిపాలనను నియంతలుగా సాగిస్తూ, తాము ప్రజాస్వామ్యవాదులమని, బ్రిటన్ తొలి ప్రజాస్వామ్య దేశమని నమ్మించేందుకు అప్పుడప్పుడు ఎన్నికలు నిర్వహిస్తుండేవారు. అటువంటి ఎన్నికలు ఒక నాటకమని కాంగ్రెస్ వర్ణించి, ఆ బూటకపు ఎన్నికలను బహిష్కరించమని పిలుపునిచ్చేది.

1920 ఎన్నికల్లోకూడా అటువంటి పిలుపే ఇచ్చింది. ఎన్నికలు జరిగాయి. డబ్బాల్లో ఓట్లు పడ్డాయి. కాని ఓట్ల లెక్కింపుకు డబ్బాలు తెరిస్తే ఒకే ఒక్క గ్రామం నుండి ఖాళీ డబ్బా వచ్చిందని పాలకులు గుర్తించారు. ఆశ్చర్యం.... ఒక్కటంటే ఒక్క ఓటు పడనీయకుండా ప్రజలందరినీ ఏకతాటిమీద నిలబెట్టిన ఆ గ్రామం పేరు, దానిని అలా నడిపించిన ఆ యువనేత పేరు పత్రికల్లో ప్రత్యేకంగా ఎక్కింది.

అప్పటికి ఆయన వయసు 22, 23 ఏళ్ళుమాత్రమే. ఆయన చేసిన ఆ సాహసం, గ్రామంమీద ఆయనకున్న పట్టు గ్రహించిన నాటి కాంగ్రెస్ పెద్దలు పార్టీ జిల్లా అధ్యక్షుడిని చేశారు. ఉద్దండులతో కూడిన కృష్ణాజిల్లా కాంగ్రెస్ అధ్యక్షపదవి పాతిక సంవత్సరాలు కూడా నిండని కుర్రాడిని ఎన్నుకోవటంతో ఆయనకు మరింత గుర్తింపువచ్చింది.

పదవి అనేది అలంకారం కాదు. సౌకర్యాలు అనుభవించటానికి అంతకన్నా కాదు, తాము నమ్మిన సిద్ధాంతాలు ప్రజలకు వివరించి అనుసరించేలాచెయ్యటానికి. ఆ విధంగా ఆయన జిల్లా బోర్డు అధ్యక్షుడు అవగానే పరిపాలన మొత్తం తెలుగులో జరిపించే యత్నం చేశారు. తనదగ్గర పనిచేసే ఉద్యోగులు, ఉపాధ్యాయులంతా ఖద్దరు ధరించేలా చేశారు.

అంటరానివారుగా సమాజం పిలిచే వర్గాలకు చెందినవారిని ఎంపిక చేసి ఉపాధ్యాయులుగా నియమించారు. అలా ఆ వర్గానికి ఉపాధ్యాయ వృత్తిలో అధికారం కల్పించిన తొలి వ్యక్తి ఆయనే.

సైమన్ కమిషన్ వచ్చినప్పుడు ప్రభుత్వ బడులను మూసివేయించి, ప్రభుత్వ కార్యాలయాలమీద నల్లజెండాలు ఎగురవేయించాడు.

కాంగ్రెస్ అగ్ర నాయకుడు మహాత్మాగాంధీ మొదలుకుని దక్షిణాది నాయకులు ప్రకాశం పంతులు వరకు ప్రతి ఒక్కరి మెప్పు పొందిన ధన్యజీవి ఆయన.

గాంధీజీ మహాసభను తన స్వగ్రామములో నిర్వహించి, నాడు కాంగ్రెస్ కార్యకర్తల క్రమశిక్షణ ఎటువంటిదో నిరూపించి, గాంధీజీని ఆ గ్రామంలో గంటసేపు ఇష్టపడివుండేలా చేసిన నేత ఆయన.

ప్రజలకు మేలు అనుకున్నప్పుడు ఎవరినైనా ధిక్కరించేందుకు ఆయన సిద్ధమే. చల్లపల్లి రాజాకి వ్యతిరేకంగా రైతు ఉద్యమం నిర్వహించారు. స్వాతంత్ర్యానికి ముందు రైతు సంఘాలను సంఘటితం చేశారు. చల్లపల్లి రాజాకు వ్యతిరేకంగా ఎన్నికల్లో నిలబడిన సామాన్యుడు ఆయన.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడినతరువాత తొలి శాసన మండలిలో సభ్యుడయ్యాడు. తాత్కాలిక అధ్యక్షుడిగా వ్యవహరించాడు. బహుశా ఆయన అనుభవించిన అధికారిక పదవి అదొక్కటేనేమో.

**ప్రజలపక్షాన నిలవటంలోనే నా తృప్తి,ఆనందం పదవులతో కాదు అని జీవితాంతం అదే సిద్ధాంతంతో జీవించిన వ్యక్తి ఆయన. ఇంతకీ...**

***1. ఆ నేత పేరేమిటి?***

***2. ఆయన ఆధ్వర్యంలో ఖాళీ ఓట్ల పెట్టెను పంపిన గ్రామం ఏది?***

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇన్‌లాండ్ కవర్‌పై రాసి స్వాతి చిరునామాకు 18 ఆగస్టు 2018 తేదీలోగా పంపించండి. కరెక్టు సమాధానాలు రాసిన వారిలో లాటరీ పద్ధతి ద్వారా ఒకరిని విజేతగాఎంపిక చేసి ₹500/- నగదు బహుమతిని అందజేస్తాం.

3.8.2018 సంచికలో ప్రచురించబడిన
'నేనెవరో తెలుసా!' శీర్షిక సమాధానాలు :
1. గుంటూరు శేషేంద్ర శర్మ, 2. నా దేశం, నా ప్రజలు
**₹500/- బహుమతి పొందిన విజేత :**
ఎమ్.కనకదుర్గాభవాని, ఆముదార్లంక-522 257
కొల్లూరు మండలం
గుంటూరు జిల్లా

'ఆదిత్యాయచ సోమాయ మంగళాయ బుధాయచ. గురుశుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః' స్పష్టంగా, స్వచ్ఛంగా శ్లోకాన్ని చదివి, సూర్యుడికి అర్ఘ్యం ఇచ్చి,భక్తిగా ఓ నమస్కారం చేసుకుని, హాల్లోకి వచ్చి కూర్చున్నాడు రామారావు.

అప్పటికే కాఫీ తాగేసి దినపత్రిక తిరగేస్తూ కూర్చున్నాడు అల్లుడు అరవింద్.

"బాబూ... అరవింద్... అమ్మాయి బహుశా నీతో అనే వుంటుంది. పసివాడు పుట్టిన నక్షత్రం వగైరాలన్నీ బాగానే వున్నాయి. నిన్న శాస్త్రిగారి దగ్గరికి వెళ్ళి వాడి రాశిచక్రం రాయించుకుని వచ్చాను.

బుధుడికి, శుక్రుడికి జపాలు చేయించి శివాభిషేకం చేయించమన్నారు. రేపు బారసాల రోజే ఆ పనికూడా పూర్తిచేసుకుంటే బాగుంటుంది.

సాధారణంగా నక్షత్రం తిరిగివచ్చేలోపు ఈ జపాలూ, అభిషేకాలూ జరిపించటం ఆనవాయితీ" అని భార్య తెచ్చి ఇచ్చిన కాఫీకప్పు అందుకున్నాడు రామారావు.

"శాస్త్రిగారు చెప్పారంటే... ఈ చుట్టుపక్కల ఊళ్ళతో సహా అందరికీ చాలా నమ్మకం బాబూ.

పిల్లల విషయంలో మనం కాస్త శ్రద్ధ తీసుకుంటే మంచిది. ఇలాంటివి మళ్ళీమళ్ళీ జరిపించేవి కూడా కాదు కదా" భర్త మాటలకు వత్తాసుగా పలికిన దమయంతి భర్తవంకా, అల్లుడి వంకా మార్చి మార్చి చూస్తూ, రామారావు కూర్చున్న కుర్చీకి పక్కనే ఓ స్టూలు లాక్కుని కూర్చుంది.

"ఆయనకి అవన్నీ ఇష్టంలేదుట నాన్నా. రాత్రంతా మా ఇద్దరి చర్చా అదే. బారసాల కూడా వద్దట! పేరు కూడా నిర్ణయించేశారు 'పావన మణీధర్' అట. ఇక అందరం వాడ్ని ఆ పేరుతో పిలవటమే తరువాయి. నామకరణం అయిపోయినట్లేట" అభియోగంగా చెప్పిందో, ఆక్రోశం వెళ్ళగక్కిందో తేల్చుకోవటం తేలిక కానివిధంగా తండ్రితో చెప్పింది, పిల్లవాడితో సహా హాల్లోకి వచ్చిన కీర్తన.

అందరి మాటలూ వింటున్న అరవింద్ మౌనం వీడలేదు, దినపత్రిక చూడటం ఆపలేదు, తల ఎత్తి చూడనూ లేదు.

"మేమంతా ఇంతసేపట్నుంచీ మాట్లాడుతుంటే నోరు తెరచి ఒక్కమాటా మాట్లాడరేమింటండీ అంటూ పసివాడ్ని అరవింద్ ఒడిలో వుంచి, తానూ ఓ కుర్చీలో కూర్చుంది కీర్తన-

"నిజం చెప్పాలంటే... నాకు ఈ గ్రహాలూ, అనుగ్రహాలు,ఆగ్రహాలు,వీటిపైనా, వాటికి జపాలు, పూజలు చేసి ప్రసన్నం చేసుకోవటంపైనా నమ్మకం లేదు మామయ్యగారూ. పుట్టిన సమయం దోషమైంది అనటమే కరక్టు కాదని నా అభిప్రాయం.

అన్నికాలాలూ మనకి అనుకూలంగా వుండవు. నిజమే... అందుకే సకాలంలో పనులు పూర్తిచేసుకోవాలి అనేమాట అంటుంటారు.

సకాలం అంటే ఎప్పుడు ఏది చేసుకోవాలో అప్పుడు చేసుకోవటం. సకాలంలో తీసుకువచ్చారు కాబట్టి ప్రాణం నిలబెట్టగలిగాం అని డాక్టర్లు చెబుతుంటారు చూడండి. అవన్నీ యాక్సిడెంటల్‌గా జరుగుతుంటాయి అంతే" అన్నాడు అరవింద్.

"నిజమే బాబూ... ఆ మాటకి వస్తే అసలు మనిషి పుట్టుకే ఓ యాక్సిడెంట్. మనం పుట్టిన సమయాన్ని బట్టి మనకు మాత్రమే ప్రత్యేకంగా సరిపడే కాలాన్ని తెలుసుకోవాలి. అదే ముహూర్తం.

కాలం యొక్క స్వరూపాన్ని తెలుసుకోవటానికి ఋషులు మనకి అందించిన అద్భుత వరం జ్యోతిష్య శాస్త్రం. వారంకన్నా తిథి, తిథి కన్నా నక్షత్రం, నక్షత్రం కన్నా లగ్నం అత్యంత బలీయమైనవి" అని చెప్పి అలా... అంతే" పసిబిడ్డని పరిశీలనగా చూస్తూ అన్నాడు అరవింద్.

"బాగా చెప్పారు.రాసిపెట్టి ఉండటం,రాశి చక్రం... ఈ మాటల ఆవిర్భావమే ఓ గొప్ప విషయం బాగా ఆలోచిస్తే. జ్యోతిషశాస్త్రం మరో పేరు ఆత్మవిద్య. రాహుకేతువులు ఇద్దరూ ఆత్మవిద్య హేతువులు.

కేతువుకు మరొక పేరు శిఖి. రాహువులోని మొదటి అక్షరం 'రా' శిఖిలోని మొదటి అక్షరం 'శి' కలిసి రాశిచక్రం అయింది. దాన్లోనుంచి వాడుకలోకి వచ్చినమాటే ఇప్పుడు మీరు ఉపయోగించిన రాసిపెట్టి వుండటమనే పదప్రయోగం"

"ఏది ఏమైనా మీ లాజిక్కు నాకు నచ్చింది" అని నవ్వాడు అరవింద్.

అతనలా సానుకూలంగా స్పందించటం బోల్డంత సంబరాన్నిచ్చింది కీర్తనకు. 'నాన్నగారితో మాట్లాడితే అంతే' అనుకోకుండా ఉండలేకపోయింది.

అల్లుడు కాస్త మెత్తబడ్డాడని లోలోపల సంతోషపడింది దమయంతి.

"మన దేశంలో చాలా విశ్వవిద్యాలయాలు జ్యోతిష శాస్త్రాన్ని బోధిస్తున్నాయి. ఈ శాస్త్రానికి ప్రభుత్వ గుర్తింపు వున్నది"

"మనం ఆ జోలికి వెళ్ళద్దు మామయ్యగారూ... ప్రభుత్వ కార్యక్రమాలకే ముహూర్తాలు పెట్టించుకుని మరీ ప్రారంభిస్తున్నారు.

కార్యాలయాలకి వాస్తుదోషం అంటూ కోట్లు పెట్టి కట్టిన భవనాన్ని పడగొట్టి మళ్ళీ కడుతున్నారు. మనం వాటిని గురించి ఎంత తక్కువ మాట్లాడుకుంటే అంత మంచిది" మామగారి మాటలకి మధ్యలోనే అంతరాయం కలిగించాడు అవింద్.

"సర్సర్లే ఆ కబుర్లన్నీ మామా అల్లుళ్ళు తర్వాత తీరిగ్గా మాట్లాడుకుందురుగాన్లే గానీ, ముందు బారసాలనాడు చేయాల్సిన జపాల గురించి, హోమాల



అల్లుడి వంక చూశాడు రామారావు.

"విధి బలీయం అంటారుగా మామయ్యగారూ. ఒకే సమయంలో ఒక ఇంట్లో జననం, మరొక ఇంట్లో మరణం ఒకరికి మోదం, ఒకరికి ఖేదం. ఏది ఎప్పుడు, ఎలా జరగాలో, అలా జరిగిపోతుంటుంది. దాన్ని ఆపే శక్తి, అడ్డుకునే శక్తీ ఏదీ లేదని నానమ్మకం.ఎవరికి ఎలా రాసిపెట్టి ఉంటే గురించి ఓ నిర్ణయానికి రండి"

హెచ్చరింపూ,మందలింపూ కలబోసి అనేసింది కీర్తన. "హోమాలా! రాత్రంతా జపాలు,జపాలు అంటూ జపించి తెల్లారేసరికి హోమాలని కలుపుతున్నావ్.. ఏంటద్ధి" కోపం ధ్వనించింది అతని గొంతులో.

"హోమాలంటే మీరేదో పెద్దగా ఊహించుకోనక్కర్లేదు, చాలా క్లుప్తంగా ఉంటుందని చెప్పారు శాస్త్రిగారు. దానివిషయం నాకు వదిలేయండి,నేను చూసుకుంటాను కదా" భరోసాగా అన్నాడు రామారావు.

పెనుమాక నాగేశ్వరరావు



# అచ్చతెలుగమ్మాయిని

'గూఢచారి' వంటి సినిమాతో తన తెలుగు ప్రయాణం మొదలైందని తెలుగమ్మాయి శోభిత ధూళిపాళ ఆదేవనిగా ఆనందపడుతున్నది.

'మాతృభాషలో నటిస్తే ఆ అనుభూతే వేరుగా ఉంటుంది.మిస్ ఇండియా కిరీటం గెలిచినవెంటనే తెలుగులో అవకాశాలు వచ్చాయి. కాని, అప్పట్లో సినిమాలపట్ల ఆసక్తి ఉండేది కాదు.

కొన్నాళ్ళు మోడలింగ్ చేశాను. భరతనాట్యం, కూచిపూడి నృత్యాలు నేర్చుకున్నాను. ఆడిషన్లు ప్రయత్నించాక మొదటి ఆడిషన్‌లోనే 'రమణ్ రాఘవ్'లో ఎంపికయ్యా. సంప్రదాయబద్ధమైన తెలుగు కుటుంబంలో పుట్టి పెరిగిన అమ్మాయిని. అటువంటి నేను గ్లామర్ ప్రపంచంలోకి వస్తుంటే, ఇంట్లోనివారంతా షాకయ్యారు'' అని చెప్పింది.

అంతలోనే సెల్లు ఘొల్లుఘొల్లుమనటంతో దాన్ని అందుకున్నాడు రామారావు.

"అయ్యా... శాస్త్రిగారూ... నమస్కారం. నిజంగా స్పందించటం అంటే అక్షరాలా ఇదే.

మంచి సమయానికి ఫోన్ చేశారు. ఇప్పుడు మా ఇంటికి రాగలరా మహాశయా... అవునా... అయితే ఇంకా ఏం దయచేయండి... దయచేయండి... ఆ... ఆ... అల్లుడుగారు కూడా ఇక్కడే వున్నారు.

రాత్రే వచ్చారు. మేమందరం మీరు చెప్పిన విషయాల గురించే మాట్లాడుకుంటున్నాం... రండి... రండి... అలాగే... అలాగే"అని సెల్ పక్కన పడేశాడు రామారావు. "దమయంతీ శాస్త్రిగారు వస్తున్నారు... కాసిని కాఫీ తయారుచేయి"అన్నాడు రామారావు.

"అబ్బా... కాఫీ ఎంతసేపు డికాషన్, పాలూ రెండూ రెడీగా వున్నాయి. ఆయన్ని రానీయండి. ఆయన మన వీధిలోనే ఆంజనేయస్వామి గుడి వద్ద వున్నారట. ఆకుపూజ చేయించడం పూర్తయ్యిందట. అక్కడి నుంచి బయలుదేరబోతూ నాకు ఫోన్ చేశారు. ఐదు నిముషాలలోపే మనింట్లో వుంటానన్నారు"

"ఆయనతో నేను మాట్లాడేదేమీలేదు మామయ్యగారూ.నన్ను ఆయన ముందు ఏమీ అడగవద్దు. నన్ను ఇబ్బందిపెట్టవద్దు" అంటూ పసిబిడ్డని తీసుకోమని కీర్తనకు సైగచేశాడు అరవింద్. "మిమ్మల్ని ఆయన ఏమీ అడుగరు. ఇబ్బంది పెట్టరు. మీరు కాసేపు ఇక్కడే కూర్చోండి చాలు" ఆజ్ఞాపించినట్లు అన్నది కీర్తన.

"మీరు ఆయన్తో ఏమీ మాట్లాడక్కర్లేదులే బాబూ. ఐనా ఆయన మిమ్మల్ని కూడా ఏమీ మాట్లాడనీయరు. ఆయనే అంతా మాట్లాడేస్తారు. చూస్తారుగా" అని పెద్దగా నవ్వాడు రామారావు.

**నాకు పదిమంది ఎమ్.ఎల్.ఎలు వుండివుంటే వై.కా.పాలాగా అసెంబ్లీ వదిలి పారిపోయేవాడిని కాదు. -పవన్‌కళ్యాణ్, జనసేన నేత**



అంతలోనే గేటు చప్పుడూ,స్కూటర్ చప్పుడూ విని నిశ్శబ్దం అయ్యారు అందరూ. "నమస్కారం రామారావుగారూ, అమ్మా నమస్కారం, అయ్యా అరవింద్ గారూ కులాసనా, అమ్మగారూ నాన్నగారూ ఎలా వున్నారు?

అమ్మా కీర్తనా కాసిని కాఫీ కలుపుకువచ్చావంటే, ఆ గుక్కెడూ నోట్లో పోసేసుకుని, ఇక గుక్క తిప్పుకోకుండానే చెప్పాల్సిన నాలుగు విషయాలూ చెప్పి సెలవు తీసుకుంటానమ్మా. అవతల సత్యనారాయణ వ్రతం ఒకటుంది మరి" ఒకేసారి అందరినీ పలుకరించి, పంకా గాలి బాగా వచ్చేచోట వున్న కుర్చీలో ఉచితాసనులయ్యారు శాస్త్రిగారు.

"ఏంబాబు...ఎప్పుడొచ్చారు?రాత్రేనా...రైలుకా... బస్సుకా...రైలుకే వచ్చి ఉంటార్లే...మీకదేగా. సౌకర్యం... ఉంటారా రెండు రోజులు? ఇప్పుడు ఉద్యోగస్తులు రెండురోజులు సెలవు పెట్టేటట్లున్నారా!

నా చాదస్తంగానీ, వారానికి ఏడు రోజులు, రోజుకు ఇరవై నాలుగు గంటలూ ఉద్యోగమే... చూస్తున్నాంగా... ఉద్యోగం పురుష లక్షణం అనుకునే రోజులు పోయినై. ఉద్యోగం మనిషి లక్షణం అనే రోజుల్లో వున్నాం.

అయ్యా... మిమ్మల్ని ఒక్కళ్ళనే అనటంలేదు... మొత్తం వ్యవస్థే అలా అనస్థపడుతున్నది"

'మామయ్యగారు చెప్పింది నిజమే. ఈయన మనల్ని మాట్లాడనిచ్చేటట్లులేదు. ప్రశ్నా ఆయనదే... సమాధానమూ ఆయనదే. ఇదీ ఒకందుకు మంచిదేలే. నాబోటివారికి మరీ మంచిది.

ఆయన చెప్పేది బాగుంటే వినడం, విసుగనిపిస్తే, వింటున్నట్లు నటించటం.. హాయికదూ' మనసులో అనుకున్నాడు అరవింద్.అంతలోనే కీర్తన కాఫీకప్పు తెచ్చి శాస్త్రిగారికి అందించింది.

"అరవింద్ బాబూ... మీ కొడుకు జాతకచక్రాన్ని నిన్ననే వేయించారు మీ మామగారు. బ్రహ్మాండంగా వుంది. చదువులో చాలా బాగా రాణిస్తాడు మీవాడు. రెండు చేతులా సంపాదిస్తాడు.

గొప్ప ఐశ్వర్యవంతుడు అవుతాడు. వాగ్దాటి బాగా వుంటుంది. కొన్ని వంశానుగతంగా కూడా సంక్రమిస్తాయనుకోండి. వీటన్నింటికీ తోడు బుధుడికి, శుక్రుడికి జపాలు, హోమం చేయించి, శివాభిషేకం చేయిస్తే చాలామంచిది,మంగళప్రదం కూడానూ.అదేచెప్పాను నిన్న మనవాళ్ళందరితోనూ" అసలు విషయానికి అంకురార్పణ పలికారు శాస్త్రిగారు.

"నవధాన్యాలని మీకు తెలిసిందేగా... సూర్యుడికి గోధుమలు, చంద్రుడికి బియ్యం, కుజుడికి కందులు, బుధుడికి పెసలు, కేతువుకి ఉలవలు, గురువుకు శనగలు, శుక్రుడికి బొబ్బర్లు, శనికి నువ్వులు, రాహువుకి మినుములు అధీన ధాన్యాలుగా చెప్పబడినాయి. బుధుడికి, శుక్రుడికి జపాలు చేయిస్తున్నాం కాబట్టి సూర్యచంద్రులకు, కుజదోష నివారణ కోసం కుజుడికి, ఒక్కొక్కరికి అయిదేసి కిలోల చొప్పున గోధుమలు, బియ్యం, కందిపప్పు దానం ఇవ్వండి.

క్లుప్తంగా హోమం, అభిషేకం సరే, అలా చేసుకుంటే అంతా బాగుంటుంది" పంచాంగం పరిశీలిస్తూ చెప్పారు శాస్త్రిగారు.

"ఇవన్నీ మనం తినే పదార్థాలేగదండీ...ఎటూ పదిమందిని పిలిచి భోజనాలు పెట్టటమంటే పైన చెప్పినవన్నీ దానం ఇచ్చినట్లే" ఆగలేక అనేశాడు అరవింద్.

"మీరు చెప్పింది సమంజసంగానే ఉంది. అయితే ఇక్కడో విషయం మనవి చేసుకుంటా... ఏమీ అనుకోకండి... కారానికి సూర్యుడు, లవణానికి చంద్రుడు, చేదుకు కుజుడు, తీపికి గురువు, పులుపుకు శుక్రుడు, షడ్రుచులకు బుధుడు అధిపతులుగా చెపుతున్నది శాస్త్రం. ఇవన్నీ రోజూ మనం తినేవేగా.

అలా అనుకుంటే ఇంకా పదిమందికి పెట్టటం మటుకు ఎందుకు?" అని నవ్వేశారు శాస్త్రిగారు.

"మీరు చెప్పింది నిజమే. ఎందుకంటే ఈ రుచులన్నింటి సమ్మేళనమే మన ఉగాది పండుగ.

రథ సప్తమి సూర్యుడి పండుగ, కృష్ణాష్టమి చంద్రుడి పండుగ అంటారు. అలాగే కుజుడు సంతోష పడాలంటే సత్యనారాయణ వ్రతం చేసు

కోవాలని, వరలక్ష్మీవ్రతంతో శుక్రుడు సంతోష పడతాడనీ, శనిగ్రహ శాంతికోసం నవరాత్రులని, వినాయకచవితి కేతువుకు సంతృప్తి కలిగిస్తుందనీ చెప్తారు పెద్దలు" అన్నాడు రామారావు.

"ఆ పండుగలు అన్నీ ఎటూ చేసుకుంటూనే ఉన్నాంగా ఇంకా ఇవన్నీ ఎందుకు మరి" అసహనంగా అన్నాడు అరవింద్.

"అమ్మమ్మా! ఎంత మాటా! వ్రతం వ్రతమే... ఫలితం ఫలితమే నాయనా... ఐనా పిల్లవాడు పుట్టిన సందర్భంలో బంధుమిత్రులందరితో మీ సంతోషాన్ని పంచుకున్నట్లే, ఆయా గ్రహాల్ని కూడా సంతోషపెట్టి వారి అనుగ్రహానికి పాత్రులు కావటం మన బాధ్యత, శ్రేయోదాయకం. ఆనక మీ ఇష్టం"

కీర్తన చూస్తున్న కోపపు చూపులు పట్టించుకోలేదు అరవింద్. కూతురిని ఏమీ మాట్లాడ వద్దని సైగ చేశాడు రామారావు.



చట్టం తీసుకురాగానే అన్నీ ఆగిపోవు... హత్యల నిరోధానికి చట్టమున్నా హత్యలు జరుగుతూనే వుంటాయి.

-నితీష్‌కుమార్, బీహార్ సి.ఎమ్.

"పూర్వజన్మలో చేసిన శుభ, పాప కర్మలయొక్క ఫలానుభవ కాలాన్ని జ్యోతిషశాస్త్రం సూచిస్తుంది.

దీపం సహాయంతో చీకట్లోని వస్తువుని చూసి నట్లుగా ఈ శాస్త్రసహాయంతో జీవితంలో జరగ బోయే శుభాశుభసంఘటనలనుముందుగా గుర్తించి దానితో మంత్ర, జప, దాన, హోమాల ప్రక్రియల ద్వారా వ్యతిరేక ఫలితాలను నివారించుకోవచ్చు.

కనీసం కనిష్టస్థాయికి తగ్గించుకోవచ్చు అని గ్రంథాలు తెలియజేస్తున్నాయి. ఇది వరాహమిహిరుల సందేశం" చెప్పటం ముగించారు శాస్త్రిగారు.

"సరే... మీరుచెప్పినవి నేను కాదనను. ఎవరి నమ్మకాలు వారివి. నేను తప్పుపట్టను" అని భార్య వంక చూశాడు అరవింద్.

ససేమిరాఅన్న భర్త సరే అనడం కొండంత సంతృప్తినీ, సంతోషాన్ని కలుగజేసింది కీర్తనకు. కూతురి ముఖంలో కనిపించిన సంతోషం చూసి ముసిముసిగా నవ్వుకున్నారు రామారావు దంపతులు.

"ఈ తతంగం అంతా నా ప్రమేయం లేకుండా పూర్తిచేయండి దయచేసి. నన్ను ఇబ్బందిపెట్టవద్దు. అంతే నేను కోరుకునేది.

వీటివల్ల ప్రయోజనం ఏమిటనేది నేను ఆలోచించ దలచుకోలేదు" చెప్పాడు అరవింద్.

"బాబూ జపాలు మీరు చేయరు, అభిషేకం మీరు చేయరు, హోమం మీరు చేసేదికాదు కానీ అక్కడ మీతో ఓ అయిదు నిముషాలు పనివుంటుంది...

ఇక బారసాల అంటారా... పేరుపెట్టటం అదీ ఓ గంట వ్యవహారం. నిండా ముప్పైలేవు ఆ మాత్రం కొడుకు కోసం కూర్చోలేకపోతే ఎట్లాలే బాబూ" చొరవ తీసుకుని అన్న శాస్త్రిగారితో మరింకేమీ మాట్లాడ లేకపోయాడు అరవింద్.

"ఏవండీ ఇదిగో కాఫీ" కీర్తన పిలుపుతో వర్తమానంలోకి వచ్చాడు అరవై ఏళ్ళ అరవింద్.

కాఫీకప్పు అందుకుంటూ "కీర్తనా ఇప్పటిదాకా నా ఆలోచనలు ఎక్కడికి తీసుకెళ్ళాయో తెలుసా?"

"చెప్పండి" అంటూ ఆయన పక్కనే కూర్చుంది కీర్తన. మణీధర్ పుట్టినప్పుడు మీ నాన్నగారు, శాస్త్రి గారు, అత్తయ్యగారూ, నువ్వూ వాడి బాలసారెకు చేయవలసిన జపాలు, హోమాల గురించి చర్చ జరిపామే... అక్కడికి..." అని నవ్వాడు.

"ఇప్పుడు మనవడి బారసాలకు వాడు, కోడలు ఇంత హంగామా చేస్తుంటే ఏం మాట్లాడరే మరి!"

"నిజానికి ఆ రోజు ఆ చర్చ జరిగినతర్వాతే నాదృష్టి కొంచెం ఇటు మళ్ళించుకున్నాను. పుస్తకాలు చదివి కాస్తోకూస్తో తెల్సుకున్నాను. నా మనసెందుకో సూర్యుడి వైపుకు మళ్ళింది. కనిపించే దేవుడు ఒక్క సూర్యుడే అనుకున్నాను. పైగా అన్నింటి కన్నా ముఖ్యమైన ఆరోగ్య ప్రదాత కదా శ్రీ సూర్యనారాయణమూర్తి. అందుకే అప్పటినుంచి సూర్యానుగ్రహంవుంటే అన్నీవున్నట్లే అనుకుని ఆయనకే నమస్కరిస్తున్నాను"

కశ్యపుని కుమారుడు సూర్యుడు. భార్య అదితి. అందుకే ఆయన్ని ఆదిత్యుడు అని కూడా అంటారు. సప్త అశ్వాలతో వున్న రథం ఆయన వాహనం. ఆ ఏడుగుర్రాలు మనిషిలో వుండేమూలాధారం, స్వాధిస్టానం,మణిపూరకం,

అనాహతం, విశుద్ధ, ఆజ్ఞాచక్రం, సహస్రారమ్ అనే ఏడు చక్రాలకి ప్రతీకలు.

సింహరాశికి అధిష్టాన దేవుడు సూర్యుడు.

నవగ్రహాలలో మధ్యస్థానం ఆదిత్యుడిది. అధిదేవత అగ్ని. ప్రత్యధిదేవత రుద్రుడు. ఎరుపువర్ణంలో వుంటాడు. ఇష్టమైన ధాన్యం గోధుమలు, పువ్వు తామర, రంగు ఎరుపు. జాతిరాయి కెంపు.

"అంతేకాదు, ఆ గ్రహాల అనుగ్రహంకోసం, అవి అడ్డంపడకుండానూ, ఆగ్రహించకుండా ఉండేందుకేగా వీళ్ళు ఇన్నిన్ని చేస్తున్నారు, మనం వుంటున్నది భూగోళం. ఆ గ్రహాలది ఖగోళం.

ఎందుకొచ్చిన గందరగోళం.

మనమూ భూగోళంలో గ్రహాలమే.మనం మాత్రం వాళ్ళు చేసే పనులకి ఎందుకు అడ్డంపడాలి.

"చివరగా ఒక్కమాట చెప్తాను చూడు. పిల్లలు ఆనందం కోసమే ఆటలాడతారు. ఆటలు వ్యాయామమని, ఆరోగ్యమనీ వాళ్ళకి తెలియదు.

ఆనందమే వారి పరమావధి. తెలిసినా, తెలియకపోయినా ఆట వ్యాయామమే అవుతుంది. ఆరోగ్యం చేకూరుతుంది. అలాగే అర్థం అయినా కాకపోయినా సత్కర్మ సత్ఫలితాన్నే ఇస్తుంది. ఇది సృష్టి నియమం. అంతే"

"అరవింద్‌లో ఎంత మార్పు...!" మనసులోనే ఆశ్చర్యపోయింది కీర్తన.

కొడుకు కోడలితోపాటు మనుమడిని కూడా మనసారా దీవించారు అరవింద్ దంపతులు.

జపాకుసుమ సంకాశం, కాశ్యపేయం
మహాద్యుతిమ్
తమోరిం సర్వపాపఘ్నం, ప్రణతోస్మి
దివాకరం

మనసులోనే సూర్యుడ్ని స్తుతించుకున్నాడు, స్మరించుకున్నాడు అరవింద్.



## ప్లస్ అయితేనే...

తెలుగు, కన్నడ సినిమాలతో బిజీబిజీగా వున్న రష్మికామండన్నాను పాత్రల ఎంపిక గురించి కదిలిస్తే, కబుర్లపోగు అయిపోయింది.

"చేసేపాత్ర సినిమాకు ఎంతోకొంత ప్లస్ అవ్వాలి. నటనకు ఆస్కారం వుండితీరాలి. కేవలం పాటలు, డ్యాన్స్‌లకు పరిమితం కాలేను.

డబ్బు కోసమే నటించలేను. అలా అని నా పాత్ర చుట్టూనే సినిమా తిరగాలని అనుకోలేను.

నా పాత్రకు ప్రాధాన్యం వుంటే చాలు" అంటున్న రష్మికామండన్నా 'గీత గోవిందం'లో సందడి చేయడానికి సిద్ధంగా వుంది.

# Whats App

పూర్వం మోపిదేవి గ్రామంలో ఒక పెద్ద పాము పుట్టపెట్టుకొని వుండేది.

అది తన పుట్ట దగ్గరకు వచ్చినవారిని, తనకేమీ కీడు చేయకపోయినా, కాటు వేస్తుండేది. కొంత కాలానికి ఆ ఊరికి ఒక స్వామీజీ వచ్చారు.

గ్రామస్తులు ఈ సమస్య వారితో మొరపెట్టుకున్నారు.స్వామీజీ "ఇకనుండి నీవు ఎవరినీ కాటు వేయరాదు" అని సర్పాన్ని ఆదేశించారు.

పాము స్వామీజీ ఆదేశాన్ని పాటించసాగింది. స్వామీజీ తిరిగి ఓ సంవత్సరం తరువాత, మళ్ళీ ఆ గ్రామంమీదుగా తీర్థయాత్రకు వెళుతున్నారు. దారిలో పాముపుట్ట కన్పించింది.పాముపుట్టపక్కనే ఒంటినిండా గాయాలతో నీరసంగా పడివుంది.

స్వామీజీ : "ఓ సర్పరాజమా! నీవు ఈ స్థితిలో ఎందుకున్నావు?"

పాము : మీ ఆదేశానుసారం ఎవరినీ కరవటంలేదు. దాంతో ఆకతాయి పిల్లలు, పెద్దలు నాపై రాళ్ళు విసరటం మొదలుపెట్టారు.

మీ మాటకు కట్టుబడి, ఈ బాధలు భరిస్తున్నాను. తమరే మార్గం చూపించాలి.

స్వామీజీ : నిన్నుకరవద్దు అన్నానేకానీ, బుసకొట్ట వద్దు అనలేదు కదా. ప్రతీ జీవి తన ఆత్మరక్షణకు చేసే పనులు తప్పుకావు. అతి మంచిగా వుంటే లోకం ఏడిపిస్తుంది.

మనం ఎల్లప్పుడూ 'ఆత్మరక్షణ' చేసుకోవాలి. అనవసరంగా ఇతరులను హింసించకూడదంతే. ఇకనుంచి ఎవరయినా నిన్ను ఏడిపిస్తే బుసకొట్టి భయపెట్టు. దుష్టనిగ్రహం తప్పులేదు.

నీతి : అనవసరంగా ఎదుటివారిపై దాడిచేయ కూడదు. అలా అని ఆత్మరక్షణ చేసుకోకపోవటం అనేది మహాపాపం.

*

* వేదవ్యాస మహర్షి కుమారుడు శుకుడు, జనకుడు గొప్ప వేదాంతి అని విన్నాడు. నమ్మబుద్ధి కాలేదు. స్వయంగా చూసి, పరీక్షించాలని మిధిలకు వెళ్ళాడు. శుకుడు నగరానికి చేరే సమయానికి, రాజు అత్యవసరమైన పనిబడి వేరేచోటికి వెళ్ళాడు. రాజు లేడుకాబట్టి, శుకుడు కోటలోకి అడుగుపెట్టలేదు. ఆ రాత్రి కోటబయటే నిద్రపోయాడు. తెలతెలవారుతుండగా రాజవీధిని స్త్రీ పరిచారికలు శుభ్రం చేస్తున్నారు.

శుకుని చూసి వారిలో వారిలా మాట్లాడుకోసాగారు. "ఈయనెవరో! సుఖాభిలాష బాగా వుంది. తల క్రింద చేయిపెట్టుకుని పడుకున్నాడు"

అది చెవినబడి శుకుడు వెంటనే తలక్రింద చేయి తీసివేశాడు. అది చూచి మరో స్త్రీ "అబ్బో అభిమానం కూడా వుందే" అంది.

దాంతో శుకునికి జ్ఞానోదయమైంది. రాజ్యంలోని పనివారలకే ఇంత వేదాంతం తెలిస్తే జనకుడు మహాజ్ఞానే అవుతాడు. మహా వేదాంతి కూడా ఆయన అని అర్ధంచేసుకొని తిరిగి స్వస్థానానికి చేరాడు. మనిషిలో శరీర సుఖాలపట్ల ఆసక్తి, పొగడ్తలకు




పొంగిపోవటం, తిట్లకు కృంగిపోవటం వున్నంత కాలం సరైన ఆధ్యాత్మిక జ్ఞానం పొందలేడు.

*

* టర్కీ దేశానికి చెందిన 'రూమీ' అనే గొప్పవేదాంతి, కవి చెప్పిన కొన్ని జీవితసత్యాలు.

1. మన అవసరానికంటే, ఎక్కువగా వున్న ప్రతిదీ విషంతో సమానం.అది అధికారం,సంపద, ఆకలి, అహంకారం, లోభం, బద్ధకం, కామం, లక్ష్యం, ఇష్టాయిష్టాలు ఏమైనా సరే.

2. అనుకోనిది, అడ్డుపడుతుంది అన్న భావనే భయం. 'ఏదైనా జరగవచ్చు' అని ఎప్పుడయితే ఒప్పుకుంటామో, అప్పుడు సాహసం మనలో మేల్కొంటుంది.

3. ఎదుటివారిలోని మంచిని గుర్తించలేకపోవటమే శత్రుత్వానికి కారణం. వారిలోని మంచిని గ్రహిస్తే వారినుంచి స్ఫూర్తిని పొందగలుగుతాము.

4. మన అధీనంలో లేని విషయాలను ఒప్పుకోలేకపోవటమే కోపం. వాటిని అంగీకరించగలిగితే, మనలో ఓర్పు అంకురిస్తుంది.

5. ఇతరులను ఉన్నవారు ఉన్నట్లుగా ఒప్పుకోలేకపోవటమే ద్వేషం. ఏ విధమయిన నియమాలు, నిబంధనలు లేకుండా, ఎదుటివారిని యధాస్థితిలో అంగీకరించగలిగితే ప్రేమ అవుతుంది.

*

* మనం లోకంలోని వస్తువులు, మనుషులు, రూపాలమీద ఎంత మోహం పెంచుకున్నామంటే అవి మనకు కనిపించటానికి కారణమయిన "వెలుగు"ను పూర్తిగా విస్మరించాం.

అంటే లోకంలోని విషయాలపట్లమనకున్న ఆసక్తి, ఈ లోకాన్ని సృష్టించిన భగవంతునిపై లేదు.

*

* ఆయుర్విత్తం, గృహచ్ఛిద్రం,
మంత్రమౌషధ సేవనం।
దాన మానావమానా న్యష్టాగోప్యాని కథంచన॥

ఆయువు, ధనము, ఇంటిలో గొడవలు, మంత్రం, ఔషధసేవనం, దానం, కీర్తి, అవమానం అనే ఈ ఎనిమిది విషయాలను మనిషి రహస్యంగా ఉంచుకోవాలి.

* ఒక మహాత్ముడు దుర్గా అమ్మవారి దర్శనంకోసం విజయవాడ వచ్చాడు. నదిలో స్నానం చేసి రెండు మెట్లు పైకెక్కగానే ఓ భ్రష్టుడు ఆయనపై తుపుక్కున ఉమ్మివేశాడు. ఆయన మౌనంగా తిరిగి నదిలో దిగి స్నానం చేశాడు.

అమ్మ దర్శనంకోసం బయలుదేరాడు. మళ్ళీ కాండ్రించి ఉమ్మివేశాడు ఇందాకటి క్రూరుడు. స్వామి మళ్ళీ స్నానానికి నదిలో దిగారు. ఆయన మొహంలో రవ్వంతైనా చికాకు లేదు.

ఇలా ఇరవైసార్లు పైగా జరిగింది. మహాత్ముడు ఒక్క మాటా అనలేదు. కనీసం కోపచ్ఛాయలు కూడా కనపడలేదు.

దాంతో భ్రష్టునికి తన తప్పు తెలిసింది. స్వామీజీని క్షమించమని వేడుకున్నాడు.

వారు అంత ఓర్పుగా ఎలా వున్నారని వినయంగా ప్రశ్నించాడు.

అప్పుడు ఆ మహాత్ముడు ఇలా బదులిచ్చాడు. "నాయనా! ఈ రోజు నీవల్ల నాకు, కృష్ణలో 21 సార్లు స్నానం చేసే అదృష్టం లభించింది. నీవు లేకపోతే ఒక్కసారే స్నానం చేసి, అమ్మ దర్శనం చేసుకొని వెళ్ళిపోయేవాడిని. నీవల్లే నాకు మరింత పుణ్యం లభించింది"

నీతి : ఓర్పుతో ఎంతటి క్రూరునిలో అయినా మార్పు తీసుకురావచ్చును. 'ఏది జరిగినా మన మంచికే' అని భావిస్తే, ఎంతటి కష్టాన్నయినా, అవమానాన్నయినా ఓర్చుకోవచ్చు. ◆

# మరీ ఎక్కువగా ఆలోచించకండి

'అయ్యో అలా జరిగిందే, ఇలా జరిగితే బావుండేది' అనుకుంటూ రకరకాల ఆలోచనలతో రోజంతా గడిపేసి, బాధపడి, ఒత్తిడి పడే సందర్భాలు దాదాపు అందరికీ ఎదురవుతుంటాయి.

జరిగిన, పోయిన వాటి గురించి పదేపదే వేధించే ఆలోచనలు నిర్మాణాత్మకం కావు.

ఇటువంటి ఆలోచనలతో సతమతం కావడం మినహా, ఎటువంటి చర్యనూ తీసుకోలేరు. పైగా, వర్తమానానికి అవి భంగం కలిగిస్తాయి.

వర్తమానాన్ని విస్మరించి, ఊహాజనిత భవిష్యత్ వైపుకూ, గతం తవ్వకాలకు దారితీస్తాయి.

వీటివల్ల ప్రయోజనం లేకపోగా అనవసర మనస్తాపానికి కారణం అవుతాయి. ఈ అతి ఆలోచనలకు తప్పనిసరిగా స్వస్తి చెప్పాల్సిన అవసరం ఉంది.

## వర్తమానం

అతి ఆలోచనలు విలువైన వర్తమానాన్ని, సమయాన్ని హరించివేస్తాయి. గతించిన ప్రతికూల పరిస్థితులను లేదా ప్రతికూల భవిష్యత్‌ను ఆలోచనల్లో నింపుకోవడంవల్ల వర్తమానాల్ని మర్చిపోతారు.

నిజానికి ఫలవంతం చేసుకోవాల్సింది, సంతృప్తిని వెతుక్కోవాల్సింది వర్తమానాన్నే.

## అనుత్పాదక ఆలోచనలు

జీవితంలోని చెడు నిర్ణయాలనుంచి, చేదు సంఘటనలదాకా ప్రతికూల ఆలోచనల్లో మునిగిపోవడం వల్ల అవి అనుత్పాదకం అవుతాయి.

జరిగిపోయినవాటిని పదేపదే తలుచుకోవడంవల్ల, భవిష్యత్ గురించిన అనవసర ఆలోచనలవల్ల, ఆందోళనవల్ల ప్రయోజనం వుండదు. మనస్సులో అనవసర బొమ్మలు పాతుకుపోయి, వర్తమానాన్ని మనస్ఫూర్తిగా అనుభవించనీయవు. సున్నా ఉత్పాదక ఆలోచనల్ని కొనసాగించడం అవసరమా?

## అవకాశాలు

ఎదురైన దురదృష్టాల గురించి, అనుభవాల గురించి పదేపదే తర్కించుకుంటూ, వాటినే తలపోస్తూవుంటే, సమీపంలోని అవకాశాలు చాలా జారిపోతాయి. ఎందుకంటే ఓ బలహీనత, ఓ దురదృష్టం గొప్ప అవకాశాన్ని ఇస్తుందని, ఇవ్వగలదని, ఇచ్చిందని గ్రహించలేకపోతారు. పక్కనే ఉన్న అవకాశాన్ని అనవసర ఆలోచనలు మింగేస్తుంటాయి.

## డిప్రెషన్

అతి ఆలోచనలు మానసిక కుంగుబాటుకు దారితీస్తాయి. ప్రతికూల ఆలోచనలు, దుఃఖం ఆందోళనలు, అవమానం, ఆగ్రహం అన్నీకూడా ప్రశాంత మనస్సుకు భంగం కలిగించి, సామర్థ్యాన్ని హరించివేస్తాయి.

## వెలుగు చూడలేదు

అతిగా ఆలోచిస్తుంటే అవకాశాలు నిరాశాజనకమైన ఆ దృక్పథాన్ని పురిగొల్పుతాయి.

జీవితంపట్ల ఉదాసీనత పెంచుతాయి. ఎవరైనా మంచిని సూచిస్తే, అది వర్కవుట్ కాదంటూ తిరస్కరించే నైజం అలవడుతుంది కానీ, ఏదైనా ప్రయత్నించినా, విజయంకంటే వైఫల్యాల అవకాశాలు ఎక్కువనుకునే దిశగా ఆలోచనలు, ఊహలు కదులుతుంటాయి.

తప్పులనేవి జీవితంలోభాగం. భవిష్యత్ అనేది ఎప్పుడూ అనూహ్యమే. కనపడదు. మనం చేయాల్సిందల్లా ఆశావహదృక్పథంతో ముందుకుసాగడం. కదిలే దారి ఒకవేళ మంచిది కాకపోయినా, అది ఓ పాఠాన్ని నేర్పుతుంది.

ఆ పాఠం భవిష్యత్‌లో సాయపడుతుంది.అంతేకాని, అతి ఆలోచనలతో, ఏ చర్యలూ చేపట్టకుండావుంటే జీవనగమనం అర్థరహితం అయిపోతుంది.



Courtesy : STAYFIT

# పరదేశీ ప్రేమకథ

సీరియల్

"ఓ అలాగా! ఆమె కూడా ఇక్కడ చదువుకున్నారా?" ఆశ్చర్యంగా అడిగింది శర్మిష్ఠ. "లేదు. ఆమెకు టాగోర్ రచనలు చాలా ఇష్టం. బెంగాలీ సాహిత్యం బాగా చదివింది. శాంతినికేతన్‌లో చదవాలని కోరుకుంది కాని వీలుపడలేదు" అన్నాడు ప్రఫుల్.

"ఫరవాలేదు. ఇప్పుడు ఏం మించిపోయిందని. ఇక్కడకు చదువుకోవడానికి ఏ వయసులో అయినా రావచ్చు. సర్టిఫికెట్ చదువులకంటే అసలైన చదువు వస్తుంది ఇక్కడ" అంది శర్మిష్ఠ ప్రోత్సాహకరంగా.

## గొర్లి శ్రీనివాసరావు

"నాకూ అలానే వినిపిస్తోంది. ఇక్కడ ప్రొఫెసర్లు తమ వృత్తిపట్ల ఎంతో అంకితభావంతో ఉంటారు. వాళ్ళ ఉత్సాహం చూస్తుంటే విద్యార్థులకు కూడా నేర్చుకోవడంపైన చాలా ఆసక్తి కలుగుతుంది" అన్నాడు ప్రఫుల్.

"రబీంద్రనాథ్‌కి మామూలు స్కూల్స్ అంటే అంత ఇష్టముండేది కాదు. సహజ వాతావరణంలో, గురుకులవాసం చేస్తూ విద్యనభ్యసించాలని ఆయన కోరిక. యాక్చువల్‌గా ఆయన స్కూల్ డ్రాప్ అవుట్. నాలుగు గోడలమధ్య విద్యార్థిని ఉంచేసే నిర్బంధ విద్యకి కట్టుబడివుండడానికి నిరంతర స్వేచ్ఛాపిపాసి అయిన ఆయనకు నచ్చలేదు.

ఈ శాంతినికేతన్ విద్యావిధానాన్ని స్థాపించడానికి ఆయన తాత్వికత దోహదపడింది" అంది శర్మిష్ఠ.

"ఆయన స్కూల్ డ్రాప్ అవుట్ అంటే వారి తండ్రి అయిన మహర్షి దేవేంద్రనాథ్ దగ్గర ఆయనకు ఎంత స్వేచ్ఛ లభించివుంటుందో అర్థమవుతోంది.

అలాంటి తండ్రి పెంపకంలో టాగోర్ వ్యక్తిత్వం విశ్వమానవుడిగా ఆయనను నిలబెట్టాయి అనుకుంటున్నా. ఇప్పటి తల్లిదండ్రులు ఎంతమంది తమ పిల్లలకు ఇలాంటి స్వేచ్ఛ ఇవ్వగలరు" అన్నాడు ప్రఫుల్.

ప్రఫుల్ బెంగాలీ కాకపోయినా తనకు టాగోర్‌పై ఉన్న అభిమానంతో సమానంగా అతనికి కూడా టాగోర్‌పైన ఇష్టం ఉండటం చూసి శర్మిష్ఠకు అతనిపై ఇంప్రెషన్ ఇంకా బాగా పెరిగిపోయింది.

"నిజమే! అదిసరేగాని ఈరోజు మీ ప్రోగ్రామ్ ఏమిటి?" అంది. "ప్రత్యేకంగా ఏమీ లేదు. పిజి అకామిడేషన్ గురించి ప్రయత్నిస్తాను" అన్నాడు.

"ఓకె. నేను కాల్ చేసి నాకు ఏమైనా సమాచారం దొరికితే చెప్తాను" అంది శర్మిష్ఠ.

మాటిమాటికి టైమ్ చూసుకుంటున్న శర్మిష్ఠను చూసి ఆమె క్లాసుకి లేటవుతున్నట్లుంది అని అనుమానించాడు ప్రఫుల్.

బహుశా తనతో చెప్పడానికి మొహమాటపడుతూ



### జరిగిన కథ 5

కళాభవన్ గొప్పతనం గురించి స్టూడెంట్స్ అందరికీ వివరిస్తాడు బెనర్జీ.

శర్మిష్ఠ ఎవరి ప్రేమలోనైనా పడిందేమోనని తన మిత్రులవద్ద మథనపడతాడు బిప్లవ్.

శర్మిష్ఠతో క్లోజ్‌గా ఉంటున్న యువకుడిపేరు కనుక్కొని చెబితే బిప్లవ్ గిఫ్ట్ ఇస్తాడని తన చెల్లెలు రీతూకు ఆశ కల్పిస్తాడు సాబిక్. వివరం కనుక్కున్న రీతూ అతని పేరు ప్రఫుల్ అని చెబుతుంది. ఆర్ట్స్ బ్లాక్ ఎక్కడుందో చెప్పమని బిప్లవ్ అతని ఫ్రెండ్స్‌ను వచ్చి అడుగుతాడు ప్రఫుల్. తాము వెదుకుతున్నది అతనేనన్న విషయం వారికి తెలియదు.

ఆ బ్లాక్ ఎక్కడో చెబుతారు. శర్మిష్ఠ ప్రఫుల్ మీద మనసు పారేసుకుందని ఆమెను ఆటపట్టిస్తారు రీతూ, సోహిణి.

శర్మిష్ఠను కలసి ఆమెకు తన ప్రేమను తెలియచేయబోతాడు బిప్లవ్. కానీ ఆమె అతనికి ఆ అవకాశం ఇవ్వదు. ప్రఫుల్ శర్మిష్ఠ ఇద్దరూ కాలేజీలో కలసి భావావేశానికి లోనవుతారు.

ప్రఫుల్ ఫోన్‌నెంబర్ తీసుకుని తన ఫోన్‌లో ఫీడ్ చేసుకుంటుంది శర్మిష్ఠ. అలాగే ప్రఫుల్ కూడా శర్మిష్ఠనెంబర్‌ని తన ఫోన్‌లో ఫీడ్ చేసుకుంటాడు. ఇక జరిగేది చదవండి.

ఉందేమో అనుకుని, "ఓకే, మళ్ళీ కలుద్దాం. ఈవినింగ్ కాల్ చేస్తాను" అన్నాడు ప్రఫుల్.

అతన్ని అప్పుడే వెళ్ళనివ్వొద్దని మారాం చేస్తున్న మనసుని బలవంతంగా అదుపు చేసుకుని, ఒక క్షణం కళ్ళు మూసుకుని తెరిచి "సరే. ఫ్రీ అయ్యాక కాల్ చేస్తాను" అంది శర్మిష్ఠ.

"అలాగే" అంటూ చేతిని పైకెత్తి బై చెప్పి వెళ్ళిపోయాడు ప్రఫుల్. అతను వెళ్ళినవైపే చూస్తూ ఉండిపోయింది కాసేపు. తర్వాత వాచ్ చూసుకుని క్లాస్‌వైపు పరిగెత్తింది. కొద్దిదూరం నడిచాక వెనక్కి ఒకసారి చూసిన ప్రఫుల్‌కి పరిగెడుతున్న శర్మిష్ఠ కనిపించి నవ్వుకున్నాడు.బిప్లవ్ శర్మిష్ఠతో మాట్లాడి ఉత్సాహంగా నవ్వుతూవస్తుంటే అతని ఫ్రెండ్స్ గ్యాంగ్ చూసి ఆనందించారు. అంతా బాగానే ఉన్నట్లుంది, అందుకే బిప్లవ్ హ్యాపీ అనుకున్నారు. అతను హ్యాపీగా ఉంటే తాము కూడా హ్యాపీ అనుకున్నారు. "ఏమైంది" అని అడిగారు తమ దగ్గరికి వచ్చిన బిప్లవ్‌తో.

"ఆమె ఓకె. మునుపటిలాగానే ఉంది. రేపు బయటికి వెళ్దాం అంది" అన్నాడు బిప్లవ్.

"మంచి న్యూస్ దాదా. లెటజ్ సెలబ్రేట్. సాయంత్రం పార్టీ ఇవ్వు" అన్నాడు సాబిక్.

"సరేగాని, మీ చెల్లి దగ్గర మంచి పిక్ వచ్చిందా?" అని ఆసక్తిగా అడిగాడు బిప్లవ్.

"లేదు. ఇందాక చూశాను వేరే ఫ్రెండ్‌తో కలిసి ఎవరితోనో మాట్లాడుతోంది. ఈవినింగ్ లోపల ఫోన్ చేస్తుందిలే. ఈలోగా మనం ఆమెకి ఇవ్వాల్సిన గిఫ్ట్ సంగతి చూస్తే మంచిది" అన్నాడు సాబిక్.

"పద అయితే. షాపింగ్‌కి వెళ్దాం" అన్నాడు బిప్లవ్. తక్కిన ఫ్రెండ్స్‌ని విడిచిపెట్టి వాళ్ళిద్దరూ బైక్ ఎక్కి షాపింగ్ చేయడానికి వెళ్ళారు.

ప్రఫుల్‌కి మనసంతా ఆనందంగా ఉంది. గాల్లో తేలుతున్నట్లు ఉండటం అంటే ఏమిటో అవగాహనకి వచ్చింది. మధ్యాహ్నం లంచ్ చేయకపోయినా అతనికి





## నేనే కర్త, కర్మ, క్రియ

'సౌఖ్యం'లో నిజంగా సౌందర్య లహరే అయిన పూజాహెగ్డేకు భక్తిభావం ఎక్కువ అట. "నేను దేవుడిని, అదృష్టాన్ని నమ్ముతాను.

జీవితంలో ఏదైనా ఆటుపోట్లు ఎదురైతే ఎవరికైనా బయటపడడానికి కొంత సమయం పడుతుంది. జరిగిపోయిన విషయాలు ఆలోచించి లాభం వుండదు. నా వరకు నేను భవిష్యత్‌లో ఏం చేయాలనే విషయంమీదే దృష్టిపెడతాను తప్ప గతాన్ని తవ్వుకుంటూ కూర్చోలేను.

నా వెనుక అండదండలేవీ లేవు. నా కెరీర్‌కు కర్త, కర్మ, క్రియ అన్నీ నేనే" అని చెప్పింది.

ఆకలి అనిపించలేదు. క్లాస్‌కి వెళ్ళేసరికి దీపాంకర్ బసు క్లాస్ తీసుకుంటున్నాడు.

ఆయన చిత్రకారుడికి స్వయంగా ఒక ప్రత్యేకమైన స్టైల్ ఉండడం గురించి వివరిస్తున్నాడు.

లేటుగా వచ్చిన ప్రఫుల్‌వైపు అభావంగా చూసిలోపలికి రమ్మని సైగచేశాడు. అతను లోపలికి నడిచిసీట్లో కూర్చునేలోపే తన లెక్చర్ కంటిన్యూ చేశాడు. "సో మనం ఇంతవరకూ చెప్పుకున్నట్లుగా చిత్రకళ చిత్రకారుడు లేదా చిత్రకారిణికి చెందినంతవరకు ఒక అభివ్యక్తీకరణ! సాహిత్యంలో సంగీతంలో కూడా అభివ్యక్తీకరణ ఉంటుంది. అయితే ఒక రచయిత కొన్ని పేజీల్లో చెప్పినదాన్ని చిత్రకారుడు ఒకచిత్రంతో చెప్పగలడు. ఆ చిత్రం దేన్ని అభివ్యక్తీకరణ చేస్తుంది అనేది ఒక ఎత్తు.

అలాగే, ఎలా వ్యక్తీకరిస్తోంది అన్నది మరో ఎత్తు. ఇవి ప్రతి ఆర్టిస్ట్‌కి వేరే వేరేగా ఉంటాయి. దాన్నే క్రిటిక్స్ స్టైల్ అంటారు.

ఎవరు ఏమని పిలిచినా అది మీ అభివ్యక్తీకరణ అన్నది మాత్రం మీరు మరిచిపోకూడదు.

ఆకలివేస్తే ఎలా ఉంటావు, ఎలా మాట్లాడుతావు, ఎలా చూస్తావు, ఎలా నుంచుంటావు. అలాగే కోపం వస్తే నీ కళ్ళుఎలా ఉంటాయి, కనుబొమ్మలు ఎలాఉంటాయి,నీ భుజాలు ఎలా వంగుతాయి.

ఇవిమాత్రమేకాక ఏ రంగుల కాంబినేషన్‌తో నీ భావాలను ప్రతిఫలింపచేయాలనుకుంటున్నావు.

ఏ రంగులు నీ మనసులోని భావాన్ని సరిగ్గా ఆవిష్కరిస్తాయి. ఇవన్నీ చేరి ఒక చిత్రకారుడి అభివ్యక్తీకరణను ప్రభావితం చేస్తాయి. నిజానికి కొత్తగా నేర్చుకునేటప్పుడు చెయ్యాలి. కాని ఎటువంటి నిర్బంధం లేనివిధంగా అభివ్యక్తీకరణ చేయడానికి సాధన కావాలి.

అంతెందుకు ఒక్కమాటలో చెప్పాలంటే మీరు తపస్వులు కావాలి! టాగోర్ చెప్పిన స్వేచ్ఛా ప్రపంచంలోకి తలఎత్తుకుని పొగరుగా ప్రవేశించండి. మిమ్మల్ని ఇప్పటివరకు మీరు అనేక నిర్వచనాలతో బంధించుకున్నారు.

నేను ఇలాగా, నేను అలాగా, నేను ఇది చేయగలను, నేను ఇది చేయలేను, నాకు ఇది ఇష్టం, నాకు ఇది అయిష్టం, ఇది సమాజం మెచ్చుతుంది, ఇది సమాజం వెక్కిరిస్తుంది అంటూ ఎన్నెన్నో సంకెళ్ళు మీకు మీరే వేసుకున్నారు.

వాటిని పగలగొట్టుకుని బయటికి రావాలి. గుడ్డు పెంకులను పగలగొట్టి పిట్ట ఎలా బయటకు వస్తుందో అలా రావాలి. మీ రెక్కలు విప్పి అనంతాకాశంలో ఎత్తుగా ఎగరాలి" అంటూ ప్రసంగించాడు బసు.

ఆయన వాగ్ధాటికి చెవులేకాక శరీరంలోకి ప్రతి కణం స్ఫూర్తిమంతం కావడంతో ఆయన ప్రసంగంలో లీనమయిపోయారు నవ చిత్రకారులు అందరూ. దాదాపు గంట తర్వాత ఆ క్లాస్ ముగిసింది. అసలు టైమ్ ఎలా గడిచిందో కూడా ఎవరికీ తెలియలేదు. తర్వాత వాళ్ళకి క్లాస్ లేదు. లైబ్రరీకి వెళ్ళొచ్చు, లేదా స్టూడియోలోకి వెళ్ళొచ్చు.

ప్రఫుల్ స్టూడియోలోకి వెళ్ళాడు. కొంతమంది అమ్మాయిలు గుంపుగా నిలబడి ఒక చిత్రాన్ని పరిశీలిస్తూ వారి మనసులోని స్పందనలను చిన్నచిన్న మాటల్లో చెప్పుకుంటున్నారు.

వాళ్ళ మాటలు మృదుమధురంగా ఉన్నాయి. వాళ్ళందరూ ఈశాన్య రాష్ట్రాలకు చెందినవాళ్ళుగా అనిపించారు ప్రఫుల్ కంటికి.

వాళ్ళ నడకలో, మాటల్లో ఒక రిథమ్ చూసి కొండలలో, ప్రకృతికి దగ్గరగా నివసించే వీరికి మంచి సంస్కారం అలవడుతుంది అనుకున్నాడు.

గట్టిగా మాట్లాడి ఇతరులకు ఇబ్బంది కలుగచేసే సిటీ కల్చర్ కనిపించలేదు. సిటీ కాలేజీలలో చదివి వచ్చినవాళ్ళు తమవరకు తాము కంఫర్టబుల్‌గాఉంటే చాలు అనుకుంటారు. ఇతరులకు తమ ప్రవర్తన వల్ల ఇబ్బంది కలుగుతున్నా పట్టించుకోరు. దానికి భిన్నంగా కనిపించారు ఆ అమ్మాయిలు. వాళ్ళకి దగ్గరగా వెళ్ళి "నమస్తే" అంటూ పలకరించాడు.

"నమస్తే" అన్నారు అందరూ కోరస్‌గా.

ఒక క్షణంపాటు వాళ్ళకి అతను తమని ఎందుకు పలకరించాడు అన్నది స్పష్టం కాలేదు. వారిలో ర్యాగింగ్‌కి గురైన ముగ్గురు అమ్మాయిలు కూడా ఉన్నారు. "నా పేరు ప్రఫుల్" అన్నాడు.

అలోక్‌ని అమాంతం విసిరికొట్టిన అమ్మాయి మణిపూర్‌కి చెందిన మేరీ. ఆమెతోపాటు మణిపూర్ నుంచి వచ్చిన మరో అమ్మాయి ఈశా.

సిక్కిం నుంచి కాయ్‌లా, అసోమ్ నుంచివచ్చిన వీణా తమ తమ పేర్లను చెప్పారు.

వాళ్ళు గ్రాడ్యుయేషన్ కోసం వచ్చారని తెలుసుకున్నాడు ప్రఫుల్.

తను బెనారస్‌లో గ్రాడ్యుయేషన్ చేసి అక్కడకు పిజి కోసం వచ్చాడని చెప్పాడు ప్రఫుల్.

వాళ్ళంతా లేడీస్ హాస్టల్‌లో ఉంటున్నారని తెలిసింది. ఒకసారి టెంప్ట్ అయ్యాడు, శర్మిష్ఠ గురించి చెప్దామని. కాని బాగుండదేమో అని ఊరుకున్నాడు. ఎందుకనో అతని ఆలోచనలు ఎక్కడ మొదలైనా శర్మిష్ఠ దగ్గరకే వెళ్ళి అంతమవుతున్నాయి.

అన్ని రోడ్లు రోమ్‌కి వెళ్తాయి అన్నట్లు. స్టూడియోలో అటూ ఇటూ తిరుగుతూ కొంత టైమ్ స్పెండ్ చేసి తర్వాత బయటకు నడిచాడు ప్రఫుల్.

అంతకు కొద్దిగా ముందు బయటకు వచ్చిన మేరీ మిత్రబృందానికి అలోక్ గ్యాంగ్ దూరంగా ఒక చెట్టు దగ్గర నిలబడి తమవైపు చూడడం కనిపించింది.

మేరీకితప్ప తక్కినవాళ్ళకి వాళ్ళని చూడగానే భయం వేసింది.

పనిగట్టుకుని అక్కడికి వచ్చి నుంచున్నారంటే తమను వెతుక్కుంటూనే వచ్చారన్నది అర్థమైంది వాళ్ళకి.

మేరీ కొట్టిన దెబ్బను అవమానంగా తీసుకున్న ఆ గ్యాంగ్ తమపై అవకాశం చూసుకుని మళ్ళీ దాడి చేస్తారని భయపడ్డారు వాళ్ళు.

"మేరీ వాళ్ళని చూశావా?" అడిగింది

నా మీద పలుమార్లు డోప్ పరీక్షలు నిర్వహించటం మిగిలిన వాళ్ళను వదిలేయటం వివక్ష.
- సెరీనా విలియమ్స్, టెన్నిస్ క్రీడాకారిణి



వీణా. "చూశాను. వాళ్ళేం చేస్తారు. భయపడకండి ఊరికే" అంది ఈసడింపుగా.

"అలా అనకు. నీకు భయం లేకపోవచ్చు కాని మాకు భయంగానే ఉంది. ఏదో అల్లరిచేసి మనల్ని ఇబ్బందిపెట్టడంకోసమే వాళ్ళు అక్కడ కాపు కాస్తున్నారు" అంది ఈశా.

"అయితే ఏం చేద్దాం" అంది మేరీ.

"వెళ్ళి సారీ చెప్దాం. ఏదో పొరపాటున అలా జరిగిందని,క్షమించమని చెప్తే వాళ్ళ ఇగో శాంతిస్తుందేమో" అంది కాయ్‌లా.

"నేనేం తప్పు చేశాను. ఆత్మరక్షణ చేసుకున్నాను. నేనెందుకు అపాలజీచెప్పాలి" అంది మేరీ రోషంగా.

వాళ్ళు హాస్టల్ వైపు నడుస్తూ మాట్లాడుకుంటూ వెళ్తుంటే, చెట్టుకింద నుంచుని ఉన్న అలోక్ గ్యాంగ్ అక్కడనుంచి కదిలి మెల్లమెల్లగా వాళ్ళకు వంద అడుగుల దూరంలో వాళ్ళను వెంబడించసాగారు.

వాళ్ళు ఏవేవో మాట్లాడుకుంటూ గట్టిగట్టిగా నవ్వుతున్నారు. వాళ్ళ మాటలు వినబడకపోయినా, వాళ్ళు తమగురించే ఏవో కుళ్ళు జోకులు వేసుకుంటున్నారు అని అమ్మాయిలకు అర్థమైంది.

దాంతో మేరీకి రోషం పెరిగింది, తక్కిన అమ్మాయిలకు భయం పెరిగింది.

"వాళ్ళను ఆపి అల్లరి చేద్దాం" అన్నాడు అలోక్.

"వద్దు, వద్దు. తొందరపడొద్దు. మనకి అవకాశం రావాలి అప్పుడు మనం మనకు నచ్చింది చేయొచ్చు" అన్నాడు మరాండి.

"అప్పటివరకు చేతులు ముడుచుకుని వాళ్ళకి సెక్యూరిటీ గార్డుల్లా కాపలా కాద్దామా" అన్నాడు సమర్జిత్.

"అరే, ఛుప్.వాడు ఏదోప్లాన్ వేసేవుంటాడు.నువ్వు అప్పుడే వేడెక్కిపోకు" అని వారించాడు అలోక్.

"అవును అలోక్‌దా. ఒక ప్లాన్ సిద్ధంచేశాను.మనం అవకాశం కోసం చూడడమే కాదు.

దాన్ని సృష్టించుకుంటాము కూడా. మనకి అనువైన పరిస్థితులు అమరగానే, మన ఆట మొదలవుతుంది" అన్నాడు మరాండి నవ్వుతూ.

"ఆట కాదు వేట" అన్నాడు సమర్జిత్ వంకరగా నవ్వుతూ.

"అవునవును" అన్నాడు అలోక్ పెద్దగా నవ్వుతూ. వాళ్ళను కొద్దిదూరంలో నుండి చూసిన ప్రఫుల్‌కి ఎందుకు అమ్మాయిల వెంటపడ్డారో తెలియదు, కాని అది సహజమైన యువకుల బుద్ధిగా భావించి నవ్వుకున్నాడు. కాసేపటికి బెనర్జీ వచ్చాడు ప్రఫుల్ నుంచున్న చోటికి.

"వెళ్దామా" అన్నాడు బెనర్జీ.

"ష్యూర్" అన్నాడు ప్రఫుల్. సర్ అని పిలవాలనుకున్నాడు కాని బెనర్జీ చాలా స్ట్రిక్‌గా 'నో' అన్నాడు. పిలిస్తే పేరు పెట్టి పిలు అన్నాడు.ఏదో మొహమాటం మనసుని ఆవరించి ఉండడంవల్ల ఇంకా పేరు పెట్టి పిలిచే స్థాయికి చేరుకోలేదు ప్రఫుల్.




అది దిగజారడం అని అతని మొహమాటం చెప్తుంది.కాని అతని అంతరాంతరాల్లో అతనికి అనిపిస్తుంది, అలాంటి పిలుపు ఆత్మీయతను ప్రతిబింబిస్తుంది అని. ఇద్దరూ నడక మొదలుపెట్టారు.

బెనర్జీ బైక్ టూ వీలర్ పార్కింగ్ ప్లేస్‌లో ఉంది. అక్కడివరకు నడిచి అక్కడ బెనర్జీ బైక్ ఎక్కారు ప్రఫుల్, బెనర్జీ ఇద్దరూ.

"ఈరోజు నీకు కొన్ని పిజి అకామిడేషన్స్ చూపిస్తా. వాటిలో నీకు నచ్చినవి ఉంటే వాళ్ళతో రెంట్ విషయం మాట్లాడుదాం. నీకు ఫుడ్ వెతుక్కునే సమస్యకూడా ఉండదు. వాళ్ళు రెడీ చేసి ఇచ్చేస్తారు... సరేనా" అన్నాడు బెనర్జీ.

"అలాగే... థ్యాంక్యూ" అన్నాడు.

బైక్‌ని శాంతినికేతన్ గేట్‌లో నుంచి బయటకు నడిపాడు బెనర్జీ. బోల్‌పూర్ వీధుల్లోకి నిదానంగా సాగిపోయింది బైక్. కాని బైక్ కంటే వేగంగా బెనర్జీ వాక్ప్రవాహం సాగింది.

అన్నిటికీ 'ఊ' కొడుతూ రెండువైపులా కనిపిస్తున్న బోల్‌పూర్ స్వరూపాన్ని అవలోకించసాగాడు ప్రఫుల్. సన్నటి వీధుల్లోనుంచి వెళ్తున్నప్పుడు ఆ ఇళ్ళల్లోనుంచి వినిపిస్తున్న రబీంద్ర సంగీత్, కొన్నిచోట్ల వినిపిస్తున్న బెంగాలీ సంభాషణలు, పిల్లల ఆటలు, యువతుల ముచ్చట్లు అలా అలా అతని చెవులకు తగిలి వెళ్తుంటే



నాడు పార్లమెంట్‌లో నేను చేసిన వాగ్దానాలను నేటి ప్రధాని నరేంద్రమోడీ గౌరవించాలి.

-మన్మోహన్‌సింగ్, మాజీ ప్రధాని

బెంగాలీ వీధుల్లోని వింతైన సొగసుని అతని మనసు ఊహించుకోసాగింది. అమ్మకు ఇష్టమైన నవలలో ఉన్నటువంటి పరిస్థితులు ఇప్పుడు ఉన్నాయో లేదో ఇక్కడ అనుకున్నాడు.

ప్రతిచోటా మోడర్న్ డ్రెస్‌లు వేసుకుని ధైర్యంగా తిరిగే యువతులే కనిపిస్తున్నారు కాని,

తలనిండా చీరచెంగు కప్పుకుని వినయవిధేయతలు ఉట్టి పడుతుండగా పెద్దల పాదధూళిని తమ శిరసున దాల్చే యువతులు ఇప్పుడు కనబడతారా? అనుకున్నాడు.

కాలం ఎంతమారినా మనదేశంలో కొన్ని సందర్భాల్లో మాత్రం సాంప్రదాయాన్ని గౌరవించడం కనిపిస్తూనే ఉంది. అటువంటి సందర్భాల్లో వివాహం చాలా ముఖ్యమైనది.

ఎప్పుడైనా అవకాశం దొరికితే బెంగాలీల వివాహం ఎలా జరుగుతుందో చూడాలి.వాళ్ళ వేడుకలు ఏమిటో, వాళ్ళ సాంప్రదాయాలేమిటో అప్పుడు అర్థమవుతుంది అనుకున్నాడు.

తన ఆలోచనలలో తాను విహరిస్తూనే,

బెనర్జీ మాటలకు 'ఊ' కొట్టడం చేస్తున్న ప్రఫుల్‌కి చిన్నషాక్ దొరికింది.

"వాట్ ప్రఫుల్ బాబూ, నేను మాట్లాడటం మానేసి పది నిముషాలైంది. అయినా నువ్వు 'ఊ' కొడుతూనే ఉన్నావు. ఎవరి ఆలోచనల్లోనైనా తిరుగుతోందా నీ మనసు?" అన్నాడు బెనర్జీ బండిని ఒక ఇంటి ముందు ఆపి, వెనక్కి తిరిగిచూసి.

సిగ్గుపడ్డాడు ప్రఫుల్. "ఏమీ లేదు బెనర్జీదా!" అన్నాడు అప్రయత్నంగా.

వెంటనే ఆశ్చర్యపోయాడు తనేమిటి ఇంత ఆప్యాయంగా వాళ్ళు పిలుచుకునేలాగా బెనర్జీని బెనర్జీదా అని సంబోధించాడు అనుకున్నాడు. కానీ అందులో చాలా సహజత్వం

కనబడి సర్దుకున్నాడు.

ఎలాంటి కృత్రిమత్వంలేని ఒకానొక మమకారపు బంధం అలా తమకు చుట్టుకుందని భావించాడు.

"ఇదే మా ఇల్లు. ఇక్కడ ఈ బైక్‌పెట్టి అటూ ఇటూ వెళ్ళివద్దాం. ఇక్కడ దగ్గర్లోనే రెండు మూడు ఇళ్ళల్లో గెస్ట్‌రూమ్‌ని పిజి అకామిడేషన్‌గా ఇస్తుండేవాళ్ళు అవి ప్రస్తుతం ఖాళీ అయ్యాయట" అన్నాడు బెనర్జీ లోపలికి దారితీస్తూ.

లోపలినుంచి నాలుగేళ్ళ పిల్లాడు పరిగెత్తుకుంటూ

మన ఖర్మ ఏమిటంటే పవన్ వంటి వ్యక్తి నీతులు మాట్లాడుతుంటే మనంవినాల్సిరావటం.
-జగన్మోహన్‌రెడ్డి, వై.కా.పా.అధ్యక్షుడు



వచ్చాడు, "బాబా" అంటూ. ప్రకాశవంతంగా ఉన్న గుండ్రటి ముఖం, చురుకైన కళ్ళు, బూరె బుగ్గలు, ఉంగరాల జుత్తుతో చూడగానే ఆకట్టుకునేలా ఉన్నాడు. ఆ పిల్లాడిని ఎత్తుకుని ముద్దాడుతూ, "అమ్మ ఎక్కడ ఉంది" అన్నాడు బెనర్జీ.

"ఇదిగో వస్తున్నా" అంటూ లోపలి నుంచి ఒక స్త్రీ కంఠం వినిపించింది. గుమ్మం వరకు వచ్చాక బెనర్జీ పక్కనే నుంచుని ఉన్న ప్రఫుల్‌ని చూసి, చటుక్కున లోపలికి వెళ్ళిపోయింది.

"వీడు నా కొడుకు అమిత్" అన్నాడు బెనర్జీ ఆ పిల్లాడి బుగ్గలు ముద్దాడి కిందకు దించుతూ.

"హాయ్ అమిత్" నవ్వుతూ పిలిచాడు ప్రఫుల్.

వాడు ఒకసారి ప్రఫుల్ వైపు కుతూహలంగా చూసి లోపలికి పరిగెత్తాడు.

"కూర్చో" అన్నాడు బెనర్జీ హాల్‌లో ఉన్న కేన్ కుర్చీలు చూపిస్తూ.

ప్రఫుల్ కూర్చోబోతుండగా బెనర్జీ సతీమణి వచ్చింది. ట్రేలో తినడానికి ఏవో స్నాక్స్, మంచినీళ్ళ గ్లాసులతో. ఆమె తలపై కొంగు కప్పుకుని ఉంది.బెనర్జీ ఆమెను పరిచయం చేశాడు.

"ప్రఫుల్ బాబూ ఈమె నా అర్ధాంగి. పేరు రంజని. ఈమె శాంతినికేతన్‌లో బిఎ హిస్టరీ చదివింది.రంజనీ! ఇతను ప్రఫుల్ రావ్. పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేయడం కోసం యూనివర్శిటీలో అడ్మిషన్ తీసుకున్నాడు"అన్నాడు బెనర్జీ.

రెండు చేతులు జోడించి అభివాదం చేశాడు ప్రఫుల్.

"తీసుకోండి. టీ చేసి పట్టుకువస్తా" అంది రంజని స్నాక్స్ తినమని చెప్తూ.

మధ్యాహ్నం లంచ్ స్కిప్ చేసినవిషయం ప్రఫుల్‌కి అప్పుడు గుర్తుచేసింది అతని పొట్ట. మొహమాటపడకుండా ఆమె ప్లేట్‌లో పెట్టిన బిస్కట్లు, మిక్చర్ లాగించి మంచినీళ్ళు తాగాడు. బెనర్జీ తింటూనే వాళ్ళ నాన్నగారు ఆ ఇల్లు ఎలా కట్టించారో చెప్పాడు.

తను ఒక్కడే కొడుకు కావడంవల్ల తనతోనే ఉండడం, తల్లిని తీసుకుని టూర్ వెళ్ళడం వంటి విషయాలను ఒకటొకటిగా చెప్తూనే ఉన్నాడు ప్రఫుల్. బైకుమీద ఉన్నప్పుడు చెప్పిన "ఊ" కొట్టడంలా కాకుండా నిజాయితీగా అతను చెప్పిన విషయాలన్నిటినీ శ్రద్ధగా విని గుర్తుకూడా పెట్టుకున్నాడు.

ఈలోగా రంజని ట్రేలో టీ తీసుకువచ్చింది చక్కటి పింగాణీ కప్పులో పోసి. టీ ఘుమఘుమలాడుతూ ఉంది. టీ సేవించిన తర్వాత కొత్త ఉత్సాహమేదో వచ్చినట్లు అనిపించింది ప్రఫుల్‌కి.

పెళ్ళిచేసుకుంటే ఎన్ని లాభాలో అనుకున్నాడు!వెంటనే శర్మిష్ఠగురించిన ఆలోచనలు మదిలో చెలరేగాయి. వాటిని బలవంతాన తొక్కిపట్టి "థ్యాంక్యూ. మంచి టీ తాగించారు" అన్నాడు ప్రఫుల్.

"మీకు ఎప్పుడు టీ కావాలనిపిస్తే అప్పుడు రావచ్చు" అంది రంజని నవ్వుతూ.

"ప్రఫుల్ బాబూ,హోమ్ మినిస్టర్ ఆహ్వానంలభించింది. మీరు మొహమాటపడకుండా రావచ్చు" అన్నాడు. ప్రఫుల్ గట్టిగా నవ్వేశాడు. వాళ్ళతో మాట్లాడుతూ ఉంటే మొదట్లో అనిపించిన బిడియం, మొహమాటం మెల్లమెల్లగా దూరమవడం చూస్తుంటే అతనికే ఆశ్చర్యం అనిపించింది.

"సరే, మనం వెళ్దామా?" అన్నాడు బెనర్జీ.

"అలాగే, వస్తాం బాభీ" అన్నాడు ప్రఫుల్ తన బెనారెస్ అనుభవంతో.

బెనర్జీతో పాటు వీధిలోకి నడుస్తూంటే అమిత్ వెంటపడబోయాడు కానీ రంజని వాడిని చెయ్యిపుచ్చుకుని ఆపేసింది. రెండు మూడు వీధులు దాటిన తర్వాత ఒక మేడ ముందు ఆగాడు బెనర్జీ.

"శాంతినికేతన్ అంటే అభిమానంతో చాలామంది ఈ బోల్‌పూర్‌లో ఇల్లు కొనుక్కున్నారు.

బాగా డబ్బున్న వాళ్ళు వాటిని వాచ్‌మేన్‌ని పెట్టుకుని మెయిన్‌టెయిన్ చేస్తున్నారు.

తక్కినవాళ్ళు తమకు తెలిసినవాళ్ళకి అద్దెకు ఇస్తున్నారు. తమకంటూ ఒకటిరెండు గెస్ట్‌రూమ్స్‌లాగా అట్టే పెట్టుకుంటున్నారు.

ఏడాదికోసారో రెండుసార్లో ఆ జనసమ్మర్దమైన కోల్‌కతా నుంచి తప్పించుకునొచ్చి ఇక్కడి కాలుష్య రహిత వాతావరణంలో రీచార్జి అవుతుంటారు" అన్నాడు బెనర్జీ గేటు తీసుకుని లోపలికి నడుస్తూ. అతని వెంట నడిచాడు ప్రఫుల్.

"సేన్‌దా!" అంటూ గట్టిగా పిలిచాడు బెనర్జీ.

లోపలినుంచి ఒక నడివయసు వ్యక్తి వచ్చాడు. బెనర్జీని చూసి "ఏమిటి ఇటు రావడమే మానేశావు. చాలా బిజీ అయిపోయావు" అంటూ నిష్టూరాలు మొదలుపెట్టాడు.

"లేదు సేన్‌దా. న్యూ అడ్మిషన్స్‌తో కొంచెం బిజీగా ఉన్నాను. ఇప్పుడు కూడా అదే పనిమీద వచ్చాను.

ఈ అబ్బాయి మా దగ్గర పోస్ట్ గ్రాడ్యుయేషన్‌లో చేరాడు. నీ దగ్గర పిజి అకామిడేషన్ ఉంది కదా! అది ఇప్పుడు ఉందా" అన్నాడు బెనర్జీ.

"అరే, నిన్ననే ఎవరో వస్తే ఇచ్చేశాను. అడ్వాన్స్‌కూడా తీసుకున్నాను. కొంచెం ముందుగా వస్తే బాగుండేది కదా!" అన్నాడు సేన్‌దా.

**ఇంకా ఉంది**

## తీరిక లేదనకూడదు

ప్రేమించే విషయాలకోసం తప్పనిసరిగా సమయాన్ని కేటాయిస్తామంటున్నది 'సాహో' భామ శ్రద్ధాకపూర్. 'నటన, సంగీతం, నృత్యం నాకు ఇష్టం. దేనికి ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారని అడిగితే గబుక్కున సమాధానం చెప్పలేను.

మనకు ఇష్టమైనవాటికోసం కష్టమైనా సమయాన్ని కేటాయిస్తాం కదా.

నచ్చినపని చేయడానికి తీరిక వుండడం లేదని ఎవరైనా చెప్తే నేను నమ్మను. సరైన ఆసక్తి లేకపోవడం వల్లనే తీరిక చేసుకోలేకపోతారని నేను అనుకుంటాను" అని తెలిపింది.



# వానాకాలం వెచ్చగా



Courtesy : VANITHA

వర్షాలుపడే చల్లని సాయంత్రాలు అంతా ఇంటికి చేరాక, తీరిగ్గా కూర్చుని వేడివేడిగా ఏవైనా తింటూ కబుర్లు చెప్పుకునే అనుభూతి అంతులేని ఆనందాన్ని ఇస్తుంటుంది. వేడివేడి వెరైటీ పకోడీలు తయారీ విధానాలు మీకోసం.

## క్యాబేజీ పకోడి

**కావాల్సిన పదార్థాలు :**

మూడు కప్పులు క్యాబేజీ ముక్కలు, ఒక పచ్చిమిరపకాయ, ఒక టీస్పూన్ జీలకర్ర, ఒక టీ స్పూన్‌కారం, పావుటీస్పూన్ వాము, ఒక టేబుల్‌స్పూన్ అల్లం, వెల్లుల్లి పేస్ట్, అరటీస్పూన్ పసుపు, రెండుకప్పులు శనగపిండి, నాలుగు టేబుల్ స్పూన్లు బియ్యంపిండి, ఒక టీస్పూన్ బేకింగ్ సోడా, వేయించడానికి నూనె.

**తయారుచేసే విధానం :** క్యాబేజీ ముక్కల్ని



ఒక పాత్రలోకి తీసుకుని పచ్చిమిరపకాయ ముక్కలు, జీలకర్ర, వాము, ఉప్పు, అల్లం, వెల్లుల్లి పేస్ట్, కారం, పసుపువేసి బాగా కలుపుకోవాలి. బియ్యంపిండి, బేకింగ్ సోడా, శనగ పిండి వేసి బాగా కలపాలి.

పిండి పొడిగా, చిక్కగా వుండాలి తప్ప జారుగా ఉండకూడదు.మూకుడులో నూనెపోసి కాగాక,పిండిని చిన్నచిన్న పకోడీలుగా నూనెలోకి వదలాలి. గోల్డెన్ బ్రౌన్‌కలర్ వచ్చేదాకావేయించి తీసేయాలి.గ్రీన్‌చట్నీ లేదా టమోటోసాస్ నంజుకుని తింటే రుచిగా ఉంటాయి. ◆

## ఆలూ, పాలక్ పకోడి

**కావాల్సిన పదార్థాలు :** 20-25 పాలాకులు, రెండు బంగాళాదుంపలు, వంద గ్రాములు శనగపిండి, రెండు టేబుల్ స్పూన్లు బియ్యంపిండి, రెండు పచ్చి మిరపకాయలు, ఒక టీస్పూన్ వెల్లుల్లిముక్కలు, చిటికెడు వంటసోడా, అర టీస్పూన్ వాము, ఒక టీ స్పూన్ కారం, కప్పు నీరు, రుచికి తగినంత ఉప్పు, వేయించడానికి నూనె.

**తయారుచేసే విధానం :** పాలాకు శుభ్రంగాకడిగి, ఆరనిచ్చి, సన్నగా తరగాలి. బంగాళా దుంపలు చెక్కుతీసి కడిగి చిన్నచిన్నముక్కలుగా కోసుకోవాలి. బౌల్‌లో శనగపిండి, కారం, వెల్లుల్లి, పచ్చిమిరపకాయ ముక్కలు, బియ్యంపిండి, వాము, బేకింగ్ సోడా, ఉప్పు వేసి కలుపుకోవాలి. రెండుమూడు నిమిషాలు అలాగే వుంచేసి, మరోసారి కలుపుకోవాలి. పాలాకు, బంగాళాదుంప ముక్కలు వేసుకోవాలి. అన్నీ బాగా కలియబెట్టుకోవాలి.

మూకుడులో నూనె వేడిచేసి, కొద్దికొద్దిగా మిశ్రమాన్ని నూనెలోకి వదలాలి. మధ్యస్థంగా వున్న సెగపై కాల్చుకోవాలి. క్రిస్పీగా, గోల్డెన్ బ్రౌన్ కలర్‌లోకి వచ్చేవరకు వేయించాలి. గ్రీన్ చట్నీ లేదా కెచప్ నంజుకుని తింటే రుచిగా వుంటాయి. ◆





Courtesy : STAYFIT

## ఫిష్ పకోడి

**కావాల్సిన పదార్థాలు :** నాలుగు ముళ్ళులేని చేపముక్కలు, రెండు గుడ్లు, కొద్దిగా ఉప్పు, కొంచెం కారం, రెండు టేబుల్ స్పూన్లు కార్న్‌ఫ్లోర్, రెండు టేబుల్ స్పూన్లు నిమ్మరసం, ఒక టీస్పూన్ కొత్తిమీర వేయించడానికి నూనె.

**తయారుచేసే విధానం :** గుడ్లు గిలక్కొట్టి అందులో ఉప్పు, కారం, నిమ్మరసం, కొత్తిమీర వేసి కలపాలి.

కార్న్ ఫ్లోర్ వేసి బాగా కలుపుకోవాలి. మూకుడులో నూనె వేడి చేసి, చేపముక్కలు గుడ్డు మిశ్రమంలో ముంచి నూనెలో వేసి బంగారురంగు వచ్చేవరకు వేయించాలి. వేడిగా ఫేవరెట్ చట్నీతో లేదా కెచప్‌తో కలిపి వడ్డించాలి.

# హెల్త్ బిట్స్



## చ్యవనప్రాస

ఆయుర్వేదం చెప్పిన చ్యవనప్రాస ఇప్పుడు ప్రపంచవ్యాప్తంగా అంగీకారం పొందిన ఔషధం. ఇందులో ఉసిరి, అశ్వగంధ, ద్రాక్ష, గుడిచి, పిప్పలి, విభీతకాయ వంటివి అనేకం వున్నాయి. ఉసిరి 'సి' విటమిన్ అత్యధికంగా కలిగివుంటుంది.

దీనితోపాటుగా అందులో వున్న యాంటీ ఆక్సిడెంట్స్ కలిసి రోగనిరోధక వ్యవస్థను మెరుగుపరుస్తాయి. శరీరంలోపల ఏర్పడే ఫ్రీర్యాడికల్స్‌ని నియంత్రిస్తాయి. ఇందులో వాడే నెయ్యి, తేనె, చక్కెరలు దానిని నిలువవుంచేందుకు చర్యలు వేగంగా జరిపేందుకు సహకరిస్తాయి.

చ్యవనప్రాస అనేది మెదడుకు మేలుచేస్తుంది. దృష్టి కేంద్రీకరణ, జ్ఞాపకశక్తిని పెంచుతుంది. వయసు లక్షణాలను త్వరగా కనపడనీయదు. మహిళల్లో నెలవారీ సక్రమంగా జరిగేలా చేస్తుంది. రక్తం శుద్ధిపరుస్తుంది. అలాగే మలినాలను పారద్రోలి కాలేయ ఆరోగ్యం కాపాడుతుంది.

చర్మరోగ నివారణకు అది అంతర్గత శక్తినిస్తుంది. డిప్రెషన్‌లోకి జారుకోనివ్వదు. క్యాల్షియం గ్రహింపులో సహకరించి ఎముకలు, దంతాలు బలంగా, ఆరోగ్యంగా చేస్తుంది. కండరాలకు చక్కని రూపం ఇస్తుంది. ఇది అన్ని వయసులవారికీ మేలుచేస్తుంది.

ఉదయం పరగడుపున తీసుకోవటం మంచిది. అది తీసుకున్న పావుగంట తర్వాతగాని మరేదీ తినకూడదు. పిల్లలకు ఒక చిన్న చెంచా, పెద్దలకు పెద్ద చెంచాడు అవసరం అవుతుంది. ◆




## స్తంభన పోతే

పురుషులలో అంగస్తంభన కోల్పోతే అది మానసికంగా ఇలా దెబ్బతీస్తుంది. మనసునే కాదు శారీరక అనారోగ్యానికీ అది ఒక హెచ్చరిక అంటున్నారు పరిశోధకులు.

అంగస్తంభన తగ్గుతుంటే రక్తపోటు, పెరుగుతున్నదని, కొలెస్ట్రాల్ అధికమవుతున్నదన్న సంకేతం.

ఇది గుండె, రక్తనాళ సంబంధిత అనారోగ్యాలు తెస్తుంది. అంగస్తంభన పోయినవారిలో గుండెపోటు ప్రమాదం రెట్టింపు అవటం గమనించారు.

ఒకే వయసు, ఒకే రకమైన ఆహారపు అలవాట్లు కలిగినవారిలో జరిపిన అధ్యయనం ద్వారా అంగస్తంభన సమస్యకు, వారి ఆరోగ్యానికి సంబంధం ఉందని ఆ అధ్యయనంలో తేలింది.

ఎవరి ఆహారపు అలవాట్లు క్రమబద్ధంగా వుండవో, ఎవరైతే భారీకాయులు అవుతారో, డయాబెటిక్, అదనపు కొవ్వులు శరీరంలోకి చేరినవారందరికీ అంగస్తంభన సమస్య వస్తున్నది.

ఆ సమస్యలవల్ల అంగస్తంభన పోతున్నదా! అనే ప్రశ్న లేకపోలేదు. ఆ అనారోగ్యాలతో అంగస్తంభన వచ్చినా గుండెమీద ప్రభావంపడి తీరుతుంది. ◆



## నమస్కారం ఆరోగ్యం

రెండు చేతులూ జోడించి నమస్కరించటం మన సాంప్రదాయం. ఇది అవతలివారికి గౌరవం ఇవ్వటమే కాదు తమకు తాము ఆరోగ్యం పొందటంకూడా. రెండు చేతులూ జోడించినప్పుడు కుడి, ఎడమ చేతుల వేళ్ళు ఒకదానిని ఒకటి తాకుతాయి.

అరచేతులు ఏకమవుతాయి. దీనివలన వేళ్ళ మొనలలోనూ, ఇతర భాగాలమీదా ఒత్తిడి ఏర్పడుతుంది. ఆ ఒత్తిడి ప్రభావం మెదడు కేంద్రాలమీద పడుతుంది. అవి జ్ఞాపకశక్తి కేంద్రాలు కావటంవలన నమస్కారం ఎవరికైతే పెట్టారో వారిని ఎక్కువ కాలం గుర్తుపెట్టుకుంటుంది మెదడు. ◆




## ఆఫీసుల్లో తిండి

ఇంటి దగ్గర వంట చేసుకుని ఆఫీసుకు వెంట తీసుకుని వెళ్ళటం తగ్గుతోంది. సమయం సరిపోదని కొందరు, బద్ధకంతో, ఆఫీసులో ఉచితంగా ఇస్తున్నారు కదా అని అలా ఆఫీసులో తిండికి అలవాటుపడి శరీర రూపాన్ని పోగొట్టుకుంటున్నారు.

ఆఫీసుల్లో వుండగా తినేదానిలో పోషకపదార్థాలు తక్కువ, అదనపు క్యాలరీలు కలిగివుంటాయి. ఇవి కాక శాండ్‌విచెస్, సాఫ్ట్ డ్రింక్స్, కేక్స్, ఫ్రెంచ్ ఫ్రైస్ వంటివి ఉద్యోగులు తీసుకుంటున్నారు.

ఈ ఆహారపదార్థాలు అన్నీ ఆరోగ్యాన్ని చెడగొట్టేవి. తిన్నదానిలో ఏదీవేగంగా అరగదు. ఫలితంగాకొవ్వులు పేరుకుని, లావెక్కటం మొదలవుతున్నది. ఒకసారి రూపం చెడితే అనారోగ్యాలు వెన్నంటి వుంటాయి. ఇంటితిండిని మించినదిలేదు కాబట్టి బద్ధకాన్ని వదిలిపెట్టి ఇంటినుండి భోజనం తీసుకువెళ్ళండి.

# సర్కారీ కొలువు

**₹ 9,999 బహుమతి పొందిన కథ**


యం.రమేష్ కుమార్

సెల్ : 94924 54678
kumarmr2012@gmail.com


మొత్తానికి బంగార్రాజు ఈనాటికి గవర్నమెంటు ఉద్యోగస్థుడు కాబోతున్నాడు.ఇది వాడికెంత సంతోషాన్నికల్గిస్తుందో తెలీదు గానీ నాకు మాత్రం చాలా ఆనందంగా వుంది.

నలభై ఎనిమిదేళ్ళ వయసులో గవర్నమెంటు ఉద్యోగం సాధించడం అనేది ఘనమైన విషయం మాత్రమే కాదు, అరుదైన విషయం కూడా! ఇంక పిల్లలు కలగరు అని నిశ్చయించుకొని ఎవర్నయినా దత్తత తీసుకున్న తర్వాత తల్లి కాబోతున్నాననే విషయం తెలిస్తే ఆమె పరిస్థితి ఎలా ఉంటుందో సరిగ్గా బంగార్రాజు మానసికస్థితి కూడా అలాగే ఉంది.

అసలీ పరిస్థితికి కారణమేంటి? నలభై ఎనిమిదేళ్ళ వయసులో గవర్నమెంటు ఉద్యోగమేమిటి... అన్న విషయం తెలుసుకోవాలంటే మాత్రం దాదాపుగా నలభై ఏళ్ళ వెనక్కెళ్ళాలి.

బంగార్రాజుకి హైస్కూల్లో వున్నప్పట్నుంచీ ఒకటే ఆశయం. అదేమిటంటే ఎప్పటికైనా ఎలాగైనా గవర్నమెంట్ ఉద్యోగం సంపాదించాలి. ఆ వయసు నుంచే వాడికా ఆలోచన మనసులో బలంగా ఎందుకు పాతుకుందీ అంటే దానిక్కారణం వుంది.

బంగార్రాజు తాతగానీ, తండ్రిగానీ గవర్నమెంటు ఉద్యోగస్థులు కారు. అసలు వాడి దగ్గర బంధువుల్లో కూడా ఎవరూ గవర్నమెంటు ఉద్యోగస్థులు లేరు.వాళ్ళ నాన్న అప్పట్లో ఎస్సెస్సెల్సీ చది వినా గవర్నమెంటు ఉద్యోగంలో మాత్రం కుదురుకోలేకపోయాడు.

ఊళ్ళో వున్న జూటుమిల్లులోనే గుమాస్తాగా సెటిలైపోయాడు. బంగార్రాజుకి చిన్నప్పట్నుంచీ అంటే వాడు ప్రైమరీ క్లాసులు చదివినప్పటి నుంచీ వాళ్ళ నాన్న ఒకటే నూరిపోశాడు.

“ఒరేయ్... మన వంశంలోగానీ, అటు మీ అమ్మతరపువాళ్ళలోగానీ, లేదా మన బంధువుల్లోగానీ గవర్నమెంటు ఉద్యోగంలో కుదురుకున్న వాళ్ళు ఒకరూ లేరు. అంచేత నువ్వెలాగైనా సర్కారీ కొలువు సంపాదించితీరాలి.

అది నేను చూడాలి. నా కొడుకు గవర్నమెంటు ఉద్యోగస్థుడు అని నలుగురికీ చెప్పుకోవాలి. ఈ మాటమాత్రం గుర్తుంచుకో!" అనేవాడు. దాంతో బంగార్రాజుకి చిన్న వయసునుంచే ఎప్పటికైనా గవర్నమెంటు ఉద్యోగం సంపాదించాలి అనే బలమైన ఆశయం ఏర్పడిపోయింది.

దానికితోడు నాతో సహా బంగార్రాజు స్నేహితుల్లో చాలామంది గవర్నమెంటు ఉద్యోగస్థుల కొడుకులు.

మా ఊరు పక్కనున్న టౌన్లో ఇద్దరం ఇంటర్ పూర్తిచేసుకున్న తర్వాత నేను బియస్సీలో చేరితే బంగార్రాజు మాత్రం టిటిసి రాశాడు. మంచి ర్యాంక్ తెచ్చుకుని టీచర్ ట్రైనింగ్ కోర్సులో జాయినయ్యాడు.

అది కూడా మా పక్క టౌన్లోనే వచ్చింది. అంచేత మాఇద్దరి స్నేహానికీ ఏ మాత్రం ఆటంకం కలగలేదు. సాయంత్రాలు ఊళ్ళో ఇద్దరం కలిసి తిరిగేవాళ్ళం. సినిమాకు పోయినా కలిసే వెళ్ళే వాళ్ళం.వాడు టీచర్ ట్రైనింగ్‌కోర్సు పూర్తిచేసుకున్నాక తిరిగి బియస్సీలో జాయినయ్యాడు. అంచేత వాడు ఫస్టియర్లోవుంటే నేను ఫైనలి యర్‌లో వుండేవాడ్ని. నా డిగ్రీ కంప్లీట్ అయ్యాక బిఎడ్ రాశాను. ర్యాంక్ తగిలింది గానీ శ్రీకాకుళం ప్రైవేట్ కాలేజీలో సీటొచ్చింది.

నేను వెళ్ళి జాయినైపోయాను. అప్పుడు మాత్రం మా ఇద్దరికీ ఎడబాటువచ్చింది. అయితేనేను ఊళ్ళో కొచ్చినప్పుడు మాత్రం ఇద్దరం కలిసే తిరిగేవాళ్ళం. బిఎడ్ అప్పట్లో తొమ్మిది నెల్ల కోర్సు మాత్రమే కాబట్టి రోజులు తొందరగానే కరిగిపోయాయి.

పరీక్షలు అయిపోయిన తర్వాత నేను మళ్ళీ ఊళ్ళోకొచ్చేశాను. ఈమధ్యలో ఒక చిన్న ఘట్టం జరిగింది. నేను బిఎడ్ చేస్తున్నప్పుడు టీచర్ రిక్రూట్‌మెంట్ టెస్ట్ నోటిఫికేషన్ పడింది. అయితే ఇంకా మా బి.ఎడ్ పరీక్షలు అప్పటికి అవ్వలేదు కాబట్టి ఆ టెస్ట్‌లో పాల్గొనే అవకాశం ప్రభుత్వం మాకు ఇవ్వలేదు. అప్పటికి ఆరేళ్ళుగా టీచర్ రిక్రూట్‌మెంట్ టెస్ట్ జరగలేదు. ఆ సంవత్సరం ప్రకటించారనేసరికి మాకు అవకాశం లేకుండాపోయింది.



న్యాయమూర్తులమధ్య వుండే విభేదాలపై రాజకీయం చెయ్యటం తగదు.
-రవిశంకర్ ప్రసాద్, కేంద్రమంత్రి

మా బ్యాచ్‌వాళ్ళు ఆ విషయంలో పట్టుబట్టి అడిగినా పనిమాత్రం జరగలేదు.

అయితే బంగార్రాజు అప్పటికే టిటిసి పూర్తిచేసి వున్నాడు కాబట్టివాడికి ఆ టెస్ట్ రాసే అదృష్టం కలిగింది. ఇంకేముంది బంగార్రాజు తనకి ఇక ఉద్యోగం వచ్చేసినట్టే అని భావించాడు. ఎందుకంటే రిక్రూట్‌చేయబోతున్న సెకండరీ గ్రేడ్ టీచర్‌పోస్టులు ఎక్కువగానే ఉన్నాయి. టిటిసి వాళ్ళు ఆ పోస్టులకు అర్హులు. బిఎడ్ పూర్తయినవాళ్ళయితే సెకండరీ గ్రేడ్ పోస్టులతోపాటు స్కూలు అసిస్టెంట్ (సబ్జెక్ట్ టీచర్) పోస్టులకు కూడా అర్హులవుతారు.

బంగార్రాజు మరీ ర్యాంక్ స్టూడెంట్ కాకపోయినా తెలివైనవాడే... కాబట్టి ఉద్యోగం తప్పకుండా వస్తుందని లెక్క వేసుకున్నాడు. నేను కూడా అలాగే భావించాను.

బంగార్రాజు ఆ టైములో నేను బిఎడ్ చేస్తున్న శ్రీకాకుళం వచ్చాడు. ఆ ఊరు... నా రూము అదీ చూశాడు. ఒకరోజంతా కలిసున్నాక తిరిగెళ్ళేముందు చాలా బాధపడ్డాడు. ఆ బాధకు కారణం ఏమిటంటే తనకు కొన్ని రోజుల్లో గవర్నమెంటు ఉద్యోగం ఎలాగూ వస్తుంది.

టిటిసి చెయ్యకుండా డిగ్రీచేసి బిఎడ్‌కు వెళ్ళడం వల్ల నేను అనవసరంగా ఉద్యోగం తెచ్చుకునే అవకాశం కోల్పోయాననీ, తిరిగి ఆ ఛాన్స్ ఎప్పుడు వస్తుందో చెప్పడం కష్టమనీ, వచ్చినా అప్పుడు ఇంత భారీసంఖ్యలో పోస్టులు తీయకపోవచ్చనీ చెప్పి నా పరిస్థితికి చాలా బాధపడ్డాడు.

"సర్లే ఎలా జరగాల్సింది అలా జరుగుతుంది. నువ్వు కష్టపడి చదివి ఎలాగైనా పోస్టు సంపాదించు... నువ్వు జాబ్ సంపాదిస్తే నాకంటే సంతోషించేవాడు ఉండడు" అని మనస్ఫూర్తిగా వాడికి చెప్పాను.

అసలు అప్పట్లో మాకు అవకాశం రాకపోవడం గురించి నిజంగానే నేను పెద్దగా బాధపడలేదు.

కారణం ఏమిటంటే టీచర్ ఉద్యోగమే చెయ్యాలన్న పెద్ద కోరికేమీ నాకు వుండేది కాదు.ఏదో ర్యాంక్ తగిలింది కాబట్టి ఈ కోర్సు చేస్తున్నానుగానీ తర్వాత బ్యాంక్‌టెస్టులకి ప్రిపేరవుదామని అనుకునేవాడ్ని.

అంతా అనుకున్నట్టే అయితే అది జీవితం ఎందుకవుతుంది?

బంగార్రాజు టీచర్ టెస్టు రాశాడు గానీ విజయం మాత్రం చేతికందలేదు.

మా ఊళ్ళోనే మరో ఇద్దరు పోస్టులు కొట్టారుగానీ బంగార్రాజుకి మాత్రం ఉద్యోగం తగల్లేదు. వాడు నిజంగానే చాలా

నిరాశపడ్డాడు. ఇంచుమించు డిప్రెషన్లోకి వెళ్ళిపోయాడు. అయితే ఇంట్లో వాళ్ళతోపాటు నేనుకూడా వాడికి అనేకరకాలుగా నచ్చచెప్పాను.

టిటిసి చేసినంతమాత్రాన టీచర్ పోస్టుకే వెళ్ళక్కర్లేదనీ, పైగా బోల్డంత వయసుంది కాబట్టి ఇంకా ఇలాంటి రిక్రూట్‌మెంట్ టెస్టులకి అటెండ్ అవ్వొచ్చనీ ఈ మాత్రానికే నిరాశ పడిపోవాల్సిన అవసరంలేదనీ చెప్పాను. ఇదంతా అయ్యేసరికి నేను బిఎడ్ పూర్తి చేసుకుని వచ్చేశాను. బ్యాంక్ పరీక్షలకు సంబంధించిన మెటీరియల్ సంపాదించి ప్రిపేర్ అవ్వసాగాను.

ఒక బ్యాంక్ టెస్టుకు కూడా అటెండయ్యానుగానీ పోస్టు తగల్లేదు. ఆ తర్వాత సంవత్సరం బంగార్రాజుకి డిగ్రీ కంప్లీట్ అయ్యింది. ఎవరూ ఊహించనివిధంగా ఆ సంవత్సరం మళ్ళీ టీచర్ రిక్రూట్‌మెంట్ టెస్ట్‌కి నోటిఫికేషన్ వచ్చింది.ఇంకేముంది? ఇద్దరం కలిసిజంటగా ప్రిపేరయ్యాం. నాకు రెండు రకాల పోస్టులకి అర్హత వున్నా ఎక్కువగా సెకండరీ గ్రేడు పోస్టుమీదనే గురిపెట్టాను. కారణమేమిటంటే ఆ పోస్టులే మళ్ళీ ఎక్కువ సంఖ్యలో వున్నాయి.

ఆ పరీక్ష కోసమని ఇద్దరం కలిసే చదివినా నిజానికి నాకంటే ఎక్కువగా బంగార్రాజు కష్టబడ్డాడని చెప్పక తప్పదు. సరే... మొత్తానికి ఇద్దరం పరీక్షకి హాజరయ్యాం. ఇద్దరం బాగానే రాశాం కూడా.

నెల తర్వాత రిజల్ట్స్ వచ్చినాయ్.

నేను సెకండరీ గ్రేడ్ టీచర్‌గా సెలక్ట్ అయ్యాను. బంగార్రాజుమాత్రం ఈసారికూడా విఫలమయ్యాడు. వాడి బాధ చెప్పతరం కాకుండాపోయింది.

ఎవరు ఎన్నిరకాలుగా ఓదార్చినా వాడు సమాధానపడలేదు. కాలమే వాడికి ఉపశమనం కలిగించాలని భావించాం. మా ఊరికి దగ్గర్లోనే మరో ఊళ్ళో నాకు పోస్టింగ్ వచ్చింది. కాలం గడుస్తోంది.

బంగార్రాజు బాధనుండి తేరుకుని బ్యాంక్ టెస్టులనీ, గ్రూపులనీ, ఆర్.ఆర్. బి అనీ ఇలా అన్నిరకాల గవర్నమెంట్ ఉద్యోగాలకూ అప్లయ్ చేస్తూ తన ప్రయత్నాలు కొనసాగించాడు.

సంవత్సరాలు గడిచిపోతున్నాయి. కానీ వాడికి గవర్నమెంటు ఉద్యోగం మాత్రం ప్రాప్తం కాలేదు. ఈలోగా వాళ్ళ నాన్న అనారోగ్యంతో చనిపోయాడు. అది వాడికి కోలుకోలేని దెబ్బ. తండ్రి బ్రతికుండగా తను గవర్నమెంటు జాబు సంపాదించుకోలేకపోయినందుకు వాడు చాలా బాధపడ్డాడు.

"గవర్నమెంట్ ఉద్యోగం అంటూ అలా ఉండిపోకు... ముందైతే ఏదో ఒకటి చేసి స్థిరపడ్డానికి ప్రయత్నించు.." అన్నాను.



"అయితే ఏం చెయ్యమంటావ్?" అనడిగాడు. వాడికి ప్రైవేటు ఉద్యోగంలో జాయిన్ కావడం ఇష్టం లేదు. ఆ సంగతి నాకు బాగా తెలుసు.

"ఎలాగూ టీచర్ ట్రైనింగ్ చేశావుగా... మనూళ్ళోగానీ, చుట్టుపక్కల వూళ్ళలోగానీ కాన్వెంట్ లేదు. అందువల్ల నువ్వే ఓ కాన్వెంట్‌పెడితే ఎలా ఉంటుంది? కాన్వెంట్ పెట్టాక కూడా జాబ్ ట్రయల్స్ చెయ్యొచ్చు... ముందైతే ఏదోలా స్థిరపడాలి కదా..." అన్నాను.

నా మాటలు వాడిలో ఆలోచనను రేకెత్తించాయి. కాన్వెంట్ ఏర్పాటుచేసే ప్రయత్నాలు చేశాడు. సక్సెస్ అయ్యాడు కూడా.

అప్పటికే నాకు పెళ్ళయింది. కాన్వెంట్ బాగానే నడుస్తోంది అన్న నమ్మకం వచ్చినతర్వాత వాడుకూడా పెళ్ళి చేసుకున్నాడు.సెకండరీ గ్రేడ్ టీచర్‌నుండి హైస్కూల్‌లో సబ్జెక్ట్ టీచర్‌గా నాకు ప్రమోషన్‌వచ్చింది. కాలం ఎంత తొందరగా గడిచిపోతుందో తల్చుకుంటే ఒక్కోసారి ఆశ్చర్యంగా అనిపిస్తుంది.

సంవత్సరాలు ఇట్టే గిర్రున తిరిగిపోతున్నాయి. మా చుట్టూ ఎన్ని మార్పులు వచ్చినా బంగార్రాజుతో నా స్నేహం మాత్రం అలాగే వుంది.

వయసు పెరుగుతున్నా ఎందుకో బాల్యమిత్రులు కలుసుకున్నప్పుడు ఏ తేడాలేకుండా అంతా అలాగే ఉన్నట్టనిపిస్తుంది. ఒకరోజు నేను, బంగార్రాజు మా వూరి చెరువు గట్టుమీద కూర్చుని వున్నాం.

ఆ వేళ వాడి పుట్టినరోజు. చీకటి పడి అప్పటికే చాలాసేపైంది. ఎప్పటిలాగే దారీతెన్నూ లేకుండా ఏవేవో విషయాల మీద మాట్లాడుకున్నాం.

"ఇంక పద పోదాం..." అన్నాను నేను.

"ఉండరా..ఇంకాస్సేపు కూర్చుందాం..." అన్నాడు వాడు. సాధారణంగా వాడే ముందు దారితీస్తాడు. అలాంటిది ఇవాళ నేను వెళ్దామంటున్నా ఇంకా ఉందామంటున్నాడేమిటో అనుకున్నాను.

ఆకాశంలో నిండు చంద్రుడు ప్రకాశిస్తున్నాడు.

"ఇవాళ పౌర్ణమి కాబోలు" అన్నాను. వాడేమీ మాట్లాడలేదు. ఏదో ఆలోచనలో వున్నాడు.

# నగరానికి అండగా ద్వారకా తిరుమలరావు




విజయవాడనగరానికి కొత్తపోలీస్ కమిషనర్‌గా వస్తూనే, అనుక్షణం ప్రజలకు అందుబాటులో వుంటానంటూ భరోసాఇచ్చారు ద్వారకా తిరుమలరావు. సి.ఐ.డి అధిపతిగా వున్న ఆయన విజయవాడ సి.పిగా బాధ్యతలు స్వీకరించారు. సి.ఐ.డి విభాగంలో ఉన్నప్పుడే నగరానికి సంబంధించిన అనేక క్లిష్టమైన కేసులను సమర్థవంతంగా దర్యాప్తు చేసిన అనుభవం ఆయనకు ఉంది.

నాలుగేళ్ళుగా విజయవాడలోనే ఉంటూ విధులకు హాజరయ్యే ద్వారకా తిరుమలరావుకు ఇక్కడి సమస్యలు, అవసరాలపట్ల సంపూర్ణ అవగాహన వుంది.

ముఖ్యంగా ట్రాఫిక్ సమస్యల్లో నగర ప్రజలు నిత్యం చిక్కుకుపోతూ సతమతం అవుతున్నారు. ప్రోటోకాల్, బందోబస్తులు, ఎస్కార్ట్ వంటి బాధ్య తలు పోలీసుశాఖకు పెరిగాయి.

నిఘా వైఫల్యాలు, కొందరు పోలీసులపై ఆరోపణలు, కాల్‌మనీ వ్యవహారాలు, భూకబ్జాలు, బ్లేడ్ బ్యాచ్‌లు,పట్టపగలు దోపిడీలువంటి అనేక సమస్యలున్నాయి. వీటన్నింటినీ సునిశితంగా ప్రస్తావిస్తూ, తన శక్తివంచన లేకుండా ఎదుర్కోగలనని బాధ్యతలు స్వీకరించగానే చెప్పి, ప్రజల గుండెల్లోని గుబులు తొలగించారు.

తాను, ఇతర పోలీసు సిబ్బంది అందరం ఇరవై నాలుగుగంటలూ అందుబాటులో వుంటామంటూ ప్రజలపై ఆశల పన్నీరు జల్లారు.1989 ఐ.పి.ఎస్. బ్యాచ్‌కు చెందిన ద్వారకా తిరుమలరావు ఇప్పటి దాకా తాను పనిచేసిన అన్ని పోస్టులకూ వన్నె తెచ్చారు. అనేక పోలీసు పతకాలు అందుకున్న నిజాయితీ, నిబద్ధతలు కలిగిన అధికారి.

ఎప్పటికప్పుడు ఏవోక సమస్యల్లో చుట్టుకుపోతూ, నలిగిపోయే నగర ప్రజకు ఆయన మరో ఆశల ఊపిరి అయ్యారు. తమకే కష్టం, నష్టం వాటిల్లినా అండగా వుండి ఆదుకోగలనన్న వారి నమ్మకానికి ఆయన బాసట అవుతారని ఆశిద్దాం. ◆

చెరువు నీటిలో చంద్రుడు తారాట్లాడుతున్నాడు. బంగార్రాజు వైపు చూశాను. వాడు ప్రకృతిని ఆస్వాదించడంలేదు. వాడి ఆలోచన ఎక్కడో వుంది. నాతో ఏదో చెప్పాలని సందేహిస్తున్నాడా అనిపించింది. ఏం చెప్పాలనుకుంటున్నాడో అర్థంకాలేదు.

కాసేపటి తర్వాత అన్నాడు... "ఒక అధ్యాయం ముగిసిపోయిందిరా..." అని. నాకేమీ అర్థంకాలేదు. ఏం ముగిసిపోయింది? అని అడిగాను.

"నువ్వు జాబ్ చేస్తున్నావు కదా... ఇలాంటి విషయాలు నీకు గుర్తుండవు. ఈరోజుతో గవర్నమెంటు జాబ్‌కు నేనింక పనికిరాను. వయసు దాటిపోయింది" వాడి కంఠం ఏదోలా పలికింది.

నాకు ఒక్కసారిగా షాక్ కొట్టినట్టయ్యింది. అవునా.. ఈ విషయమే నేను గుర్తించలేదు. అందుకేనా ఈ మధ్య వీడు మాట్లాడుతూ మాట్లాడుతూ ఏదో ఆలోచనలోకి వెళ్ళిపోతున్నాడు. అసలు విషయం ఇప్పుడు అర్థమైంది. నాకేమనాలో తోచలేదు. వాడి కల ఆఖరికి ఇలా ముగిసిపోతుందనుకోలేదు.

"పోనీలేరా... దానిగురించే ఎందుకు ఆలోచిస్తావు? నువ్వు పెట్టిన కాన్వెంటు మంచి లాభాల్లో నడుస్తుంది. గవర్నమెంటు జాబు చాలామంది సంపాదించొచ్చు. కానీ ఇలా సొంతంగా ఏదైనా చేసి సక్సెస్ సాధించడం అందరివల్లా అయ్యే పనికాదు" అన్నాను.

వాడు బాధపడుతున్నాడని నాకు తెలుసు.

కానీ అప్పటికి అంతకంటే వాడిని ఎలా ఓదార్చాలో నాకు అర్థంకాలేదు. "పద పోదాం.." అన్నాడు వాడు లేచి నిలబడుతూ.

ఇంతకుముందులా దేనికైనా ప్రిపేర్ అవ్వాల్సిన అవసరం లేదు కాబట్టి సమయాన్నంతా కాన్వెంట్ కోసమే వెచ్చిస్తూ దాన్ని మరింత వృద్ధిలోనికి తీసుకువచ్చే ప్రణాళికలు వేసుకుంటున్నాడు. ఈ విషయం నాకు చాలా ఆనందాన్ని కలిగించింది.

అంతా బాగానే ఉందికదా అనుకునేసరికి విధి మన జీవితంలో ఏదో ఒక దెబ్బ కొట్టడానికి సిద్ధంగా ఉంటుంది కాబోలు... బంగార్రాజు అన్నివిధాలుగా బాగున్నాడు అనేసరికి వాడికి కళ్ళ జబ్బొచ్చింది.

'గ్లకోమా' అనే కంటిజబ్బు వాడిని పీడించింది. దాంతో వాడు చూపు కోల్పోలేదుగానీ అంత పనీ అయింది. చాలావరకూ దృష్టి తగ్గిపోయింది. చికిత్స వల్ల పూర్తిగా కంటిచూపు పోకుండా నిలబడింది.

మొత్తానికి అదే ఎంతో అదృష్టమని భావించవలసివచ్చింది. వాడికి భూతద్దాలు సంప్రాప్తమయ్యాయి. కొంతకాలం అయ్యాక బంగార్రాజుకి ఆ స్థితి అలవాటైపోయింది. మరో రెండేళ్ళు గడిచాయి.

ఓరోజు నేను చిన్న పనుండి ట్రెజరీ ఆఫీసుకి వెళ్ళాను. మామూలుగా మా జీతాల బిల్లుల కోసం అక్కడికి అప్పుడప్పుడూ వెళ్ళాల్సివస్తుంది కాబట్టి ఆ ఆఫీసులో అందరూ నాకు పరిచయమే. అయితే అప్పుడు అక్కడ ఇంకో కొత్తవ్యక్తిని చూశాను.

"ఈయన కొత్తగా జాయినయ్యారా?" అక్కడి క్లర్క్‌ను అడిగాను. "అవును..." చెప్పాడు క్లర్క్.

"ఎక్కడ్నుంచి వచ్చారు?" అనడిగాను.

నా ఉద్దేశ్యం ఆయన ఏ ట్రెజరీ నుంచి ట్రాన్స్‌ఫర్ మీద ఇక్కడకు వచ్చారు? అని.

"ఆయన ట్రాన్స్‌ఫర్ మీద రాలేదు. కొత్త రిక్రూట్‌మెంట్" నవ్వుతూ చెప్పాడు క్లర్క్.

"పెద్దతనిలా వున్నాడు... ఇప్పుడు పోస్టింగ్ వచ్చిందా?" కొద్దిగా ఆశ్చర్యంగా అడిగాను.

"బ్యాక్‌లాగ్ పోస్టులు ఫిలప్ చేశారు. అందులో మన ట్రెజరీకి ఒక పోస్టు వచ్చింది..." చెప్పాడు.

"ఆయనకి పెద్దగా పని చెప్పం.ఎందుకంటే ఆయనకి సరిగా కనబడదు. దృష్టిలోపం నలభై శాతం... అంతకన్నా ఎక్కువగా ఉంటే విజువల్లీ ఛాలెంజ్డ్ కోటాలో పోస్టుకి అర్హత వుంటుంది. ఆ కోటాలోనే ఆయనకి జాబ్ వచ్చింది. వాళ్ళకు ఏజ్ రిలాక్సేషన్ కూడా మామూలుకన్నా పది సంవత్సరాలు ఎక్కువ వుంటుంది" మళ్ళీ చెప్పాడు.

అది విన్నవెంటనే నా మైండ్‌లోఏదోమెరిసింది. నేను చెప్పిన విషయం విన్నాక బంగార్రాజు ఆలోచనలో పడ్డాడు."ఇప్పుడు దృష్టిలోపం వున్నట్టు సర్టిఫికెట్ చేయించాలా? స్పెషల్ బ్యాక్‌లాగ్ పోస్టులు భర్తీచేసినప్పుడు అవకాశం ఉంటుందంటావా?

ఇదంతా జరిగే పనేనా?" అపనమ్మకంగా అన్నాడు.

"ఏమో జరిగేదంతా మన మంచికే అంటారు. ఆ రకంగా చూస్తే నీకు గవర్నమెంట్ ఉద్యోగం నిజంగా రాసిపెట్టుందేమో? సర్టిఫికెట్ వలన దాదాపు ఇంకో ఎనిమిది సంవత్సరాల పాటు నీకు ఏజ్ రిలాక్సేషన్ ఉంటుంది. ఈలోగా పోస్టులు పడొచ్చు కదా... అలా గనుక జరిగితే ఆ రిజర్వేషన్‌లో ఉద్యోగం సంపాదించడం పెద్ద కష్టం కాకపోవచ్చు" అన్నాను.

"సరే... చూద్దాం" అన్నాడు వాడు.

మొత్తానికి నేనే పట్టుబట్టి వాడితోపాటు తిరిగి ఆ సర్టిఫికెట్ చేయించేవరకూ వదల్లేదు. యాభై శాతం దృష్టిలోపం వున్నట్టుగా సర్టిఫికెట్ వచ్చింది.

బంగార్రాజు మాట ఎలా వున్నా నేను మాత్రం బ్యాక్‌లాగ్ పోస్టుల భర్తీకోసం ఎదురు చూడసాగాను. అయితే తర్వాత జరిగిన పరిణామాలు అంత సంతృప్తికరంగా అనిపించలేదు.

ఎందుకంటే ఓసారి ఓ డిపార్ట్‌మెంట్‌లో బ్యాక్‌లాగ్ పోస్టులు పడ్డాయి. కానీ అందులో విజువల్లీ ఛాలెంజ్డ్‌కి పోస్టులు లేవు. మరోసారి ఇంకో డిపార్ట్‌మెంట్‌లో కూడా బ్యాక్‌లాగ్ తీశారుగానీ ఆ కేటగిరీలో ఒకే ఒక పోస్టు ఉంది. బంగార్రాజు అప్లయ్ చేశాడు గానీ అది కూడా వాడికి రాలేదు.

ఇదంతా చూశాక అసలు నేను బంగార్రాజులో లేనిపోని ఆశలు రేకెత్తించానా? మర్చిపోయిన విషయాన్ని మళ్ళీ కదిపానా? అనిపించింది.

కానీ నిజంగా అవకాశం అంటూ రావొచ్చుగదా... అలాంటప్పుడు మిస్సయితే అనవసరంగా పోస్టు పోయినట్టే కదా... అనుకున్నాడు.

గుప్పెట్లో పట్టుకున్న ఇసుక చేతివేళ్ళ సందుల్లోంచీ జారిపోయినట్టు తెలీకుండా కాలం గడిచిపోతూనే ఉంది. బంగార్రాజుకి నలభై ఎనిమిదేళ్ళొచ్చాయ్.

అప్పుడొచ్చిందో అవకాశం. ఇరిగేషన్ డిపార్ట్‌మెంట్‌లో జూనియర్ అసిస్టెంట్ పోస్టులు పడ్డాయ్. విజువల్లీ చాలెంజ్డ్ కోటాలో ఒకే ఒక పోస్టుంది.

బంగార్రాజు ఆ నోటిఫికేషన్ చూడలేదుగానీ నేనే చూసి వాడిచేత అప్లయ్ చేయించాను. వాడు ఉదాసీనంగానే అప్లయ్ చేశాడు.

ఈసారి మాత్రం బంగార్రాజుకి అన్ని అవకాశాలూ కలిసివచ్చాయి. ఆ పోస్టుకి ముగ్గురు అప్లయ్‌చేశారు. మొదట ప్రొవిజనల్ సెలక్షన్ లిస్టు ప్రకటించారు. అందులో ముగ్గురి పేర్లు వున్నాయి. తర్వాత మెడికల్ టెస్టు జరిగింది.

ప్రతిపక్షాల తరఫున ప్రధాని అభ్యర్థి రాహుల్‌గాంధీ ఒక్కరే కాదు... చాలామంది వున్నారు.
-తేజస్వీ యాదవ్, ఆర్.జె.డి. నేత

అందులో బంగార్రాజుతోపాటు ఇంకొకాయన క్వాలిఫైఅయ్యారు. మరొకరు దృష్టిలోపం తగినంత పర్సెంటేజ్ లేని కారణంగా తప్పుకోవలసివచ్చింది. అంటే ఇంటర్వ్యూకి సెలక్టయిన వాళ్ళు ఇద్దరే.

అందులో బంగార్రాజు ఒకడు. చివరి సెలక్షన్ ఏ విధంగా జరుగుతుందో కనుక్కున్నాం.

డిగ్రీ క్వాలిఫికేషన్ ఇచ్చారు కాబట్టి అందులో ఎవరికి ఎక్కువ మార్కులు వస్తే వాళ్ళకు ఆ పోస్టు ఇస్తారట. ఇద్దరిలో బంగార్రాజుకే ఎక్కువ మార్కులువున్నాయి. అంటే ఈసారి బంగార్రాజుకి పోస్టు రావడం గ్యారంటీ అని తేలిపోయింది.

బంగార్రాజుకి ఎగ్జయిట్‌మెంట్ వుందో లేదో గానీ నాకు మాత్రం ఇంటర్వ్యూ ఎప్పుడెప్పుడా అన్న ఆత్రుత కలిగింది.

చివరికి ఇంటర్వ్యూ తేదీ కూడా ప్రకటించారు. అయితే అదే రోజు ఉదయం విజయవాడలో దగ్గర బంధువులపెళ్ళికి నేను హాజరుకావలసివుంది.

అందువల్ల ముందురోజు రాత్రే బయల్దేరి వెళ్ళాను. వెళ్ళడం వెళ్ళానుగానీ మనసంతా ఇటే వుంది. ఈసారి మిస్సవడానికి లేదు.

మొత్తానికి నలభై ఎనిమిదేళ్ళకి బంగార్రాజుకి గవర్నమెంట్ ఉద్యోగం ప్రాప్తించబోతోంది! పెళ్ళికి హాజరయ్యాక మరుసటి రోజు మధ్యాహ్నం భోజనం చేసి నేను తిరిగి వెనక్కి వచ్చేందుకు సిద్ధమయ్యాను. సాయంత్రం ఇంటికి వెళ్ళగానే కాస్త రిఫ్రెష్ అయ్యి వెంటనే బంగార్రాజు ఇంటికి వెళ్ళాను.

వాడు ఇంటి దగ్గరే వున్నాడు. ఎప్పట్లాగే వాడి మొహంలో ఎలాంటి భావోద్వేగం లేదు. ప్రశాంతంగా వున్నాడు. "ఇంటర్వ్యూ ఏమైంది... జాబ్ వచ్చిందా?" ఎంత కాదనుకున్నా నా కంఠంలో ఆత్రుత ధ్వనించింది. "వచ్చింది..." చెప్పాడు.

ఇంకా ఏదో చెప్పబోతుండగా నేను అడ్డుకుని "నాకు తెలుసురా... తప్పకుండా వస్తుంది. ఈసారి మిస్సవడానికి ఛాన్సే లేదు. మొత్తానికి అనుకున్నది సాధించావ్. నీ జీవితాశయం నెరవేరింది..." అదేదో నేనే సాధించినంత ఉద్వేగంగా అన్నాను.

"ఆగు... ఆగు... మరీ అంత ఎగ్జయిట్ అవ్వకు... ఉద్యోగం వచ్చినమాట నిజమేగానీ నేను వద్దనుకున్నాను.అలాఅని రాసి ఇచ్చేసి వచ్చేశాను" అన్నాడు. ఒక్కక్షణం వాడన్నదేమిటో నాకు అర్థం కాలేదు.

"ఏమంటున్నావ్‌రా?"అయోమయంగా అడిగాను. "అదే... చెప్పాను గదా... ఉద్యోగం వద్దనుకుని వదిలేశాను..." అన్నాడు.

నాకు బుర్ర తిరుగుతున్నట్టు అనిపించింది. ఎన్నాళ్ళనుంచో... ఎన్నేళ్ళనుంచో ఎదురుచూసిన అవకాశం... వదిలేయడమేమిటి?"ఎందుకని?" గొంతు పెగుల్చుకుని అడిగాను.

"నువ్వన్నది నిజమే. ఆ ఉద్యోగం నాకు జీవితాశయం.కానీ నాతోపాటు ఇంటర్వ్యూకి హాజరైన రెండో అతనికి అది జీవితావసరం... అంటే అతని జీవితానికి ఆ ఉద్యోగం అత్యవసరం! ఎన్నోళ్ళుగానో పనిచేసిన కంపెనీ.. నష్టాలు రావడం మూలంగా ఈ మధ్యనే మూతపడిందట...

ఉద్యోగం పోయిందట. ఆ కంపెనీలో మేనేజర్‌తో సహా అంతా ఈయన పట్ల సానుభూతితో ఉండేవారట. ఈయన చెయ్యగలిగిన పనినే ఇచ్చేవారట. దానిక్కారణం ఈయన నెమ్మదితనం... దృష్టితక్కువగా ఉండటం... ఇప్పుడు ఈ వయసులో ఆయనకి ఉద్యోగం మళ్ళీ ఎవరిస్తారు? కుటుంబం పస్తులతో ఉంటోందట.

భార్య, ఇద్దరు పిల్లలు, రోగిష్టి తల్లి... కుటుంబాన్ని పోషించడం కోసం ఆఖరికి కూలి పనిచెయ్యడానికి కూడా సిద్ధమయ్యాడట. శరీరం సహకరించలేదు. దానికి తోడు దృష్టిలోపం.

ఆ ఉద్యోగం కోసం ఎన్నో ఆశలు పెట్టుకున్నాడట... కానీ లిస్టుచూశాక తనకి రాదు అన్న సంగతి అర్థమైపోయిందట. అయినా ఇంటర్వ్యూకి పిలిచారు కాబట్టి వచ్చాడు.

ఈ విషయాలన్నీ ఆయన కోరి నాతో చెప్పలేదు. నేనే ఆయనతో మాట కలిపినప్పుడు చెప్పాడు.

ఆయన పరిస్థితి చూసి చలించిపోయాను. నేను అంతో ఇంతో మంచి స్థితిలోనే వున్నాను. కాన్వెంటు లాభాల్లో నడుస్తోంది. ఈ ఉద్యోగం రాకపోతే నేను పెద్దగా నష్టపోయేది ఏమీ ఉండదు.



## దక్షిణాది రహదారి

తెలుగులో 'నర్తనశాల'తో కెరీర్ ఆరంభించిన కాశ్మీర పరదేశికి దక్షిణాది రహదారి బావున్నట్లే ఉంది. ఓ తమిళ చిత్రానికి ఎంపికయింది.

కాశ్మీర్ ఎక్స్‌ప్రెషన్లు, తమిళ నిర్మాతలకు తెగ నచ్చేశాయట. ముంబయిలో నిఫ్ట్ గ్రాడ్యుయేట్ అయిన కాశ్మీర పరదేశీ త్వరలోనే తమిళ క్లాసులు ఆరంభించనున్నది.

యాడ్ ఫిల్మ్స్‌లో కాశ్మీర హావభావాలు, అందచందాలు బావున్నాయన్నది టాక్. తెలుగు సినిమా పూర్తిచేసేసి, ఫలితాల కోసం వెయిటింగ్.

అందుకే లోపలికి వెళ్ళి ఈ ఉద్యోగం నాకు అవసరంలేదని రాసిచ్చేశాను. ఇంక అతనికి ఎలాంటి ఆటంకం ఉండకూడదు అన్న ఉద్దేశ్యంతోనే అలా చేశాను. ఉద్యోగం అతనికే ఖాయమైంది. నా కాన్వెంటులో ఇప్పటికి పదిమందికి ఉద్యోగాలిచ్చాను.

ఒకరకంగా ఇప్పుడు కూడా నేను మరొకరికి ఉద్యోగం ఇచ్చాను. గవర్నమెంటు ఉద్యోగం! ఆ పది ఉద్యోగాలిచ్చినప్పటికంటే ఎక్కువ సంతృప్తి ఇప్పుడు దొరికింది!" చెప్పడం ముగించాడు.

ఏం చెప్పాలో ఏమనాలో ఏం స్పందించాలో తెలీక ఒక్కసారిగా ఉన్నతంగా ఎదిగిపోయిన వాడ్ని అలాగే చూస్తుండిపోయాను.

మూడేళ్ళనాడు కన్నడ సినిమాతో గ్లామర్ ప్రపంచంలోకి కాలుపెట్టిన బెంగళూరు భామ రన్యారావుకు ఆదినుంచి సినిమాల ఆలోచనలే వుండేవి. చదువుకంటే నటనే ఆమె ప్రాధాన్యంగా వుండేది. కన్నడ, తమిళ సినిమాల అనుభవంతో తెలుగులోకీ దూసుకువచ్చింది. 'ఆయుష్మాన్‌భవ'లో ఆమె ఓ తార. తనతో ఇంటర్వ్యూ విశేషాలు:

**నటన ఎప్పుడూ మీ ప్రాధాన్యంగానే ఉందా?**

అవును. నేనెప్పుడూ నటిని కావాలనే కోరుకునే దాన్ని. బాల్యంలో సైతం అదే కోరిక. అకడమిక్‌కంటే ఇతర అదనపు కార్యక్రమాల్లోనే చురుగ్గా వుండేదాన్ని. మార్షల్ ఆర్ట్స్,డ్యాన్స్‌లలో శిక్షణ తీసుకున్నాను.

ప్లస్ 2 తర్వాత నటిని కావాలన్న నా కోరిక దృఢ పడింది. నటన నా తొలి ప్రాధాన్యంగా నిలిచింది.



రంగురంగుల దుస్తులు ధరించి స్టేజ్ మీద కనపడ్డం ఇష్టంగా వుండేది.

**చదువు కొనసాగించారు కదా?**

నా తల్లిదండ్రుల బలవంతంతో ఇంజినీరింగ్‌లో చేరాను. కాని, చదువుపట్ల నాకు అస్సలు ఆసక్తి లేదని ప్రతిరోజూ మా అమ్మానాన్నల ముందు గొణిగేదాన్ని.

నేను గ్రాడ్యుయేషన్‌లో చేరాక ఆరునెలల తర్వాత నటన నా ప్యాషన్ అని వాళ్ళు అర్థం చేసుకుని, నన్ను సపోర్ట్ చేయాలని నిర్ణయించుకున్నారు.

ఇంజినీరింగ్‌కు స్వస్తి చెప్పి, ముంబయి వెళ్ళిపోయా. నాలుగు నెలలు నటనలో శిక్షణ తీసుకున్నాను. అదే సమయంలో నా తొలి పోర్ట్‌ఫోలియో విడుదలయింది. నా ఫోటోలు సుదీప్‌కు అందాయి. ఆయన నన్ను ఆడిషన్‌కు పిలిచారు. అలా కన్నడ సినిమా 'మాణిక్య' చేసేశాను.

**తమిళ పరిశ్రమకూ వెళ్ళారు కదా?**

'వాఘా' నా తొలి తమిళ సినిమా. ఇది మరో అనుభవం. భాష నాకు కొత్త. నేను ఆడిషన్‌కు వెళ్ళినప్పుడు నా ఎమోషన్స్లు, ఎక్స్‌ప్రెషన్ల విషయంలో దర్శకుడు చాలా పర్టిక్యులర్‌గా ఉన్నారు.

దాంతో యూనిట్ భాషపరంగా నన్ను సిద్ధంచేసే ప్రయత్నాలు సాగించింది. 'మాణిక్య' గ్లామరస్ రోల్.

'వాఘా'లో అన్ని కోణాలూ వుంటాయి. అంటే పూర్తి ప్యాకేజ్ అన్నమాట.

**షూటింగ్‌లో బాగా కష్టపడ్డారా?**

చాలా.కాశ్మీర్‌లో మైనస్ 15 డిగ్రీల్లో షూటింగ్‌లో పాల్గొన్నాను. హై ఆల్టి ట్యూడ్స్‌లో షూటింగ్ కావడంవల్ల ట్రెక్ చేయాల్సివచ్చింది.

కాని, మామూలుగా నాకు చలి పడదు. నా టీమ్‌కు ఈ విషయంలో కృతజ్ఞతలు చెప్పుకోవాలి.

ప్రతిఒక్కరూ గొప్ప జాబ్‌చేశారు. ఒకరినొకరుమోటివేట్ చేసుకున్నారు.

ఎముకలు కొరికే చలిలో భారీ ఎక్విప్‌మెంట్‌ను టెక్నీషియన్లు ఎలా

**బాల్యంలో క్రష్‌లు ఏవీ లేవా?**

నేను గార్ల్స్ బోర్డింగ్‌స్కూల్లో చదువు కున్నాను. ప్లస్ 2లో కో-ఎడ్యుకేషన్. కాని, నా కరిక్యులర్ కార్యకలాపాల్లో ఆటలాడుతూ, పరిగెడుతూ టామ్ బాయ్ మాదిరి వుండేదాన్ని.

కొన్ని ప్రపోజల్స్ వచ్చాయను కోండి. అయితే ఇటువంటి విషయాలపట్ల షైగా వుండే దాన్ని. ఎవరైనా ఇటువంటి కబుర్లు చెప్తే, అక్కడినుంచి పరుగుతీసేదాన్ని.

**ఖాళీసమయాల్లోఏం చేస్తారు?**

నాకు పళ్ళియట్రైవ్స్, ఏరియల్ యోగా ఇష్టం. నా పర్సనాలిటీని షేప్ చేయడంలో సహకరించిన కొత్త



# నటనపట్లే తహతహ

మోశారా? అని అబ్బురపడ్డాను. ఇటువంటి విషయాలు నన్ను మోటివేట్ చేశాయి. ఆరోగ్యం కొంత దెబ్బతిన్నది. పాత్రవల్ల కొన్ని సంశయాలు తొల గించుకున్నాననుకోండి.

**తెరపై మిమ్మల్ని చూశాక మీ స్నేహితుల స్పందన ఎలా ఉంది?**

చాలా థ్రిల్లయ్యారు. పూర్తిగా మారిపోయిన నా రూపం చూసి ఆశ్చర్య పోయారు. ఇది నిజంగా నువ్వేనా! అని అడిగారు. అయితే, స్కూలురోజుల్నుంచీకూడా ఈ ఫీల్డ్ అంటే నాకెంత ఇష్టమో వారికి తెలుసు కదా.

**మీకు కాలేజీని, స్నేహితులని మిస్సయ్యానన్న ఫీలింగ్ ఉందా?**

(నవ్వేస్తూ) ఆ... ఉంది. క్లాసులు ఎగ్గొట్టడాలు, స్నేహితులతో సరదాలు మిస్సయ్యాకదా.

అయితే, నా దృష్టిఅంతా నటనపైన ఉంది కాబట్టి, దానికోసం ఏది వది లేసుకున్నా ఫీలవలేదు. బహుశా,అసలు ఇంజినీరింగ్ నాకు సూటవదు.



గుర్తింపులు, కొత్త ప్రదేశాలకు వెళ్ళడం, ప్రయాణాలు చేయడం నాకు ఇష్టం.

మిగతా చాలామంది అమ్మాయిల్లాగే బ్యాగ్‌లు, వాచీలు ఇష్టపడుతుంటాను. ఎప్పుడు ఛాన్స్ చిక్కినా బాస్కెట్‌బాల్ ఆడుతుంటా. డ్యాన్స్ కూడా బాగా ప్రాక్టీస్ చేస్తాను.

**ఎటువంటిపాత్రలు ఇష్టపడతారు?**

నేనింకా చిన్నదాన్ని. ఈ దశలోనే మహిళా ప్రాధాన్యంగల పాత్రలు చేయాలని కోరుకోలేను.

నా వయస్సుకు తగ్గ పాత్రలు చేయాలనుకుంటున్నాను. బబ్లీ, క్యూట్ గాళ్ పాత్రలు నాకు ఇష్టం.

**మొదటి సినిమాలోనే పెద్దనటులతో కలిసిపనిచేయడం ఎలావుంది?**

నేను చాలా కాన్ఫిడెంట్‌గానే వున్నా. వాస్తవం విభిన్నంగా వుంటుందికదా.

నేను మొదట్లో షూటింగ్‌లో చాలా జాప్యం చేసేదాన్ని. నా పనిలో సీరియస్‌నెస్ కనపడిందన్న దర్శకుడి మాటలు నాకు స్ఫూర్తి అయ్యాయి అంటూ ముగించింది రన్యారావు.

**అయినపూరి సుజాత**

ఇలా నిర్ధారించుకున్న తర్వాత ఇప్పుడు అమ్మని బతికించుకోవడం ఎలా! సర్జరీకి ఏర్పాటుచెయ్యడం ఎలా! అనే సమాధానం లేని ప్రశ్న మనసుని తొలిచేస్తుంటే కళ్ళవెంబడి నీటిధార కట్టింది. తన అశక్తతకు ఎవరిని నిందించాలో అర్థంకావట్లేదు.

చేజేతులారా అమ్మని చంపుకోవాలా! అన్న ప్రశ్నకు స్పందించేవారెవరో తెలీడంలేదు. ఆ మూమెంట్లో ఇందాక వందనకి చేసిన ఫోన్ నెంబర్ నుంచి కాల్ వస్తూండడంతో వెంటనే రిసీవ్ చేసుకుంది నిత్య.

"హలో"

"నేనే వందనని... సార్ మాట్లాడతారంట. లైన్లో ఉండండి"

"అలాగే" నిత్య గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. అడుగంటిన ఆశ మళ్ళీ మెదిలింది. పదిసెకన్ల గ్యాప్‌తో అవతల రమణ మూర్తిగారి గొంతువినబడింది "హలో,నేను రమణమూర్తిని"

"సర్... నేను నిత్యని... చెప్పండి సార్" అంటోంది.

"ఆ నేను మేడమ్‌తో మాట్లాడాను. నువ్వు రావలసిన అవసరము లేదని చెప్పారు" అని చెపుతాడు. ఈ సమాధానంతో ఏదో మూల ఉన్న చిన్న ఆశ కూడా అడుగంటిపోయింది. కొద్ది క్షణాలు మాట్లాడలేకపోయింది. ఈ ఛాన్స్ పోయిందికాబట్టి ఇక ఏం చేయాలన్న ప్రశ్న మనసునిండా వ్యాపిస్తుంది.

"సరేసరే... నో ప్రాబ్లమ్. నేను రిజెక్ట్ చేశానుకాబట్టి వెయిటింగ్ లిస్ట్‌లో ఉన్న అమ్మాయికి ఛాన్స్ ఇచ్చేసి ఉంటారు.

అసలు కొంచెం పాజిటివ్‌గా నేను ప్రవర్తించి డెసిషన్ తీసుకుని ఉండాల్సింది... ఇట్స్ మై మిస్టేక్"

"నువ్వు తప్పుగా అర్థం చేసుకున్నావమ్మా. నన్ను పూర్తిగా చెప్పనీ. నువ్వు ఇక్కడికి రానవసరంలేదు. మీ అమ్మగారిదగ్గరే హాస్పిటల్‌లో ఉండవచ్చు. ఒక వ్యక్తిచేత డబ్బు పంపిస్తాం అని మేడమ్ చెప్పమన్నారు" అన్నాడు.

సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయింది నిత్య. మేడమ్ నుంచి ఈ రకమయిన స్పందనని ఊహించలేదు.

తను సర్జరీ ఏర్పాట్లలో మునిగివుంటానని, అందుకు వీలుగా డబ్బు ఇక్కడికే పంపడం... అసలెలాంటి రాతకోతలు లేకపోయినా డబ్బు ఇవ్వాలనుకోవడం... మేడమ్ విశాల హృదయానికి, తనమీద ఉన్నటువంటి నమ్మకానికి ఎలా రుణం తీర్చుకోవాలా! అన్న ప్రశ్న మనసులో ఉదయిస్తోంది... ఆ కొద్ది క్షణాలలోనే మేడమ్‌కి మనసులోనే వేలవేల కృతజ్ఞతలు చెప్పుకుంది నిత్య.

"సో... అర్థమైంది కదమ్మా... నువ్వు హాస్పిటల్లో ఏర్పాట్లుచూసుకో... మేం పంపించే వ్యక్తి నిన్ను కలిసి డబ్బు అందజేస్తాడు. సర్జరీ అయినతర్వాత రెండు మూడ్రోజుల్లో అంతా సర్దుబాటు చేసుకున్నాక నాకు ఫోన్‌చేస్తే కారు పంపిస్తాను... సరేనా?" రమణమూర్తిగారికి కూడా కృతజ్ఞతలు తెలిపింది.




అమ్మ సర్జరీకి సరిపడా ఏర్పాటు ఇలా ఇంత నాటకీయంగా జరగడం ఆమెకి ఒక్కో క్షణంలో ఇది నిజమేనా! అన్న మీమాంసం కలుగుతోంది. ఇలాగే మిరాకిల్ జరిగినట్లు అమ్మ ఆపరేషన్ కూడా సక్సెస్‌ఫుల్‌గా జరిగి మళ్ళీ నడయాడాలనే మంచి ఊహలు ఆమె మదిలో మెదులుతున్నాయి.

నిత్య సర్దుకున్న బ్యాగులను చెక్ చేసుకుంటుండగా సెల్‌ఫోన్ మోగింది. కాసేపటిక్రితం ఫోన్ చేసిన కారు డ్రైవర్ మళ్ళీ కాల్ చేశాడు "మేడమ్... మీ అపార్ట్‌మెంట్ దగ్గరే ఉన్నానండి. మీరు రెడీ అయ్యాక చెబితే లగేజి పట్టుకోవడానికి ఫ్లాట్ దగ్గరికి వస్తాను"

"నేను రెడీగానే ఉన్నాను. వెంటనే ఫ్లాట్ దగ్గరికి వస్తే లగేజి తీసుకుని బయల్దేరిపోదాం" అంది నిత్య.

ఐదునిమిషాల్లో డ్రైవర్ వచ్చాడు. అతనికి రెండు సూట్‌కేసులు ఇచ్చింది నిత్య. తను ఒక బ్యాగు భుజాన తగిలించుకుని మరో బ్యాగ్ చేతితో పట్టుకుని నడచింది.

సరిగ్గా అరగంటతర్వాత ఊరి పొలిమేరల్లో ఉన్న చౌరస్తా దాటి అరవిందపురం పోయే రోడ్డున కారు పరుగు తీస్తోంది. నాలుగు రోజులక్రితం అమ్మ ఆపరేషన్ సక్సెస్‌ఫుల్‌గా జరగడం, ఆ తర్వాత కూడా నార్మల్‌గా ఉండడంతో నిత్య చాలా ప్రశాంతంగా ఉంది.

హాస్పిటల్‌లో ఇంకో వారం పది రోజుల్లో డిశ్చార్జి చేస్తారు. ఆ తరువాత ఫ్లాట్‌లో అమ్మని ఉంచి పూర్తి నర్సింగ్‌కేర్‌లో ఆరునెలలపాటు ఉంచడానికి దుర్గ ఒక నర్స్‌ని ఏర్పాటు చేస్తానని చెప్పింది.

అంచేత నిత్య అసలేం బెంగపడడం లేదు. ప్రమాదాన్ని దాటి అమ్మ బయటపడటానికి మించిన ఆనందం ఇంకేం లేదామెకు. తనకు ఇంతలా సాయపడిన మేడమ్ రుణం తీర్చుకోవాలన్న ఆరాటాన్ని మనసు వ్యక్తపరుస్తుంది.

మేడమ్ కోరుకుంటున్నట్లు ఆమె కొడుకుని ఎలాగైనా మానసికంగాబాగు

## జరిగిన కథ (4)

జమిందారుగారిని పెళ్ళాడిన పరిస్థితులు, తమకు బాబు పుట్టిన విషయం చెపుతుంది జయప్రభ.

నిత్యను సెలక్ట్ చేసి ఆరునెల్ల కాంట్రాక్ట్ విషయం చెప్పి పాస్‌పోర్ట్, సర్టిఫికెట్లు ఇవ్వాలని చెబుతుంది.

జయప్రభ కొడుకు పేరు నాని. అతనికి పాతికేళ్ళుంటాయి. నానీని వీల్ ఛెయిర్లో తిప్పుతుంటారు ఆ ఇంట్లోని పనివాళ్ళు. నానిది పరిపక్వత లేని మనస్తత్వం. బహుశా అతని ఆలనాపాలనా తను చూడాలేమో అనుకుంటుంది నిత్య.

నాని 'ఆటిజం' అనే వ్యాధిబారిన పడ్డాడని అర్థంచేసుకుంటుంది. నువ్వు ఫారిన్‌లో డాక్టర్ చదివిన దానివి. మా బాబు సమస్యకు పరిష్కారంకనుక్కో. నీకిచ్చిన ఆరు నెల్ల గడువులో నానీని మగాడిని చెయ్యాలి. కోటిరూపాయలిస్తా.

వాడి మగతనాన్ని నిర్ధారణ చెయ్యాలని చెబ్తుంది జయప్రభ. ఆమె చెప్పింది విని షాకవుతుంది నిత్య. మొదట ఆ కాంట్రాక్ట్ విరమించుకుందామనుకుంటుంది. తర్వాత తల్లిని బతికించుకునేందుకు జయప్రభ కండిషన్‌కి ఒప్పుకోవాలని నిర్ణయించుకుంటుంది నిత్య. ఇక చదవండి.

చెయ్యాలని, ఎలాంటి అప్రోచ్ అయితే కరక్టు అన్నది అప్పటికే ఆమె ఆలోచిస్తూ ల్యాప్‌టాప్‌లో రికార్డు చేసుకుంటూ ఒక ప్లాన్ వేసుకుంటోంది.

గంటన్నర ప్రయాణం తర్వాత అరవిందపురం చేరుకున్నారు.

డ్రైవర్ లగేజి తీసుకుని గెస్ట్‌రూమ్‌కి వెళ్ళగా మేమ్‌ని కలవడానికి ల్యాప్‌టాప్ బ్యాగ్‌తో వెళ్ళింది నిత్య.

అరగంట తర్వాత మేడమ్ అపాయింట్‌మెంట్ దొరకడంతో గది లోపలికి వెళ్ళింది. మేడమ్ కుశల ప్రశ్నలు వేసిన తర్వాత నేరుగా డిస్కషన్ టాపిక్‌లోనికొచ్చేసింది.

"సో...నీ వర్రీస్‌నుంచి బయట పడ్డావు కాబట్టి ఇక మన టాస్క్ విషయంలో కాన్సన్‌ట్రేట్ చేస్తావు కదా... రమణమూర్తిగారు ఎగ్రిమెంట్ డాక్యుమెంట్ తయారుచేశారు. దీనిమీద నువ్వు సంతకం చెయ్యాలి"

టీపాయ్‌మీద వున్న ఫైల్ ఫోల్డర్ నుంచి కొన్ని స్టాంపు పేపర్లు బయటికి తీసి నిత్యకి అందించింది జయప్రభ. "ఒకసారి చదువుకుని సంతకం పెట్టాలి కంగారేం లేదు పూర్తిగా చదువుకో ఒకసారి" అని చెప్పింది జయప్రభ.

ఒక పదినిముషాలపాటు డాక్యుమెంటుని చదివింది నిత్య. గతంలో మాట్లాడుకున్న విషయాలే అందులో ఉన్నాయి. లీగల్‌పరంగా ఉండే సాధారణ క్లాజులు ఉన్నాయి.

తాను ఎలాగూ కమిటెడ్‌గా ఈ ఆరునెల్ల ప్రాజెక్టు చెయ్యడానికి మనస్ఫూర్తిగా సిద్ధపడింది. కాబట్టి అతిక్రమిస్తే తీసుకునే న్యాయపరమైన చర్యల ప్రస్తావనవలన సమస్యేం రాదు.

జయప్రభ అప్పటికే సంతకాలు చేసి ఉన్న ఆ డాక్యుమెంట్‌ని మరోసారి గబగబా అటూ ఇటూ తిప్పిచూస్తూ చదివిన నిత్య చివరగా తన సంతకాలు పెట్టింది. తన బ్యాగులోంచి ఒరిజినల్ సర్టిఫికెట్‌లు ఉన్న ఫోల్డర్ తీసి జయప్రభకు అందించింది.

"మేడమ్ మీకు టైమ్ ఉంటే ఒక్క పదినిమిషాలు మాట్లాడతాను" ల్యాప్‌టాప్ తెరిచి ఒక పవర్ పాయింట్ ప్రజెంటేషన్ ఓపెన్ చేసి మేడమ్‌కి కనపడేలా ఉంచింది.

"మేడమ్... గత పాతికేళ్ళుగా ఈ రుగ్మతగురించి మీకు తెల్సినదానితో కంపేర్ చేస్తే నా చదువుకున్న అనుభవం చాలా చాలా తక్కువ. కాకపోతే గత నాల్గురోజులుగా దీన్నిగురించి స్టడీ చేస్తూ ఒక స్ట్రాటజిక్ ఎప్రోచ్‌ని తయారు చేశాను. నేను వర్క్ మొదలెట్టేముందర మీకోసారి చూపిద్దామని వచ్చాను.."

తలూపుతూ గో ఎహెడ్ అన్నట్లుగా సూచించింది జయప్రభ.

"ఆటిజం... ఇది ముఖ్యంగా ఎదుగుదలకు సంబంధించిన రుగ్మత. 'పర్వేసివ్ డెవలప్‌మెంట్ డిజార్డర్' అనే మెడికల్ టెర్మ్‌తో దీన్ని పిలుస్తారు. దీనికి ఒక కారణం అంటూ చెప్పలేం. దీనికి సంబంధించి రకరకాల సిద్ధాంతాలు ఉన్నాయి. మనవరకూ వచ్చేసరికి మానసికమైన ఎదుగుదల లోపమే సమస్య. దీన్నెలా అడ్రస్ చెయ్యాలనేది ప్రశ్న"

ఇలా అంటూనే కొద్ది క్షణాలు ఆగి మళ్ళీ కొనసాగించింది నిత్య "మేడమ్... ఇన్నేళ్ళల్లో మీరు ఎందరో డాక్టర్‌లని సంప్రదించి ఉన్నారు. ఎన్నోరకాల వైద్య విధానాలు వాడారు. ఒకరకంగా చెప్పాలంటే ఇవేవీ పనికిరాలేదు"

"ఎగ్జాక్ట్లీ... అదే నా ఒపీనియన్ కూడా" అంది జయప్రభ.

"అయితే ఇప్పటివరకూ వైద్యం అందించినవాళ్ళు సామాన్యులు కారు. ఈ మెడిసిన్‌లో పెద్ద ప్రొఫెషనల్సూ, హైలీ స్కిల్డ్ డాక్టర్లూ... కేస్ టూ కేస్ మధ్య ఉండే వైరుధ్యాలూ, విభిన్నతకారణంగా మనకి వర్కవుట్ కాలేదు.

ఇలా ఎందుకు చెబుతున్నానంటే ఇప్పటివరకూ వైద్యం అందించినవాళ్ళని చిన్నబుచ్చాలన్నది నా ఉద్దేశ్యం ఎంతమాత్రమూ కాదని చెప్పేందుకు.

ఇక నావరకూ వస్తే నేను జస్ట్ డిగ్రీ పూర్తిచేశాను... ఇంకా పోస్టుగ్రాడ్యుయేషన్ చదువుతున్నా. క్లినికల్ ప్రాక్టిసులో అనుభవం శూన్యం... అయినా సరే, నా ఆలోచనలోని కొత్తదనం పని చేస్తుందేమోనన్న ఆశ..."

"యస్.. డాక్టర్‌ని మార్చినా అదే వైద్యం కొనసాగింది ఇన్నాళ్ళూ. ఇకనైనా కొత్త మార్గంలో ట్రీట్‌మెంట్‌కి ప్రయత్నించాలన్నదే నా మనసులో ఉన్న ఆలోచన కూడా"

"థ్యాంక్స్ మేడమ్.సో ఇవన్నీ దృష్టిలో పెట్టుకుని నా ఆలోచనకి అనుగుణంగా ఇప్పటి స్టేట్ ఆఫ్ మైండ్‌ని గుర్తించి దాన్ని మార్చే ప్రయత్నాలు చెయ్యడానికి ప్రణాళికలు తయారుచేశాను"

నిత్య చాలా కన్విన్సింగ్‌గా చెపుతున్న విషయాలు శ్రద్ధగా వింటోంది జయప్రభ. ఇన్నేళ్ళలో ఈ ఎప్రోచ్‌లో ప్రయత్నాలు కొనసాగించలేదు.కాబట్టి ఇప్పుడీ దారిలో ట్రై చెయ్యడం మంచిదే అన్న అభిప్రాయం ఆమెకి కలిగింది. "గుడ్... నీ ట్రీట్‌మెంట్ అప్రోచ్ గురించి చెప్పు" సూటిప్రశ్న వేసింది జయప్రభ.

ఈ కోణంలో అప్పటికే ఆలోచన చేసి ఉన్న నిత్య వెంటనే సమాధానం ఇచ్చింది. "శారీరకంగా ఎదిగినా మానసికంగా ఐదేళ్ళ దగ్గరే ఉండిపోయాడు నాని. అయితే అన్ని వయసుల జనాల మధ్య పెరుగుతూ అయోమయస్థితిలో ఉండిపోయాడు.అంటే అతను రుగ్మత కారణంగానే కాకుండా ఎన్విరాన్‌మెంట్, పరిసరాల కారణంగా కూడా ఇలాంటి మానసికస్థితిలో ఉండిపోయాడన్నది నా నమ్మకం.

సో... నా స్టయిల్ ఆఫ్ అనాలసిస్ చేస్తూనే, మానిటరింగ్ చేస్తూనే ఐదేళ్ళ నానీని అర్థం చేసుకుంటూనే అతని కన్ఫ్యూజన్ స్టేజ్ నుంచి క్లారిటీ స్టేజ్‌కి మళ్ళించి అలా పదేళ్ళూ, పదిహేనేళ్ళూ, ఇరవైఏళ్ళూ...పాతికేళ్ళ మనోస్థితికి తీసుకొస్తాను. ఇలా ఐదునెలల్లో స్థాయిని మెచ్యూరిటీ లెవల్‌ని సాధారణస్థాయికి తీసుకొస్తాను. ఇక చివరి నెలలో అతని తెలివితేటలకు సానపట్టించి పరిపూర్ణమైన వ్యక్తిగా తీర్చిదిద్దుతాను..."

## చిలిపి

మంచాలమీద దిళ్ళెందుకు?
వాటిక్రింద తాళం చేతులు దాచుకోడానికి.

కాళ్ళకి పారాణి ఎందుకు?
పగుళ్ళు కనిపించకుండా ఉండేందుకు?

జ్ఞాపకశక్తి ఎక్కువగా ఉండేది ఎవరికి?
హోటల్ సర్వర్‌కు.

పెళ్ళిలో చదివింపులు ఎందుకు?
తిన్న తిండి ఖర్చులు వసూలుచేయుటకు.

ఆడవాళ్ళకు తలలో పిన్నులు ఎందుకు?
మెదడు ఎక్కడన్నా జారిపోకుండా ఉండేందుకు.

మెడలో 'టై'లెందుకు?
భార్యలు దగ్గరకు లాగేందుకు.

పిల్లి కళ్ళుమూసు కొని పాలు తాగుతుంది దేనికి?
అందులో బెల్లంగాని, పంచదారగాని లేనందుకు!

పెండ్లి భోజనంలో లడ్డూ ఎందుకు వడ్డిస్తారు?
విస్తరాకు గాలికి ఎగరకుండా ఉండేందుకు.

సిరిసంపదలు, భోగభాగ్యాలు సత్యాన్ని ఆశ్రయించుకునివుంటాయి. 'సత్యాన్నాస్తి పరోధర్మః' సత్యమనే పునాదిపైనే- ధర్మమనే భవనం ఆధారపడివుంది. సత్యం సర్వులకు మాతృమూర్తి. సత్యం నుండే మానవుడు ఆవిర్భవించాడు. సత్య ధర్మాల్నే విజయం వరిస్తుంది.

కొద్దిసేపు మౌనంగా ఉన్నతరువాత తలూపుతూ స్పందించింది జయప్రభ "నీ అప్రోచ్ అయితే బాగానే ఉంది. కానీ చివర్లో అన్నావు చూడూ. పరిపూర్ణమయిన వ్యక్తి అని.

ఈ మాటకాస్త క్లియర్‌గా లేదు. డాక్యుమెంట్లో అంతా వివరంగా ఉంది. ఆర్నెల్ల వ్యవధిలో నానిలో మార్పుని తీసుకురావాలి. వాడి మగతనాన్ని నిర్ధారించాలి.వాడిద్వారా సంతానోత్పత్తి కల్గుతుందని నిరూపించాలి" ఒక్కో పదం ఒత్తిపలుకుతూ అంది జయప్రభ.ఒప్పుకుంటున్నట్లు తల ఊపింది నిత్య.

"గుడ్... ఈ భవనంలో రెండో ఫ్లోర్ మొత్తం నీ కోసం రెడీ చేయించాను. కార్నర్ గదిని నీ పర్సనల్‌కోసం నువ్వు వాడుకోవచ్చు. మధ్య ఉన్న హాల్, మిగిలిన గదులూ, కిచెన్ ఎలా కావాలంటే అలా నీ ప్రాజెక్టుకోసం వాడుకో.

నిన్నెవరూ డిస్టర్బ్ చెయ్యరు. నీకు ఏ అవసరం వచ్చినా ఇంటర్‌కమ్‌లో



కేవలం విలాసవంతమయిన వస్తువులమీద మాత్రమే గరిష్ఠమైన 28 శాతం జి.ఎస్.టి. కొనసాగుతుంది.

-అరుణ్ జైట్లీ, కేంద్రమంత్రి

ఫోన్ చేస్తే నీకు కావలసినవి ఎరేంజ్ చెయ్యడానికి సోమయ్యని ప్రత్యేకంగా పనికోసం పెట్టాను... ఇప్పుడు పని చేస్తున్న టీచర్లూ, ఆయాలూ అందరూ నువ్వు చెప్పినట్లు వింటారు"

మేడమ్‌ని కన్విన్స్ చెయ్యడానికి ప్రయత్నిస్తున్నట్లు మాట్లాడింది నిత్య. "మేడమ్... ఇలాంటి క్లోజ్డ్ రూములు వద్దు. ఆ రోజు నానీని చూట్టానికివెళ్ళాం కదండీ... పంచవటి... అక్కడైతే చాలా మంది పనివాళ్ళూ, వాళ్ళ కుటుంబాల వాళ్ళూ ఉన్నారు. అలాంటి జనంమధ్య ఉంటేనే నానికి త్వరగా నయమవుతుందని నా నమ్మకం. అంతేకాదు, కొన్ని సైకలాజికల్ ట్రీట్‌మెంట్ థియరీల ప్రకారం ఇది కరక్ట్..."

జయప్రభ అటూ ఇటూ ఊగిస లాడుతూ ఆలోచిస్తున్నట్లు నిత్యకు తెలుస్తోంది. అసలు నానీని మామూలు జనాల మధ్య ఉంచడం, అందరిలో తిరిగేలా చెయ్యడం జయప్రభకి ఇష్టంలేదు. అలాగని అంతస్తు లేదా తాహతు మెయిన్‌టెయిన్ చెయ్యాలన్నది ఆమె ఉద్దేశ్యం కాదు.

పరిపక్వత లేని వయసు పిల్లలూ, లేదా ఆలోచన కొరవడిన పెద్దవాళ్ళూ నానిని గేలిచేస్తారని,నవ్వులపాలవడాన్ని కూడా నాని తెలుసుకోలేనితనంవల్ల మరింత అభాసుపాలవుతాడని ఆమె తల్లి మనసు బాధపడుతూంటుంది.

ఆమె మనసులోని ఆలోచనని గ్రహించినట్లుగా మాట్లాడింది నిత్య "ఇన్నేళ్ళుగా పాటించిన పద్ధతులే కొనసాగిస్తే ఇప్పటివరకూ వచ్చినట్లుగానే ఫలితాలు ఉంటాయన్నది నా అభిప్రాయం. అవుటాఫ్ ది బాక్స్ ఐడియా అని మనం ప్రయత్నించాలి.

నాలుగ్గోడలమధ్య ప్రపంచం కనపడదు. ఆ ఒక్కరోజు నేను చూసిన దాన్నిబట్టి అర్థమవుతున్నది ఏంటంటే కొత్త దారంట ప్రయత్నిస్తే నానిలో మంచి మార్పు తీసుకురావచ్చు అని నా పూర్తి నమ్మకం"

జయప్రభ కొంచెం మెత్తబడినట్లు ఉన్నా ఏం మాట్లాడలేదు.

"మేడమ్, నాని నవ్వులపాలైపోతాడని మీరనుకుంటున్నారు. అదికూడా ట్రీట్‌మెంటులో ఒక భాగం అవుతుందని నేననుకుంటున్నాను.

ఒక్క ఆరునెల్లు మనం ఓపికపడితే, దాని కారణంగా మంచి మార్పు రాగల్గితేఆనందమే కదా? అసలు అన్నింటి కంటే ముఖ్యం ఏంటంటే మీ నుంచి కూడా నాని దూరంగా ఉండాలి... మీరు అతనికి ఎదురుపడితే పరోక్షంనుంచే అతనిలో మార్పులని గమనించాలి"

నిత్య నేర్పరితనపు మాటలకి పాజిటివ్‌గా స్పందించింది జయప్రభ.

"సరే... ఓవరాల్‌గా నీ అప్రోచ్ బాగుంది. అంచేత బాధపడే పరిస్థితులు ఎదురవుతాయన్న భయంకన్నా ఆరునెలలే కాబట్టి నీ ప్లాన్‌కి ఒప్పుకుంటున్నాను"

"నామీద ఉంచిన నమ్మకానికి థ్యాంక్స్ మేడమ్. ఇవాళ మధ్యాహ్నం నేను పంచవటికి వెళ్ళి అక్కడి స్థితిగతులు అన్నీ అబ్జర్వ్ చేస్తాను.

నేను అక్కడే ఒక రూమ్ తీసుకుని ఉంటాను. రేపట్నుంచి నా కంట్రోల్ లోనికి తీసుకుంటాను..."

"సో... కౌంట్ డౌన్ స్టార్ట్స్ ఫ్రంట్ మారో..." చిన్నగా నవ్వుతూ విషెస్ చెప్పింది జయప్రభ. మరోసారి థ్యాంక్స్ చెప్పి అక్కడ్నుంచి బయల్దేరింది నిత్య. ఆమె లగేజ్‌పట్టుకుని సోమయ్య వెంట రాగా పంచవటిదారంట నడిచిందామె.

అత్యంత క్లిష్టమయిన ప్రాజెక్టు పనులు నిర్వహించడం కోసం ఆర్నెల్లు మకాం పెట్టడానికి లగేజీతో సహా పంచవటికి చేరుకున్న నిత్యకి అక్కడ అనూహ్య రీతిలో ఆహ్వానం లభించింది. అక్కడున్న జనాలందరి మొహాల్లో వ్యతిరేకభావం, ఏహ్యభావం, కోపం,నిరసన ఇలా తిరస్కారధోరణిలో ఇంచుమించు అందరి ముఖకవళికలూ, బాడీలాంగ్వేజ్ కనిపిస్తున్నాయి.

నానికోసం పనిచేసేవారందరిమీదా

## భయపడ్డాను

గ్లామరస్ తార తాన్యాహోప్ తన తదుపరి సినిమాకోసం బైకర్ అవతారం ఎత్తి అంతకుముందు రూపానికి బ్రేక్ ఇచ్చింది. ఈ మాజీ మిస్ ఇండియా ఫైనలిస్ట్ మోటార్ క్రాస్ బైకర్‌గా కనపడనున్నది. ఇందుకోసం శిక్షణ తీసుకుంటున్నది.

'మొదట్లో అసలు ఈ పాత్ర చెయ్యగలనా? లేదా? అని భయపడ్డాను. ఎందుకంటే రైడ్ నాకు అస్సలు రాదు. సెట్స్‌లోనే రోజుకు రెండు గంటలు చొప్పున ప్రాక్టీస్ చేసేదాన్ని. కష్టమైనా ఎంజాయ్ చేశాను. బైక్ రైడింగ్ వెరీ పవర్‌ఫుల్" అని చెప్పింది.



# దుగ్గరాజుకు అభినందనలు

**వృ**త్తికి, ప్రవృత్తికి పొంతన ఉండాల్సిన పని లేదనడానికి నిలువెత్తు సాక్ష్యం డాక్టర్ దుగ్గరాజు శ్రీనివాసరావు. వృత్తిరీత్యా ఆయన విశ్రాంత అధ్యాపకుడు. ఆయన ప్రవృత్తి అవిశ్రాంత సాహిత్యాభిలాష.

మూడున్నర దశాబ్దాలుగా సాహిత్య రంగంలో ఆయన అందిస్తున్న సేవలకు గుర్తింపుగా కేంద్ర ప్రభుత్వం నేషనల్ బుక్ ట్రస్ట్ (ఎన్.బి.టి.) వారి తెలుగు విభాగపు సలహామండలి సభ్యుడిగా నియమించింది.

**మే**ధావులు, రచయితలు, విశ్లేషకులకు సలహామండలిలో స్థానం కల్పిస్తారు. ఈ మూడు అర్హతలు కలిగిన డాక్టర్ శ్రీనివాసరావును నియమిస్తున్నట్లు ఎన్.బి.టి. పేర్కొన్నది.

కథకుడిగా, కార్టూనిస్టుగా, వ్యాస రచయితగా, కాలమిస్ట్‌గా ఆయన స్వాతి వార, మాస పత్రికల పాఠక దేవుళ్ళకు సుపరిచితులు.

సమకాలీన రాజకీయ, ఆర్థిక, సామాజిక స్థితిగతులను చక్కగా విశ్లేషించగల వ్యాసకర్త.

తన వ్యాసాల్లో ఎంతటి గంభీరత చూపగలరో, సరసమైన కథల వంటివాటిలో అంతటి చతురతనూ ప్రదర్శించగల ఆల్‌రౌండర్.

సాహిత్యాభిలాషకు హద్దులు విధించుకోని అక్షరశిల్పి.

ఈ పదవిలో ఆయన మూడేళ్ళపాటు వుంటారు. ఇటువంటి అవకాశాన్ని పొందిన డాక్టర్ దుగ్గరాజు శ్రీనివాసరావుకు 'స్వాతి' అభినందనలు తెలియజేస్తున్నది. ◆



డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు
సెల్ : 94404 21695

నిత్య అజమాయిషీ చెయ్యబోతోందనీ, ఆ మేరకు మేడమ్ అధికారాన్ని ఇచ్చేశారనే వార్త తెలిశాక కొంతమంది ఒక రకమయిన అభద్రతాభావానికి గురై శత్రువులా చూడడం మొదలెట్టాక అసంకల్పితంగా అందరూ అదే కోణంలో చూడడం మొదలెట్టారు.

ఇక్కడి జనాల తీరుతెన్నులు చూసి వాస్తవాన్ని అర్థం చేసుకుంది నిత్య. తనని నమ్మగలిగే పరిస్థితులు నెలకొనడానికి కొన్నిరోజులు పడతాయని గ్రహించిందామె. సోమయ్య చూపించిన గదిదగ్గరకిచేరుకున్నాక లగేజీని అందుకుంది. సామాను సర్దేందుకు సాయపడతానని సోమయ్య అంటూంటే అతన్ని వారించింది నిత్య- "వద్దు సోమయ్యా... నేను మెల్లగా సర్దుకుంటాను" అంది.

**గ**దంతా గలీజుగా ఉండడం గమనించి తుడిపించడం కోసం ఓ పనిమనిషిని కేకేశాడు సోమయ్య... ఆమె వినిపించుకోకుండా అక్కడ నుంచి వెళ్ళిపోయింది.

ఈ రకమయిన రియాక్షన్ ఊహించినదే కాబట్టి నిత్య ఏం చిన్నబుచ్చుకోలేదు "సోమయ్యా...నాకోసం ఎవరినీ పనులు చెయ్యమని అడగొద్దు. ఒక చీపురు ఇప్పించావంటే నా పని నేను చేసుకుంటాను" అన్నది నిత్య.

స్టోర్ రూమ్ నుంచి ఒక చీపురు, ప్లాస్టిక్ బకెట్, జగ్గు ఇలాంటి నిత్యావసరాలని తెచ్చిచ్చాడు సోమయ్య.

"నువ్వెళ్ళిపో సోమయ్యా, ఏదయినా అవసరం వస్తే అడుగుతాను. ప్రస్తుతానికి ఏం అవసరం లేదు"

సోమయ్య అక్కడనుంచి వెనక్కి తిరిగి నడుస్తుంటే ఆగమంటూ పిలిచింది నిత్య- "సోమయ్యా... రేపటి నుంచి నానికూడా ఇక్కడే ఉంటాడు. అతనికోసం ఒక గది రెడీ చెయ్యాలి" సోమయ్య నివ్వెరపోయాడు.

"మనతో ఇక్కడే ఉంటాడు. ఇక్కడే తింటాడు. ఇక్కడే పడుకుంటాడు" క్షణమాగి తను చెప్పదల్చుకున్నది కొనసాగించింది నిత్య.

"అలా అని పెద్ద భవంతిలో ఉన్న ఏర్పాట్లన్నీ ఇక్కడ ఎరేంజి చెయ్యడం కాదు, కనీస అవసరాలకు సరిపడే విధంగా మాత్రమే ఏర్పాట్లు ఉండాలి... సాదాసీదాగా" అంది నిత్య.

"అబ్బాయిగారు... ఇలాంటిచోట ఉండడం కష్టమమ్మా. ఉండలేరు..." నచ్చచెప్పేవిధంగా అన్నాడు సోమయ్య.

"ఏం పర్లేదు. ఉండగలడు... ఉంటాడు. ఉండాలి" నిత్య మాటల్లో ఖచ్చితత్వం అటూ ఇటూ దూరంగా పనులు చేసుకుంటున్న పనివాళ్ళ చెవులను చేరుతోంది.

"అమ్మా, నువ్వు ఇవాళ వచ్చావ్... బాబు పుట్టినప్పట్నుంచీ మా చేతుల్లో పెరుగుతున్నాడు. అతని తీరుతెన్నులు మాకు క్షుణ్ణంగా తెల్సు. ఇక్కడ ఉండలేడు. ఉంచడం మంచిదికాదు" స్వరం హెచ్చించి అన్నాడు సోమయ్య.

"కష్టమైనా సరే... ఇక్కడే ఉండాలి" కంఠంలో అదే స్థాయి స్థిరత్వం వ్యక్తమయ్యేలా అంది నిత్య.

మేడమ్‌తోనే తేల్చుకుందామని గిర్రున వెనుతిరిగి నడిచాడు సోమయ్య. నడింవాకిలి అన్నిమూలలా ఏవోపనులు చేసుకుంటూ ఉన్నవాళ్ళందరికీ ఈ సంభాషణ చేరింది. నిత్య మాటల్లో కాఠిన్యం మరింత శత్రుత్వభావనను పెంచింది. దూరం దూరంగా ఉన్న వాళ్ళందరూ కూడా కళ్ళ సైగలతోనూ, దగ్గరగా కూర్చున్నవాళ్ళు గుసగుసలుగా మాట్లాడుకుంటున్నారు.

"అసలు ఎవరీమె?, ఈమెకు ఎంత వరకూ అధికారాలు ఇచ్చారు? మేడమ్‌కు తెలిసే ఇలాంటి సంచలనమైన నిర్ణయాలు తీసుకుంటున్నదా?"

"ప్రశాంతంగా బతికేస్తున్న మన మధ్యలోనికి సడెన్‌గా ఎందుకు ఇలా ఎంట్రీ ఇచ్చింది? ఈమె వచ్చి మన జీవితాలు దుర్భరం చేసేస్తుందా?"

"అబ్బాయిగారిమీదే పెత్తనం చూపించాలనుకుంటున్న ఈమె మనల్నికూడా స్వారీ చేస్తుందా?"

"**సో**మయ్యపై కూడా అథార్టీ చెలాయిస్తున్నదంటే ఎలా అర్థం చేసుకోవాలి?" ఇలాంటి సమాధానం లేని ప్రశ్నలు వాళ్ళ సీక్రెట్ సంభాషణల్లో దొర్లుతున్నాయి... ఇదంతా వాళ్ళల్లో ఐకమత్యం పెంచింది.

అప్పుడప్పుడూ గిల్లికజ్జాలు పెట్టుకుని తగవులుపడేవాళ్ళుకూడా ఇప్పుడు ఏకమయ్యారు. కలవరం కసిని పెంచుతుంది. గది చిమ్ముకుంటూ సామాన్లు సర్దుకుంటున్న నిత్య పని చేసుకుంటూనే ఓరకంట గమనిస్తోంది.

అరగంట వ్యవధి తర్వాత సోమయ్య వచ్చి అబ్బాయిగారికోసం రూమ్‌లో ఏర్పాట్లుచెయ్యడం గమనించింది నిత్య. ఆమెకి ఏం చెప్పలేదుగానీ సోమయ్య తన పని చేసుకుపోతున్నాడు. అయితే పంచవటి నివాసుల్లో మాత్రం మళ్ళీ గుసగుసకు ఆస్కారం ఏర్పడింది.

అబ్బాయిగారు ఇక్కడికి రావడం, ఇక్కడే కొన్నాళ్ళు ఉండడం ఖాయం అని అర్థమయింది.ఆ ప్రకారం మేడమ్ ఈ కొత్తామెకి అధికారాలు ఇచ్చినట్లూ రూఢీ అయ్యింది.

"పాపం అమ్మగారికి ఏవో కథలు చెప్పి అబ్బాయిగారి ఆరోగ్యాన్ని బాగు చేసేస్తానని నమ్మించినట్లుంది. ఈమె చేతుల్లోపడి బాబు ఏమయిపోతాడో? మనంమాత్రం ఆమెకెలాంటి సాయం చెయ్యొద్దు. ఆమె అడిగినా ఏంచెప్పొద్దు. మాట్లాడొద్దు" అక్కడ వున్న కుటుంబాలలో పెద్ద పాలేరైన పైడిరాజు పెళ్ళాం నూకరత్నం పిన్ని ఆడాళ్ళమధ్య లీడర్ లాగా వ్యవహరిస్తుంది. ఆమె ఈ విధంగా ఆదేశం జారీచేసింది.

**ఇంకా ఉంది**

> న్యాయం దక్కనప్పుడు
> ఈ దేశంతో నాకేం పని,
> ఇక్కడెందుకు బతకాలి అనే
> భావనలు ఉత్పన్నమవుతాయి.
> -ఇ.ఎస్.ఎల్.నరసింహన్, గవర్నర్



# అంతా రాజకీయమే

## సీన్ చేసింది

హాయిగా సాగిపోతున్న స్క్రీన్‌ప్లేలో ఒక చెత్త సీన్ వస్తేనే ప్రేక్షకులకు బోర్‌కొడుతుంది. ఒక చెత్తసీన్ బోర్‌నుండి పూర్తిగా బయటకు రాకుండానే మరోచెత్త సీన్ ఆ దర్శకుడు చూపిస్తే తిట్టుకోకుండా వుంటారా! అదిగో సరిగా అదే జరిగింది జగన్ వ్యవహారంలో.

ఆంధ్రప్రదేశ్ ప్రజల మనసుల్లో నేటివరకు ప్రత్యేక హోదా అంశం నిలిచివుందంటే అందుకు కారణం జగన్. నిరంతర విమర్శలతో చంద్రబాబు ఎన్.డి.ఎ. నుండి బయటకు వచ్చేలా చేసిందీ జగనే.

చివరికి ప్రధాని నరేంద్రమోడీ ప్రభుత్వంమీద అవిశ్వాస తీర్మానం ఆలోచన తొలిగా చేసిందీ జగనే. అలా హాయిగా తనకు అనుకూలంగా వున్న రాజకీయ వాతావరణంలో పాదయాత్ర కొనసాగించక, తూర్పు గోదావరి జిల్లాలో ఆ జిల్లా ప్రజల వ్యంగ్యం వంట పట్టిందో ఏమో!

హఠాత్తుగా రెండు తప్పుడు సీన్లు చేశాడు. ఒకటి పవన్‌కళ్యాణ్ వ్యక్తిగత జీవితం మీద విమర్శ అయితే, రెండవది కాపు రిజర్వేషన్ ఇవ్వలేను అని చెప్పటం. ఆ రెండూ ఒక వర్గానికి దెబ్బతగిలే డైలాగ్‌లే. ◆

## గెహ్లాట్ గోల

2014 లో అన్ని లోక్‌సభ స్థానాలనూ కోల్పోయిన కాంగ్రెస్ ఆ రాష్ట్రంలో ఉపఎన్నికల్లో సీట్లన్నింటినీ గెలుచుకుంది. ఆ గెలుపుల వెనకున్నది ఆ రాష్ట్రంలో పార్టీని నడిపిస్తున్న సచిన్ పైలెట్ అనేది అందరికీ తెలుసు. రాష్ట్రమంతా పర్యటించి పార్టీని ఏకంచేసిన సచిన్ పైలెట్ కాబోయే ముఖ్యమంత్రి అని కాంగ్రెస్ వారు విస్తృతంగా ప్రచారంచేస్తున్నారు.

సరిగ్గా ఆ సమయంలో అశోక్‌గెహ్లాట్ రాజస్థాన్‌లో ప్రవేశించి, "గతంలో పదేళ్ళు సి.ఎమ్‌గా పనిచేసిన నేనుండగా ముఖ్యమంత్రి పేరు గురించి ఇంకో ఆలోచన ఎందుకు?" అని సచిన్ పైలెట్ ఆశలమీద నీళ్ళు కుమ్మరించాడు.

తాను ఇంతకాలం పార్టీకోసం పనిచేస్తే చివరి క్షణంలో మరెవరినో తెచ్చినా నెత్తినపెట్టటం ఏమిటి? అని సచిన్ పైలెట్ అలిగాడు ఇప్పుడు. అశోక్‌గెహ్లాట్‌ని గుజరాత్, కర్ణాటక రాష్ట్రాల ఎన్నికలకు ఇన్‌ఛార్జిగా రాహుల్‌గాంధీ నియమించాడు.

ఆ యా రాష్ట్రాలలో అధికారం రాకపోయినా,పార్టీ పరువు దక్కింది. కాబట్టి అశోక్ గెహ్లాట్ రాహుల్ గాంధీకి మరింతగా దగ్గరయ్యాడు. ◆

## కన్నడ చీలిక

అడ్డగోలుగా భాషాప్రయుక్త రాష్ట్రాలను విడదీయటంవల్ల రాబోయే ప్రమాదాలగురించి ఎందరు హెచ్చరించినా రాజకీయప్రయోజనాలకోసంతెలుగు రాష్ట్రాన్ని చీల్చిన జాతీయ పార్టీలకు ఇప్పుడు కన్నడ రాష్ట్ర చీలిక డిమాండ్ కొరుకుడుపడటంలేదు.

ఉత్తర కర్ణాటక భాగాన్ని వేరుచేసి దాన్ని ఒక కొత్త రాష్ట్రంగా ఏర్పాటుచేయాలంటూ కన్నడ శాసనసభలో ఒక డిమాండ్ వచ్చింది.

ఆవేశంలో ఆ డిమాండ్ సబబేననే అర్థం వచ్చేలా కర్ణాటక ముఖ్యమంత్రి కుమారస్వామి స్పందించాడు. 2019 ఎన్నికల్లో తమకు బలముందనుకుంటున్న కర్ణాటకలో ఈ విభజన ఉద్యమం గోలేమిటి! అని కంగారుపడుతున్నాయి జాతీయ పార్టీలు. కొత్తగా తెర మీదికి తెచ్చిన కన్నడ చీలిక ఉద్యమం తమకు లాభం తెస్తుందన్నది బి.జె.పి. అంచనా.

ఆ ఉద్యమం తన పార్టీని దెబ్బతీస్తుందనేది కాంగ్రెస్ భయం. ఆ రెండు జాతీయ పార్టీలను ఒక దానికి మరొకదానిని పోటీగా నిలబెట్టి తాము బల పడాలన్నది జె.డి.ఎస్. ఎత్తుగడ.అంతే కాని ఒకభాషా జాతి మధ్య చీలికపెడుతున్నామనే బాధ ఇసుమంతైనా రాజకీయ నాయకులలో కనిపించటంలేదు. ◆

## కొత్త చిచ్చు

అస్సాంలో నలభై లక్షలమంది భారతీయ పౌరసత్వాన్ని ప్రశ్నార్థకంచేస్తూ జాతీయ పౌరసత్వ జాబితా వెలువడింది. ఇది సుప్రీమ్‌కోర్టు పర్యవేక్షణలో జరిగింది. కాబట్టి రాజకీయ రంగు పులమొద్దు అంటారు అధికార పార్టీవారు.

కాని ఆ జాబితాలో అధికశాతం ముస్లిమ్‌లు వున్నప్పుడు ఆ అంశాన్ని రాజకీయంగా వాడుకోకుండా ఎలా వుంటాం అంటున్నాయి ప్రతిపక్షాలు.

వాస్తవంలో అస్సాంలోకి అక్రమ వలసదారులు వచ్చారు. బంగ్లాదేశ్‌నుండి అక్రమంగా వచ్చి, బలపడి స్థానిక రాజకీయాలను,ఆర్థిక,సామాజిక అంశాలను శాసించే స్థాయికి ఎదిగారు. ఇది 1971 నుండి జరిగిన అక్రమ వలస. నాటి కేంద్ర ప్రభుత్వం కళ్ళు మూసుకుని కూర్చుంది. అక్రమ వలసదారులను ఓటు బ్యాంక్‌గా వాడుకుంది కాంగ్రెస్.

ఆ అక్రమ వలసదారులకు వ్యతిరేకంగా విద్యార్థులు ఉద్యమించి, పార్టీ పెట్టి అధికారంలోకి వచ్చారు కూడా. కాని సమస్య పరిష్కారం కాలేదు. ఇప్పుడు అక్రమ వలసదార్ల ఏరివేత హామీ ఇచ్చిన బి.జె.పి. నలభై లక్షలమంది అని తేల్చింది. వీరిని నిజంగా దేశంలో నుండి బయటకు పంపగలరా! ◆

## స్వలాభ పార్టీల ఐక్యత

ప్రజా సమస్యల విషయంలో రాజకీయ పార్టీలు ఏకాభిప్రాయానికి రావు కాని తమ స్వప్రయోజనాల విషయంలో అద్భుతమైన ఏకాభిప్రాయం ఏర్పడుతుంది. ఇప్పుడు తెలంగాణలో కె.సి.ఆర్. తన సొంత పార్టీకి కొత్తగా ఏర్పాటుచేసిన జిల్లా కేంద్రాలతో సహా ప్రతిచోటా కార్యాలయాలు నిర్మించాలనుకున్నాడు.

అయితే ఆ లాభం తన ఒక్క పార్టీనే తీసుకుంటే మిగిలిన పార్టీలు ప్రశ్నించవచ్చు. కాబట్టి అందరికీ అదే తాయిలం విసిరాడు.

గుర్తింపు పొందిన పార్టీలన్నింటికీ గజం 100 రూపాయలకు స్థలాలు ఇస్తున్నామంటూ ప్రకటించాడు. ఇంక ముందు విమర్శించేవారికి, తప్పు ఎత్తిచూపే వారికి ప్రభుత్వ స్థలాలను కారుచౌకగా కట్టబెట్టే నిర్ణయంలో భాగస్వామ్యం కల్పించాడు.

దీనితో కె.సి.ఆర్‌నిగాని టి.ఆర్.ఎస్‌ని ఆ ఆఫీసుల కేటాయింపు విషయంలో విమర్శించలేకుండా చేశాడు. అదీ రాజకీయ ఏకాభిప్రాయ సాధన అంటే ఎలాంటి వాటిలో ఏకాభిప్రాయం ఏర్పడుతుందో ప్రజలు గమనిస్తున్నారా! ◆

## ఒంటరి పోరాటం

చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా గెలిచిన తర్వాత తన రాజకీయ అనుభవం రాష్ట్రానికి వెచ్చిస్తాడనుకుంటే రాజకీయాలకే ప్రాధాన్యతనిచ్చాడు.

అన్ని పార్టీలను కలుపుకుపోవటం అనే యత్నమే చెయ్యలేదు.రాష్ట్రం ఆర్థికంగా, ఇతరత్రా సమస్యలతో సతమతమవుతుంటే అన్ని పార్టీల మద్దతుతో కేంద్రం మీద ఒత్తిడి తీసుకురావాల్సిందిపోయి తానొక్కడే హీరోగా నిలబడాలని చేసుకున్న రాజకీయంవల్లనేడు పాలన వదిలేసి 'జిల్లాకో దీక్ష' అంటూ ప్రతి దీక్షలో తానే కూర్చుని నడిపించాల్సిన పరిస్థితినితెచ్చుకున్నాడు.

అవసరం అయినప్పుడు చంద్రబాబుకి అఖిల పక్షాలు గుర్తుకురాలేదు. ఇప్పుడు తనకు అవసరమై అఖిల పక్షం పెడతానంటే కలిసివచ్చే పార్టీ లేదు.

అదీ రాజకీయంగా చంద్రబాబు ఒంటరితనం. ఒంటరి పోరాటమే తనకు కలిసివస్తుందని చంద్రబాబుకి సలహాదారులు చెప్పినట్టున్నారు.

నలుగురిని చుట్టూ పెట్టుకుని, వారి చచ్చు సలహాలతో చిక్కుకుపోయి తాను నష్టపోయి, రాష్ట్రానికి నష్టం కల్గించే పరిస్థితి కొనితెచ్చుకుంటున్నాడు నలభై ఏళ్ళ అనుభవజ్ఞుడు. అదీ విచారం. ◆

# కదిలే బొమ్మల కబుర్లు



## కొన్ని తప్పవు

స్కిన్‌షో చేయడంలో అమీజాక్సన్ ముందుంటుందన్న మాటలు ఎక్కువగానే వినిపిస్తుంటాయి. ఈ ప్రస్తావన తెస్తే అమీజాక్సన్ బోల్డెంత వివరణ ఇచ్చింది. "గ్లామర్ పాత్రలే ఎక్కువ చేస్తానని, సినిమాల్లో స్కిన్‌షో చేస్తానని చాలాచోట్ల వార్తలు చదువుతుంటా. హీరోయిన్‌గా ఎదగాలంటే అన్ని పాత్రలూ అంగీకరించాలి.

కథ డిమాండ్‌నుబట్టి రూపం ఉండాలి. అందరూ అనుకుంటున్నట్లు ప్రతి సినిమాలో స్కిన్‌షో చేస్తూ ఆకర్షించాల్సిన అవసరం లేదు.

దర్శకుడు చెప్పినమేరకు కనిపించకపోతే సన్నివేశం పండదు కదా. నేను యు.కెలో పుట్టినా అధిక భాగం భారతదేశంలోనే పెరిగాను. భారతీయ సంస్కృతిని కూడా అనుసరిస్తుంటా..." అంటూ సకల సంగతులూ ఏకరువుపెట్టింది. ◆

Review

## బాగా చీప్ బ్రాండ్ గురూ

ఓ లైన్ సెట్ అయింది కదా? అని అదే లైన్‌లో సినిమాలు తీసుకుంటూపోతే బోర్ కొట్టడం అనివార్యం. మతిమరుపు కుర్రాడు ప్రేమలో పడితే... 'భలే భలే మగాడివోయ్', అతి మంచితనం వున్న వాడు ప్రేమలోపడితే 'బాబు బంగారం', అతి శుభ్రత వున్నవాడు ప్రేమలోపడితే 'మహానుభావుడు', లేటెస్ట్‌గా అతిగా బ్రాండ్ వస్తువుల పిచ్చి వున్నవాడు ప్రేమలో పడితే... అదే 'బ్రాండ్ బాబు'.

కానీ సమస్య ఏమిటంటే, మొదటి మూడు సినిమాల్లో వున్న స్క్రిప్ట్ వర్క్ కానీ, స్ట్రయిట్ టు ద పాయింట్ నెరేషన్ కానీ ఈ 'బ్రాండ్ బాబు'లో లేకపోవడం. 'భలే భలే మగాడివోయ్', 'మహానుభావుడు' సినిమాల్లో వున్న సునిశిత హాస్యం ఈ సినిమాలో కరువైపోవడం. ఆ స్థానంలో చౌకబారు హాస్యం లేదా నాటు కామెడీ చోటుచేసుకోవడం.

దీంతో ఖరీదైన బ్రాండ్‌ల మీద తీసిన సినిమా కాస్తా చౌకబారుగా మిగిలిపోయింది.

అసలు ఈ బ్రాండ్ల పిచ్చి కథేంటీ అంటే, ఓ డబ్బున్న ఆసామీకి (మురళీశర్మ) తన హోదా... తన స్థాయి కలిసి మనసులో అహం ఓ రేంజ్‌లోకి చేరిపోయివుంటుంది. తన కొడుకును (సుమంత్ శైలేంద్ర)ను కూడా అదే విధంగా పెంచుతాడు.

గట్టిగా ఏడవకూడదు. లెవెల్ మెయింటెయిన్ చేయాలి. దాంతో పాటు ఖరీదైన బ్రాండ్‌లనే వాడాలి. కానీ ఇలా పెరిగిన కుర్రాడు అనుకోని పరిస్థితుల్లో ఓ కన్ఫ్యూజన్‌కు గురై హోమ్ మినిస్టర్ కూతురు అనుకుని, పనిమనిషిని( ఈషారెబ్బా) ప్రేమిస్తాడు.

కానీ తీరా తనపొరపాటు తెలుసుకుని,వదుల్చుకుందామంటే కథ వేరే మలుపు తిరుగుతుంది. అప్పుడేమయిందన్నది మిగిలిన సినిమా.

ముఖ్యంగా డబ్బు పిచ్చి వేరు... బ్రాండ్ పిచ్చి వేరు. పరువు ప్రతిష్ఠ వేరు. కానీ ఇవన్నీ కలిపేసి, 'బ్రాండ్ బాబు' అని పేరుపెట్టి బ్రాండ్‌లతో ముడిపెట్టి, కథను మాత్రమే కాదు, సినిమాను కూడా కన్‌ఫ్యూజ్ చేసేసుకున్నారు కథకుడు మారుతి, దర్శకుడు ప్రభాకర్ కలిసి.

'బ్రాండ్ బాబు' సినిమా తొలిసగం స్మూత్‌గానే ప్రారంభమవుతుంది. హీరో పెరిగిన వైనం, బ్రాండ్‌ల పిచ్చి పట్టిన వైనం బాగానే వుంటుంది.

ఈ సందర్భంగా పుట్టే ఫన్ కూడా బాగానే వుంది.

Review

## కొత్తతరం సినిమా

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్నట్లుగా వుంటుంది కొన్ని సినిమాల వ్యవహారం. టైటిల్ దగ్గర నుంచి, దాని డిజైన్ దగ్గర నుంచి బయటకు వచ్చే ప్రచార సామగ్రి అన్నీ కలిసి సినిమా మీద ఓ అంచనాను పెంచుతాయి.

సినిమా ఆ అంచనాలకు తగినట్లు వుంటే వచ్చే అనుభూతి వేరు. ఈవారం విడుదలయిన 'చి.ల.సౌ.' సినిమా అలాంటిదే. కొత్తతరం సినిమారంగంలోకి ఉవ్వెత్తున వస్తోంది. శ్రీశ్రీ తన కవిత్వంతో ఛందోబందోబస్తులన్నీ తెంచేసినట్లు, ఈ నవతరం సినిమా కథ అర్థాన్ని మారుస్తోంది.

సినిమా అంటే ఇంత కథ అనేది వుండాలని, అది అలా మొదలై, అలా అలా ఎదిగి, చివరకు అలా ముగియాలనే పడికట్టు సూత్రాలను పక్కన పడేస్తోంది. అంతేకాదు, ఏ భావోద్వేగాలను తెరపైకి తీసుకురావడానికి ఇన్నాళ్ళూ మన మేకర్లు భయపడ్డారో, అలాంటి వాటిని చులాగ్గా చూపించేస్తున్నారు నవతరం దర్శకులు.

బాలచందర్, మణిరత్నం సినిమాలు మాత్రమే మనకు ఇన్నాళ్ళూమానవసంబంధాలు, భావోద్వేగాలు తెరమీద చూపించేవి. మన డైరెక్టర్లు మెలోడ్రామాకు




పెద్దపీట వేస్తూ వచ్చారు తప్ప భావోద్వేగాలకు కాదు. 'గీతాంజలి', 'సఖి', 'అంతులేని కథ', 'గుప్పెడు మనసు' లాంటి సినిమాలు మనవాళ్ళు టచ్ చేయడానికి భయపడిన సబ్జెక్ట్‌లు.

అయితే ఆ సినిమాల్లో కూడా లెంగ్తీ కథలు ఉంటాయి. కానీ తెలుగు సినిమాల్లోకి వస్తున్న కొత్తతరం దర్శకులు అసలుకథే అక్కరలేకుండా ఓ చిన్న సంఘటన, లేదా ఓ చిన్న సమస్య చుట్టూ సన్నివేశాలు అల్లి,రెండుగంటలు జనాల్ని కూర్చోపెట్టేస్తున్నారు.

'చిలసౌ' సినిమా ఇలాంటిదే. జస్ట్ ఓ రాత్రిలో




కానీ, హీరోయిన్‌తో ప్రేమలో పడిన తరువాత హీరో క్యారెక్టర్ నానావిధాలుగా ప్రవర్తిస్తుంది.

ఆ ప్రవర్తించడం అంతా నవ్వులు పూయించడం మాదిరిగా కాకుండా, నవ్వులాటకు కేంద్రంగా మారుతుంది. సన్నివేశాల వల్ల నవ్వులు వినిపించవు.

అక్కడక్కడ దొర్లిన డైలాగుల వల్ల నవ్వులు వినిపిస్తాయి. ఎప్పుడుఅయితే సినిమాను కామెడీ ట్రాక్‌లో నడపాలని అనుకున్నారో అప్పుడు లాజిక్‌లు అన్నీ గాలికి వదిలేశారు. సాధారణంగా ప్రేమించిన అమ్మాయికోసం తల్లిదండ్రులను ఎదిరించడం కామన్. కానీ ఇక్కడ వెరైటీ కోసం ఆ అమ్మాయిని వదిలించుకోవాలని హీరో కూడా చూడడం. అక్కడే సబ్జెక్ట్‌కాస్త తేడాచేసింది. దీంతో సినిమాలో కమర్షియల్‌పాయింట్ అయిన లవ్‌ట్రాక్‌దెబ్బకొట్టేసింది.

ఇలా టర్న్ తీసుకున్న సినిమాను హీరో కుటుంబం సంఘబహిష్కరణ అనే పాయింట్‌తో కొత్తమలుపు తిప్పారు. (అని కథకుడు, దర్శకుడు అనుకున్నారు). కానీ అక్కడ పండాల్సినంత కామెడీ పండలేక పోయారు.ఆదే సమయంలో హీరో వైపు నుంచి కాస్త విషాదం చూపించబోయి విఫలమయ్యారు.

మరికాస్సేపు సినిమా నడిచాక, హీరోయిన్‌ను హీరో ఇంట్లోకి చేర్చి, కుడికాలు లోపలపెట్టించి, మెడలో గొలుసువేసి, అచ్చమైన టీవీ సీరియల్ దృశ్యాలు చూపించారు. అప్పుడంతా హీరో అలా చూస్తూవుండడంతప్ప చేసేది లేదు.

ఇలా ఒకటి కాదు, సీన్‌కు సీన్‌కు పొంతనలేకుండా ఏదేదో చేసుకుంటూపోయారు. దానివల్ల ప్రేక్షకుడికి ఓ తరహా ఫీల్ అన్నది కలగకుండా చాలా జాగ్రత్త పడ్డారు. సినిమా చివరకు వస్తుంటే, ఎలా ముగుస్తుందీ అనుకుంటే పరమరొటీన్‌గా హీరోతండ్రికి ప్రమాదం, హీరోయిన్ రక్తం ఇచ్చి బతికించడం.

మళ్ళీ అక్కడితో ఆగకుండా హీరోయిన్‌ను ప్రఖ్యాత డ్యాన్సర్‌ను చేసి, ఆమెకు కూడా ఓ బ్రాండింగ్ ఆపాదించడం. నిజానికి ఈ స్క్రిప్ట్‌మీద సీరియస్‌గా వర్క్‌చేసివుంటే, మంచి సినిమానే చేసే అవకాశం ఉంది. కానీ మిడిమిడి అనుభవంతో స్క్రిప్ట్ తయారుచేశారేమో అనిపిస్తుంది.

ఎమోషన్ సీన్లేమో ఫోర్స్‌డ్‌గా ఉంటాయి. ఫ్యామిలీ సీన్లు సీరియళ్ళను తలపిస్తాయి. దానికి తోడు హీరో, హీరోయిన్, హీరో తండ్రి మినహా మిగిలిన క్యారెక్టర్లు అన్నీ బడ్జెట్‌కి లోబడి తీసుకున్న కొత్త, పార్ట్‌టైమ్ నటులతో నింపేశారు.

దాంతో సీరియల్ చూసినట్లు ఉంటుందితప్ప సినిమా చూసినట్లు కాదు. సినిమాలో కీలకమైన పాత్రలు మూడు. హీరో సుమంత్ శైలేంద్ర. కొత్త నటుడిగా అనిపించలేదు. సులువుగానే చేసుకుంటూ వెళ్ళిపోయాడు.

కానీ ప్రేక్షకులమీద తన ముద్ర అనేది ఏదీ వేసేంత లేదు సినిమాలో పాత్ర. ఇక హీరోయిన్ ఈషారెబ్బా... సినిమా మొత్తం ఒకటే ఎక్స్‌ప్రెషన్. మిగిలింది హీరో తండ్రిగా మురళీశర్మ.

ఆయన మాత్రం తన పాత్రకు, తనకు ఇచ్చిన డబ్బులకు న్యాయం చేశాను అనిపించుకున్నాడు. కానీ దానివల్ల సినిమాకు ఒనగూడే అదనపు ప్రయోజనం ఏమీలేదు.

సాంకేతికంగా సినిమా ఏమీ గొప్పగా లేదు. మిగిలినవిభాగాలు పనితీరూ అంతంతమాత్రమే.

**ప్లస్‌పాయింట్స్...**
మారుతి బ్రాండ్ నేమ్

**మైనస్‌పాయింట్స్...**
సినిమానే

**పంచ్‌లైన్**
బ్యాండ్ బ్రాండ్ ◆

ఇద్దరి మధ్య జరిగిన కథ. అప్పుడే పెళ్ళిచేసుకోవడం ఇష్టంలేని కుర్రాడు (సుశాంత్). ఎలాగైనా పెళ్ళి చేసుకుంటే తప్ప తల్లి దక్కదనే భయంతో బాధపడే అమ్మాయి (రుహానీశర్మ).

ఈ ఇద్దరికీ పెళ్ళిచూపులు పేరిట కలవడం తప్పదు ఓ సాయంత్రంవేళ. అక్కడి నుంచి తెల్లవారే లోగా అనేక సంఘటనలు జరుగుతాయి. చివరకు ఏమయింది అన్నది సినిమా.

ఉదయం ప్రారంభమైన సినిమా సాయంత్రానికి అసలు కథలోకి ఎంటరై, మళ్ళీ మర్నాడు ఉదయానికి ముగుస్తుంది. అలా అని ఎక్కడా ఇన్ని సంఘటనలు జరగడానికి ఒక్క రాత్రి సరిపోతుందా? అని కానీ, లాజిక్‌లకు దూరంగా వుందని కాని అనిపించదు.

సినిమా ఆద్యంతం అత్యంత సహజంగా సాగిపోతుందంతే. ఏ నటుడుగానీ, నటి కానీ, పాస్ ఆన్ పాత్రలుకానీ ఎక్కడా ఓవర్ ది బోర్డు వెళ్ళవు.

ఎంతలో వుండాలో అంతే వుంటాయి.ప్రతి పాత్రా సెటిల్డ్ పెర్‌ఫార్మెన్స్ ఇస్తాయి. మాటలు ఆచితూచి వుంటాయి. వినోదం అనేది సన్నివేశాల్లో భాగంగా వస్తుందితప్ప,ప్రత్యేకంగా అతికించినట్లువుండదు.

నటుడిగా పరిచయం అయిన రాహుల్ రవీంద్రన్ తొలిసారి దర్శకత్వం వహించిన సినిమా ఇది. కానీ తొలిసారి అన్నది ఎక్కడా కనిపించదు. షాట్ డివిజన్, ఫ్రేమ్‌ల అరేంజ్‌మెంట్, సహజమైన నటన రాబట్టుకోవడం, సాంకేతిక సహకారం తీసుకోవడం అన్నీ కలిసి, దర్శకుడిగా రాహుల్ రవీంద్రన్‌కు నూటికి నూరు మార్కులు తెచ్చిపెడతాయి.

సినిమా తొలిసగం ఓ డైరీ రాసుకున్నట్లు ప్రారంభమవుతుంది.ఓ సగటు కుర్రాడు ఎలా వుంటాడోఅలా... ఎలా బిహేవ్ చేస్తాడో అలా. కథలోకి కథానాయిక వచ్చిన తరువాత ఇక జనం దృష్టిఅంతా ఆమెమీదకు వెళ్ళిపోతుంది. అలా అని ఆమేమీ అందగత్తె కాదు. గ్లామర్, స్కిన్‌షో లేదు.

పక్కింటి అమ్మాయిలా వుంటుందంతే. కానీ నటన, కళ్ళలో స్పార్క్ అలాంటివి. అయితే ఇలాంటి సినిమాలు అందరికీ నచ్చుతాయా? అన్నది ఓ అనుమానం. ఎందుకంటే తెరపైకి భావోద్వేగాలు పక్కాగా రావాలిఅంటే స్మూత్‌గా శిల్పంచెక్కినట్లు చెక్కాలి.

'నాకు మా అమ్మ కావాలి' అని హీరోయిన్ అంటూ, పెళ్ళి తనకు ఎంత అవసరమో చెబుతున్న సీన్‌చూస్తే, మణిరత్నం 'గీతాంజలి'లో 'నాకు బతకాలని వుంది నాన్నా'అని హీరోయిన్ అన్న సీన్ గుర్తుకు వస్తుంది. 'నువ్వు నాకు నచ్చుతున్నావని అనుకోవడం నాకు నచ్చుతోంది. కానీ అలా నచ్చడం నాకు నచ్చడం లేదు' అని డైలాగుగా వింటే, ఏమిటీ ఈ డైలాగ్ కన్ఫ్యూజన్ అనిపిస్తుంది.

కానీ సినిమాలో పాత్రల నడుమ ఆ డైలాగ్ వచ్చినప్పుడు, హీరోయిన్ మదిలో వున్న కాన్‌ఫ్లిక్ట్‌ను ఇంత సుతారమైన డైలాగ్ ద్వారా వెల్లడించడం సూపర్ అనిపిస్తుంది.

సినిమా మొత్తానికి దర్శకుడే కీలకం. ప్రతి సీన్‌ను అత్యంత సహజంగా తీసుకుంటూ వచ్చాడు. వినోదం అన్నది కీలకం కాబట్టి ప్రధాన పాత్రలతోనే వినోదం పండిస్తూ, కమెడియన్ వెన్నెల కిషోర్ చేత తొలి సగంలో ఒక సీన్, మలిసగంలో మరో సీన్‌తో థియేటర్లో నవ్వులు భయంకరంగా పూయించేశాడు.

సినిమా ఎక్కడా టెన్షన్ పెట్టదు. అలా కూల్‌గా వెళ్ళిపోతుంది. సినిమాటోగ్రఫీ, నేపథ్యసంగీతం ప్రతిఒక్కటీ సుందరంగా, సుతారంగా వున్నాయి.

సుశాంత్‌కు తన కెరీర్‌లోనే బెస్ట్ పెర్‌ఫార్మెన్స్‌గా మిగిలిపోతుంది. కొత్త అమ్మాయి రుహానీ కూడా చాలా బాగా చేసింది.ఎప్పుడూ రెగ్యులర్ సినిమాలేనా? మడిసి అన్నాక కూసింత మంచి సినిమాలు కూడా చూడాలి. ఆదరించాలి అనుకునేవాళ్ళు ఎవరైనా 'చి.ల.సౌ' ను హ్యాపీగా చూసేయొచ్చు.

**ప్లస్‌పాయింట్స్...**
స్క్రీన్ ప్లే, డైరెక్షన్, సాంకేతిక విలువలు

**మైనస్‌పాయింట్స్...**
స్లో నెరేషన్

**పంచ్‌లైన్**
'నచ్చుతుంది' ◆

Review

# జేమ్స్‌బాండ్ @ టాలీవుడ్

'జేమ్స్ బాండ్ 007', 'గూఢచారి 116' ఈ సినిమాలు ఎప్పుడూ ఆసక్తికరమే. అయితే హాలీవుడ్ సినిమాలునేరుగా తెలుగులోకి అనువాదమై వచ్చేయడం మొదలైన తరువాత ఆ తరహా సినిమాలు తెలుగులో చేయడం తగ్గిపోయింది. దీనికి చాలా కారణాలు వున్నాయి.

ఓ వర్గం ప్రేక్షకులకుమాత్రమే ఈతరహా సినిమాలు నచ్చడం, హాలీవుడ్ రేంజ్‌లో తీయాలంటే బాగా ఖర్చుచేయాల్సిరావడం, దానికి తగినట్లు సినిమాల రాబడి లేకపోవడం. ఇలాంటి నేపథ్యంలో చాలాకాలం తరువాత తెలుగులో ఓ బాండ్ సినిమా వచ్చింది. అదే ఈ వారం విడుదలైన 'గూఢచారి' సినిమా.

బాండ్‌సినిమాల స్టయిల్‌లో తెలుగులో సినిమాలు చేయడంలో కొన్ని సమస్యలు వున్నాయి. మన ప్రేక్షకులకు హీరోయిన్, డ్యూయట్, మాస్ ఫైట్లు ఇలాంటివి కొన్ని పడికట్టు వ్యవహారాలు కావాలి.

బాండ్ సిరీస్ సినిమాలు అంటే ఎప్పటి అమ్మాయి అప్పుడే, సీరియస్ ప్రేమలు వుండవు. డ్యూయట్‌ల సంగతి సరేసరి.

అయితే హీరో, కథకుడు అడవి శేష్ చాలా తెలివిగా ప్లాన్ చేసుకుని, మనదైన స్టయిల్ బాండ్ మూవీ అందించాడు.

ఈ బాండ్ మూవీలో ప్రేమ వుంది.

డ్యూయట్ వుంది. అన్నింటికీ మించి ఎమోషనల్ బాండింగ్ వుంది. ఇలా తయారైన 'గూఢచారి' సినిమా కథేంటీ అంటే...

చిన్నప్పుడే తీవ్రవాదుల కారణంగా తండ్రిని కోల్పోతాడు. మావయ్యనే డాడ్ అని పిలుచుకుంటూ పెరుగుతాడు. ఈ క్రమంలో శివ అన్న తనపేరును, తన ఐడెంటిటీని అన్నీ మార్చేసుకుని అర్జున్‌గా (అడవి శేష్) తయారవుతాడు.

కానీ తను కూడా తండ్రిలా సిబిఐ, ఇంటెలిజెన్స్, రా తదితర విభాగాల్లో దేంట్లో అయినా చేరి, దేశానికి సేవచేయాలన్నది కోరిక. అదే సమయంలో తన తండ్రిని చంపిన తీవ్రవాదులను చంపాలన్నది అంతర్లీనంగా వున్న కోరిక.

ఆ ప్రకారం దేశంలోని అత్యున్నత నిఘా విభాగం త్రినేత్రలో చేరిన తరువాత సమీర (శోభిత దూళిపాళ) పరిచయం అవుతుంది.

అంతలోనే తనకు తెలియకుండానే అర్జున్ ఓ కుట్రలో ఇరుక్కుపోతాడు. అర్జున్‌పై తీవ్రవాద




నేరం మోపబడుతుంది. దాంతో అర్జున్ పరారై పోతాడు. అతనికోసం దేశవ్యాప్తంగా వేట మొదలవుతుంది. అసలు ఏమిటి విషయం? ఈ కుట్రను అర్జున్ ఎలా ఛేదించాడు అన్నది మిగిలిన సినిమా.

ముందే చెప్పినట్లు ఇది దేశీయ బాండ్ సినిమా. అందుకే తండ్రీ కొడుకుల ఎమోషనల్ బాండింగ్, అమ్మాయి ప్రేమ, విషాదంలాంటి విషయాలను మిక్స్‌చేస్తూ బాండ్ స్టోరీ అల్లుకున్నారు.

ఆ అల్లిక బాగానే సెట్ అయింది. అయితే తొలిసగం కాస్త బోరింగ్‌గా వుంటుంది.

అసలు కథలోకి తీసుకెళ్ళడంకోసం చాలా టైమ్ తీసుకున్నాడు దర్శకుడు శశికిరణ్.

## ఎలా ఆడుతున్నాయి?

- భారీ అంచనాల నడుమ విడుదలైన 'సాక్ష్యం' సినిమా డిజాస్టర్‌గా మిగిలింది.
  అయితే సీడెడ్, నైజాం, కృష్ణ, ఓవర్‌సీస్ ఏరియాల్లో నిర్మాతలే పంపిణీ చేసుకున్నందున నష్టాలు వారికే. మిగిలిన ఏరియాల్లో బయ్యర్లకు కాస్త నష్టం తప్పదు.
- 'హ్యాపీ వెడ్డింగ్' చిన్న సినిమా అయినా కూడా నష్టాలే మూటగట్టుకుంది. కనీసపు ఖర్చులు కూడా రాలేదు.
- 'W/o.రామ్' సినిమాదీ అదే పరిస్థితి.
- ఆషాఢం డిస్కౌంట్ సేల్ అన్నట్లుగా వరుసపెట్టి విడుదల అవుతున్నాయి సినిమాలు.కానీ పెట్టుబడి వెనక్కి రప్పించుకోవడంలో విజయం సాధిస్తున్న దాఖలాలుమాత్రం లేవు. ◆

హీరో ఉద్యోగాలకు దరఖాస్తు చేయడం, ఎంపిక ప్రాసెస్, ట్రైనింగ్, పోస్టింగ్ ఇలా చాలా వ్యవహారాలు డిటైల్డ్‌గా చర్చించాడు. ఇవేవీ అంతగా ఆకట్టుకోవు.

కానీ ఆ ప్రాసెస్‌లో, కథలో కనిపించని విషయం ఏదో వుంది అన్న ఆసక్తిని చొప్పించడంవల్ల, ప్రేక్షకుడు భరిస్తాడు.

అసలు కథలోకి సినిమా ప్రవేశించి, ద్వితీయార్థం మొదలైన తరువాతనుంచి సినిమా గ్రిప్పింగ్‌గా సాగుతుంది.

ముఖ్యంగా యాక్షన్ సీన్లు, లైవ్ లొకేషన్లలో చిత్రీకరణ అన్నది ప్లస్ పాయింట్‌గా కనిపిస్తుంది. ఊళ్ళ పేర్ల బోర్డులు తగిలించి, ఎక్కడో స్టూడియోలో చిత్రీకరించేయకుండా, దేశం నలుమూలలా, అలాగే బంగ్లాదేశ్ లాంటి లొకేషన్లకు వెళ్ళడం, కొత్త కొత్త లొకేషన్లు చూపించడంవల్ల సినిమా ఆసక్తికరంగా తయారయింది.

పైగా ప్రేక్షకుడు ఊహించని ట్విస్ట్ క్లైమాక్స్‌లో వుండడంవల్ల తొలిసగంలోని అనవసరపు నెరేషన్ అంతా మరిచిపోయేలా చేస్తుంది. చిన్న చిన్న లాజికల్ మిస్సింగ్‌లు వున్నప్పటికీ, సినిమా లిబర్టీ ప్రకారం అవి వదిలేయదగ్గవే.

సినిమా మేకింగ్, బాండ్ స్టైల్‌ను అడాప్ట్ చేసుకోవడంలోచూపించిన మెళకువలు, సాంకేతిక సహకారం అన్నీ కలిసి 'గూఢచారి' సినిమాను చూడగలిగిన సినిమాగా చేశాయి.

అడవి శేష్ ఇటు త్రినేత్ర ఏజెంట్‌గా, అటు లవర్‌బాయ్‌గా రెండు ఇమేజ్‌లు కలిపి చూపించాలనుకున్నాడు. బాగానే ఉన్నాడు. కానీ మాటిమాటికీ ఎమోషనల్ టచ్ ఇచ్చేసి, కళ్ళలో నీళ్ళు తిప్పేసుకునేట్లు చూపించడం అంత బాగా లేదు.

శోభిత దూళిపాళ ఆ పాత్రకు ఓకె. తెలుగు సినిమా హీరోయిన్ మెటీరియల్ అయితే కాదు. మిగిలినవారంతా సీనియర్ ఇంకా అనుభవం ఉన్న ఆర్టిస్టులేకాబట్టి అలా అలా చేసేశారు.

అబ్బూరి రవి మాటలు బాగున్నాయి. శ్రీ చరణ్ నేపథ్య సంగీతం బాగుంది. షాన్యూల్ దేవ్ సినిమాటోగ్రఫీ సినిమాకు ప్లస్ అవుతుంది.

శశికిరణ్ తొలి సినిమా అయినా డీల్ చేసిన విధానం బాగుంది. అందువల్ల మరో దర్శకుడు టాలీవుడ్‌కు వచ్చినట్లే. బాండ్ తరహా యాక్షన్ చిత్రాలు ఇష్టపడేవారికి నచ్చుతుంది.

**ప్లస్‌పాయింట్స్...**
సెకండాఫ్, నిర్మాణ విలువలు

**మైనస్‌పాయింట్స్...**
ఫస్ట్ హాఫ్

**పంచ్‌లైన్**
తెలుగోడి బాండ్ మూవీ

# చివరి రోజుల్లో...

ఎందుకు! ఎలా! అనేది తెలిస్తే ఎవరి జీవితంలో ఎటువంటి ఇబ్బందులు వుండవేమో! అందుకే విధాత 'ఏ విషయానికి ఏమి జరుగునో' అనే ఉత్సుకత కలిగించేలా జీవితం అందించాడు. ప్రతి ఒక్కరి జీవితం చిత్రమే అయినా వర్జీనియా వూల్ఫ్ అనే రచయిత్రి జీవితం మరెవరి ఊహలకూ అందనంత చిత్రమైనది.

నవలా రచయిత్రిగా, సాహిత్య విమర్శకురాలిగా, స్త్రీ విమోచనపై ఆరాటపడిన మహిళగా ప్రపంచం గుర్తించిన వర్జీనియా వూల్ఫ్ జీవితాంతం మానసిక వ్యాధితో బాధపడింది. ఆమెను పిచ్చి, ఉన్మాదం వంటివి వేధించాయి. ఆ ఉన్మాదం లేనప్పుడు రచనలు చేస్తుండేది. ఉన్మాద సమయంలో మాత్రం పిచ్చాసుపత్రిలో సమయం గడిపేది.

మనోవైజ్ఞానిక శాస్త్రంలో చెప్పే 'ఏండ్రి గోని' అనే మానసిక ఇబ్బంది ఆమెది. తండ్రిని విపరీతంగా ప్రేమించింది. తల్లి మరణం తర్వాత తండ్రిని మరింతగా ఆరాధించింది. తండ్రిద్వారా ఆమెలో పురుష ప్రవృత్తి వచ్చింది. తన మాటే చెల్లాలని, తనే పైచేయిగా వుండాలనే భావన ఆమెది.

వర్జీనియా వూల్ఫ్ ఒక సాధారణ అమ్మాయిలాగా వుండలేకపోయింది. తన చెల్లి పెళ్ళిచేసుకుని, సంసారంచేస్తూ, పిల్లల తల్లి అవటం చూసినప్పుడు తనకు అలాంటి జీవితం కావాలని కోరిక. కాని అంతలోనే మగవాడికి లొంగటమా! అనే ప్రశ్న.

మగవారిలా 'సైప్ కాల్పేది' ఆమెలో ఉన్మత్తత వుందని తెలిసినా ఇష్టపడి పెళ్ళిచేసుకున్నాడు లియోనార్డ్ వూల్ఫ్. పెళ్ళి తర్వాత వర్జీనియాలో మరో లోపం బయటపడింది. అది ఆమెలోని ఫ్రిజిడిటీ. మగవాడు తనమీద ఏమిటి! అన్నది ఆమె ప్రశ్న. లైంగిక సుఖాన్ని తాను పొందలేదు. భర్తకి అందించలేదు.

అయినా భర్త ఎప్పుడూ ఆమెను ఒక్క మాట అనలేదు. అతను సహజంగా మేధావి. భార్యలోని మేధో సంపత్తి ముందు పిచ్చితనాన్ని భరించటానికి ఆ భర్త సిద్ధమయ్యాడు. ఒకవైపు రచనలు మరోవైపు ఉన్మాద స్థితి. మధ్యమధ్యలో పిచ్చాసుపత్రిలో, ఒంటరిగా గదిలో బందీగా.

ఫలితంగా వర్జీనియా వూల్ఫ్‌లో మరణంపట్ల ఒక పిచ్చి ఆలోచన పెరిగింది. ఆ మానసిక వ్యాధితోనే 'మిసెస్ డేలోవే', 'టు ది లైట్ హౌస్', 'దివేవ్స్', 'ది కామన్ రీడర్' వంటి ఉత్తమ రచనలు చేయగలిగింది. అలా పిచ్చితోనే 59 ఏళ్ళవరకు నెట్టుకొచ్చింది.

1941 మొదలైంది. వర్జీనియా వూల్ఫ్ తన నవల రాయటంలో బిజీగా వుంది. మరి కొంత రాస్తే తన నవల 'బిట్వీన్ ది ఏక్ట్స్' పూర్తవుతుంది. కాని ఆమె మనసు మరోసారి ఇబ్బందికి గురైంది.



వర్జీనియా వూల్ఫ్
(1882-1941)

**పెళ్ళి తర్వాత వర్జీనియా వూల్ఫ్‌లో మరో లోపం బయటపడింది. అది ఆమెలోని ఫ్రిజిడిటీ. ఒకవైపు రచనలు మరోవైపు ఉన్మాద స్థితి. మధ్యమధ్యలో పిచ్చాసుపత్రిలో, ఒంటరిగా గదిలో బందీగా.**

క్రమంగా ఉన్మాద లక్షణాలు తిరిగి వస్తున్నాయి అనిపించింది. తాను మామూలుగా లేననే విషయం ఆమెకు అర్థమవుతోంది. కాని సాధారణ స్థితికి రావటం వర్జీనియా చేతిలో లేదు.

ఆమె మనసు,ఆమె ఆలోచనలు అదుపు లేకుండా వెళ్ళటం కొత్తకాదు. చాలాకాలంగా జరుగుతున్నదే. కొంతకాలం బాగుంటే మరికొంత కాలం బాగుండదు. తాను బాగుండక తన జీవితం పంచుకుంటున్న జీవితంకూడా దుర్భరం చేస్తున్నాను అనే బాధ ఆమె మనసులో వుంది. కాని పిచ్చికి, ఉన్మాదానికి హేతువు అనేది వుండదు.

అయితే తన ఇబ్బందిగురించి తనకుతెలుసు కాబట్టి వర్జీనియా వూల్ఫ్‌కి మరో విషయం కూడా తెలుసు. తనలో ఉన్మాద లక్షణం కన్పించగానే కుటుంబసభ్యులు మానసిక చికిత్సా కేంద్రంలోకి తీసుకువెళతారని తెలుసు. గతంలోనూ జరిగింది.

ఆసుపత్రిలో అందులోనూ పిచ్చాసుపత్రిలో జీవితం ఎంత భయంకరమో వర్జీనియా వూల్ఫ్‌కి తెలుసు. ఒంటరిగా వుండటమనే ఆలోచనే భయంకరం. అలాగని తోడుగా వున్న భర్తకు తగిన భార్యగా వుండటంచేతకావటంలేదు. భర్త జీవితం నరకంగా మారుస్తున్నది. సాధారణంగా పిచ్చివాళ్ళకి తాము ఏమి చేస్తున్నారో వారికి తెలియదు.

కాని వర్జీనియా వూల్ఫ్ పరిస్థితి వేరు. తనకు అన్నీ తెలుస్తున్నాయి. రచనలు చెయ్యగలుగుతున్నది. కాని ఏమిటో ఈ ఉన్మాదం అర్థం కాదు. ఇక లాభం లేదని తమ కుటుంబ వైద్యుని దగ్గరకు వెళ్ళింది.

ఈసారి ఎవరినీ తోడు రావద్దని ఒంటరిగా వెళ్ళింది.తనలో తిక్కరేగుతున్నదని చెప్పింది.ఏవేవో మాటలు వినిపిస్తున్నాయి. ఎవరెవరో పిలుస్తున్నారు. ఇకతర్వాత జరగబోయేది ఏమిటో,నా ఉన్మాద స్థాయి ఎలా వుంటుందో కూడా తెలుసు అని డాక్టర్‌కి అన్నీ చెప్పి "మీరు నాకో మాట ఇవ్వాలి... ఈసారి నాలో ఉన్మాద స్థితి వచ్చినా పిచ్చాసుపత్రిలో మాత్రం చేర్చవద్దు... ఆ పరిస్థితి నేను భరించలేను.

నన్ను పిచ్చాసుపత్రికి పంపను అని వాగ్దానం చెయ్యమని చెయ్యిచాచింది. కాని డాక్టర్ "ఆ వాగ్దానం విషయం సరే... నీ నవల ఎంతవరకు వచ్చింది... ఎప్పుడు పూర్తిచేస్తున్నావు?" అంటూ ఎదురుప్రశ్న వేశాడు.

తనను పిచ్చాసుపత్రికి పంపాలనే నిర్ణయం జరిగిపోయిందని వర్జీనియా వూల్ఫ్ అర్థంచేసుకుంది. డాక్టర్‌కి బై చెప్పి ఇంటికి వచ్చింది.

ఆ రాత్రి తాను రోజూ కూర్చుని రచనలు చేసే బల్లదగ్గర కూర్చుంది. ఆ రాత్రి అంతా రాస్తూనే వుంది. ఆమె ఆ రాత్రి రాసింది తక్కువ పేజీలే. ఆ తక్కువ పేజీలతోనే నవల పూర్తయింది. దానితోపాటే భర్తకు ఒక ఉత్తరం రాసింది.

నా మానసికస్థితి నీకు తెలియంది కాదు. అయినా ఇంత కాలం నన్ను భరించావు. ప్రేమించావు. ఆదరించావు. నేను జీవితంలో ఎప్పుడైనా సంతోషంగా రోజులు గడిపాను అంటే అది నీతోనే.

ఈ వెధవరోగం నన్ను పట్టుకోకపోతే మన జీవితం మరెంత హాయిగా, సుఖంగా గడిపేవాళ్ళమో కదా! ఐతే ఈ మానసికరోగం నన్ను ఓడిస్తోంది. ఆ ఓటమి నా కళ్ళముందు కనిపిస్తోంది. ఈ వాక్యాలురాస్తుంటేనావేళ్ళు ఒణుకుతున్నాయి.

ఆ తేడా ఈ ఉత్తరం చదివే నీకు అర్థమవుతుంది. ఇక నీ జీవితం మరింత నరకం చెయ్యదలచుకోలేదు. నేను తప్పుకుంటే నువ్వు మరింత ఆనందంగా జీవితం గడపగలవు. అందుకే తప్పుకుంటున్నా అన్న ఉత్తరం రాసింది. నవల ముగించింది.

కలం, కాగితాలు బల్లమీద వదిలేసింది. కుర్చీలో నుండి లేచి అలా మౌనంగా నడవటం మొదలు పెట్టింది. వారి ఇంటివెనుక ప్రవహిస్తున్న ఓస్ నదివైపు అడుగులు వేయబోతుండగా ఆమె మనసులో ఓ సందేహం. ఒకవేళ ఆ నదిలో తాను పూర్తిగా మునగకపోతే! అందుకే ఓవర్ కోట్ తొడుక్కుంది.

ఆ కోటు జేబులో నిండుగా రాళ్ళు నింపుకుంది. ఆ విధంగా బరువు పెరుగుతానన్నది ఆమె నమ్మకం. అలా నడుచుకుంటూ నదిలోకి వెళ్ళిపోయింది. వర్జీనియా వూల్ఫ్ రచయిత్రి ఆత్మహత్య చేసుకోవటం నాడు ఒక సంచలనం!

ఉత్తమ ప్రశ్నకు ₹500
ప్రతి ప్రశ్నకు ₹300 బహుమతి

# ఈ శీర్షిక మీదే

## ఉత్తమ ప్రశ్న - సమాధానం

కె.వి.ఎస్.ఎస్.ఎల్.ఎన్.నగేష్, విశాఖపట్నం
**తే**డా?
రోగం కుందేలులా వచ్చి తాబేలులా వెళ్తుంది. డబ్బు తాబేలులా వచ్చి కుందేలులా వెళ్తుంది.

## ఈ కార్టూన్ మీదే




టి.వి.రామకృష్ణ, కొత్తపేట
**ని**ద్రలో ఒక్కోసారి 'అరుస్తారు' ఎందుకు?
కల 'కనడం' వల్ల.

ఆర్.ప్రశాంతి, విజయనగరం
**చె**త్తరాతలు రాసేవారిని ఏమనాలి?
కిరాతకులు.

పి.వి.రమణకుమార్, చిలకలూరిపేట
**వి**ద్యార్థులు విస్తుపోయేది ఎప్పుడు?
చరిత్ర బోధించే ఉపాధ్యాయుడు గుర్రంమీద వచ్చినప్పుడు.

ఎమ్.కృష్ణ, కాకినాడ
**లా**ఠీ ఎత్తినా, బాటిల్ ఎత్తినా?
నిజానిజాలు తన్నుకొస్తాయి.



# B హ్యాపీ

"**మా** ఇంట్లో పోట్లాటలు వుండనే వుండవు తెలుసా" అన్నాడు గుర్నాథం గర్వంగా.

"అదేమిట్రా...అదెలా సాధ్యం" అని ఫ్రెండ్స్ అడిగితే "నేను మా ఆవిడ మాటకు ఎదురుచెప్పకూడదని పెళ్ళయిన మొదటిరోజే ఒట్టు వేసుకున్నారా"

**గా**యాలతో ఆసుపత్రికి వచ్చిన మనిషికి కట్టు కడుతూ "మిమ్మల్ని ఎక్కడో చూసినట్టుందే" అన్నాడు డాక్టర్. "సారీ డాక్టర్... మీరు అవన్నీ మరచిపోయి సరిగ్గా కట్టుకట్టండి డాక్టర్... నేను పొద్దున మీ దగ్గర లంచం తీసుకున్న తహసిల్దార్‌నండీ"

**ఒ**క రాజకీయ నాయకుడు పార్టీ మారాడు. "ఇప్పటికైనా వాస్తవంగుర్తించి మా పార్టీలోకి వచ్చావు మంచిది అన్నాడు ఆ పార్టీ నేత"

"వాస్తవం గుర్తించటం ఏమిటి! మీరు 20 కోట్లు ఇస్తామంటేకదా వచ్చా...ఇప్పుడు ఇవ్వరా! ఏమిటి"

"**మా** అబ్బాయిని ఇక వాడి ఫ్రెండ్స్ ఎవరూ ఏడి పించలేరు టీచర్. వాడికి కరాటే కోచింగ్ ఇప్పించాం.ఇప్పుడు వాడి సంగతి వాడు చూసుకోగలడు"

"అది నిజమే... కాని మీవాడిప్పుడు మా సంగతిని చూస్తున్నాడు" అంటూ వాపోయింది టీచర్.

**ఒ**క బామ్మగారు తన ఇద్దరు మనుమరాళ్ళను తీసుకుని జూకి వెళ్ళింది. అక్కడ పెద్ద కొంగలను చూపించి, అవే పసిపిల్లలను తీసుకువచ్చే పక్షులు, అని పాత కథనే చెప్పింది.

ఆ ఆడపిల్లలిద్దరూ ఒకరి ముఖం మరొకరు చూసుకుంటూ, ఇంత వయసు వచ్చింది కాని బామ్మకు అసలు విషయం తెలియదు.

పిల్లలు నిజంగా ఎలా వస్తారో చెపుదామా! అని చెవులు కొరుక్కున్నారు ఆ పిల్లలు.

**అ**హమ్మదాబాద్‌లో ఆలిండియా కాంగ్రెస్ సమావేశాలు జరుగుతున్నాయి.

అందరూ కొత్తగా కుట్టించుకున్న గాంధీటోపీలు పెట్టుకుని సమావేశాలకు హాజరయ్యారు.

అది చూసిన నెహ్రూ 'ఖాదీ' టోపీలకు దేశంలో గౌరవం లభిస్తున్నదనే "నిజమే... అయితే ఆ టోపీల కిందున్న బుర్రలు కూడా గౌరవించబడితే బాగుంటుంది" అని చురక వేశాడు.

**పె**ళ్ళికొడుకు వజ్రాల వ్యాపారి.

నిశ్చితార్థం రోజు పెళ్ళికూతురు చేతికి వజ్రపుటుంగరం తొడుగుతూ "బాగోలేదన్నప్పుడు తిరిగి మా షాపులో ఇస్తే ఆ రోజు ధర లెక్కకట్టి డబ్బు వెంటనే ఇస్తాం" అనేశాడు అలవాటుగా.

**ప**ట్నంలో ఉద్యోగం చెయ్యటానికి వెళుతున్న కూతురితో తల్లి "అబ్బాయిలను నీ గదికి రానివ్వకు" అని చెప్పింది.

నెలరోజుల తర్వాత తల్లి ఫోన్‌చేసినప్పుడు "నువ్వు చెప్పిన మాట నాకు గుర్తుందమ్మా... అందుకే ఎవ్వరినీ నా రూమ్‌కి రానివ్వటంలేదు...నేనే వాళ్ళ రూమ్స్‌కి వెళుతున్నా..." అంది కూతురు.

**రో**జూ ఏదో ఒక వస్తువు బదులు అడిగి తీసుకువెళ్ళే సూర్యకాంతం మీద కోపంతో వుంది సావిత్రి. అందుకే ఆ రోజు మధ్యాహ్నం సూర్యకాంతం వస్తుండగానే "మా ఇంట్లో వస్తువులన్నీ నిండుకున్నాయి ఏవీ లేవు" అంది కసిగా.

అందుకు సూర్యకాంతం ఏమాత్రం తడుముకోకుండా "లేదు వదినా నేను అందుకు రాలేదు... ఇవ్వాళ మా వంటావిడ రాలేదు... కొంచెం అన్నయ్య గారిని బదులుగా పంపుతావేమోనని" అంది.

జయించగలమనే విశ్వాసంగలవారే తప్పక జయిస్తారు.